శ్రీ

# ఆంధ్రకవితరంగిణి

## తొమ్మిదవ సంపుటము

రచయిత :

శ్రీ చాగంటి శేషయ్యగారు

ద్వితీయ ముద్రణ : డిసెంబర్ ,1999

ప్రకాశకులు :

హిందూ ధర్మశాస్త్ర గ్రంథ నిలయము,

ప్లాట్ నెం. 103ఎ, మర్కజీమర్యాద అపార్టుమెంట్స్, అడిక్‌మెట్, హైదరాబాదు.

వెల : 250/

శ్రీ

# ఆంధ్రకవితరంగిణి

## తొమ్మిదవ సంపుటము

రచయిత :

శ్రీ చాగంటి శేషయ్యగారు

ద్వితీయ ముద్రణ : డిసెంబర్, 1999

ప్రకాశకులు :

హిందూ ధర్మశాస్త్ర గ్రంథ నిలయము,

ప్లాట్ నెం. 103ఎ, మర్కజీమర్యాద అపార్టుమెంట్స్, అడిక్‌మెట్, హైదరాబాదు.

వెల : 250/-

9

# విషయసూచిక

శ్రీ రామచంద్ర

# ఆంధ్రకవితరంగిణి

## (తొమ్మిదవ సంపుటము)

---

## 132 రాధామాధవకవి

### [చింతలపూడి ఎల్లనార్యుఁడు]

ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; శ్రీవత్స గోత్రుఁడు; కృష్ణభట్టారక పౌత్రుఁడు; రామయప్రభు సుపుత్రుఁడు; లచ్చమాంబ యీతని తల్లి.

ఈకవి రాధామాధవము, తారకబ్రహ్మరాజీయము నను రెండు త్తమకావ్యములను రచియించి యాంధ్రలోకమున కొసంగియుండెను. రాధామాధవమునఁ గవి తనను గూర్చి యిట్లు చెప్పుకొనియున్నాఁడు.

సీ. శ్రీవత్సలాంఛన శ్రీముఖాంబుజమున
శ్రీవత్స మునికులశేఖరుండు
ప్రభవించె నా మహాభాగు వంశాంబుధి
దివ్యరత్నంబుల తెఱఁగుమీఱ
బుట్టిరనేకులు పురుషార్థపరులైన
వారు వారలలోన వంశకర్త
వర్ణిత సత్కీర్తి వల్లభుఁడొప్పారె
నతనికి శ్రీకృష్ణుఁడవతరించె
ఆ. నతనియందుఁ గామనార్యుండు జన్మించె
నతనికేను లచ్చమాంబయందు
జననమొంది నెల్లసత్కవి చంద్రుండ
సరసహిత చకోరసఖ్య మలర.

ఈమహాకవి తాను రచించిన రాధామాధవమును ఆంధ్రభోజ బిరుదాంచితుఁడును గర్ణాటప్రభువునైన శ్రీకృష్ణదేవరాయలకుఁ జదివి

విన్పింపఁగా నాతఁడు మిగుల నానందమొంది యాకవికి రాధామాధవుఁడను బిరుదమిచ్చి రత్నాంబరంబులతో విశేష బహుమానము లొసంగి పూజించెనని కవి రాధామాధవుఁడు నీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

శా. రాధామాధవ మచ్యుతాంకితముగాఁ బ్రౌఢక్రియం జెప్పి త
న్మాధుర్యంబునఁ గృష్ణరాయవిభుఁ గర్ణాటేశు మెప్పించి నా
సాధాతృ ప్రతిమాన సత్కవులలోనన్ భూషణశ్రేణితో
రాధామాధవ నామమందిన జగత్ప్రఖ్యాత చారిత్రుఁడన్.

ఈపద్యమందలి "ధాతృప్రతిమానసత్కవి" శబ్దమునఁ గృష్ణరాయల యాస్థానకవియగు కవితా పితామహ బిరుదాంకితుఁడైన యల్లసాని పెద్దనామాత్యుఁడు సూచింపబడియెనని తలంపవచ్చును. ఈపెద్దనామాత్యుఁడు నగరు, తగరు, తొగరు, వగరు అను పదములను బ్రాసస్థానములయందుంచి భారత భాగవత రామాయణ పరములుగా బద్యములను జెప్పుమని రాయలయాస్థానమున కెల్లయార్యుఁడు వచ్చి నప్పుడాతని నడిగెననియు నత డీక్రిందిపద్యములను రచియించె ననియు జెప్పుదురు.

చ. నగరు పగాయె నింక విపినంబుల కేగుడు రాజ్యకాంక్షకుం
దగరు కుమారులార! యని తల్లి వగల్మిగులంగ దోపగా
దొగరున రక్షగట్టి మది దోపక గద్గదఖిన్నకంఠయై
వగరుచుచున్న జూచి రఘువంశవరేణ్యుఁడు తల్లి కిట్లనున్.

చ. వగరుపు మాత్రమే వరుడు వశ్యుడు కాడు సఖీ సఖిత్వ మె
న్న గరుడవాహనుండు మము నాడటు డించుట యెల్ల నుద్ధవా!
తగరని కాక మోహపులతాతను వైన విడంగ జూతురే!
తొగరుచి యోషధీశునకు దోపగ జేయునె వీడనాడగన్.

చ. తొగరుచి కన్నుదోయి గడు దోపగ గద్దడు భీమసేనుపై
దగరు ధరాధరంబుపయి దాకిన భంగిని దాకి నొచ్చితా

వగరుచుచున్ వెసం బరుగువాఱిన నచ్చటి రాజలోకముల్
నగరు సుయోధనాజ్ఞ మది నాటుటజేసి ధరాతలేశ్వరా!

ఈకవి తనగ్రంథమును కృష్ణరాయల కంకితమీయలేదు. మదన గోపాలస్వామికి కృతియిచ్చియుండెను. ఇతడు భూపతులకు కృతుల నిచ్చుటకిష్టములేనివాడై నట్లీ క్రింది పద్యములలో జెప్పియున్నాడు.

ఆ. నన్ను గన్న ఫలము నాతల్లిదండ్రుల
వంశమునకు మిగుల వన్నెగలుగ
సకల పితృగణంబు శాశ్వత బ్రహ్మలో
కైక సుఖము లందునట్లుగాను.

క. నాయకరత్నము లక్ష్మీ
నాయకు హరినిష్టదాత నాకృతికి బతిం
జేయుదు భూములకగు భూ
నాయకులను బరుల గైకొనక పటుబుద్ధిన్

ఇతనియుద్దేశ మెఱింగి సరసుడును రసగ్రహణ పారీణుడు నగు కృష్ణదేవరాయలీతని సత్కరించి, గ్రంథనామమునే యాతనికి బిరుదముగా నొసంగి గౌరవించెను. ఈకవి పరులనాశ్రయించి తనకవితకు గౌరవముదెచ్చుకొనవలయునను నూహకలవాడు కాడు. తన కవిత యందు రసమున్నచో లోకము గౌరవింపక మానదను ధైర్యముకల వాడు. ఈభావములీక్రింది రెండు పద్యములలో బ్రతిఫలించుచున్నవి.

చ. సరవి నొనర్చు సత్కవుల చక్కని కావ్యకలాప మర్మముల్
నిరుపమ కోవిదుల్ దెలియనేర్తురు గాని యెఱుంగజాల రొం
డొరులు చకోరకప్రకర ముజ్జ్వలపూర్ణసుధాంశు చంద్రికో
త్కరము చవానునట్లులుగ దక్కిన పక్షికులం బెఱుంగునే

చ. సరసులు చిత్తగింపుడని చాటను మామకవాణి సన్మనో
హరయగునేని, వారి హృదయంబుల కింపొనరింపకున్నె? యె
వ్వరు పిలువంగ వచ్చి యళివర్గము లాత్మల జొక్కు దేనియల్
గురియు ప్రసూనగుచ్ఛ భరకుంచిత మల్లిమతల్లి కావనిన్.

శ్రీకృష్ణభగవానుడు కలలో గన్పడి యాజ్ఞయిడుటచే దా నీరాధామాధమును జెప్పితి నని కవి యీక్రింది పద్యములలో జెప్పి యున్నాడు.

కం. బోధించి యిష్టదైవము
రాధాసతిగూడి సౌమ్యరమ్యాకృతి హృ
త్సౌధమున దోచి కృష్ణుడు
రాధామాధవము చెప్పరా! యనిపలికెన్.

తే. ఇష్టదైవంబు పొడకట్టి హృదయవీధి
దనకు గృతిజెప్పుమని ప్రసాదంబు సేసె
నింతకంటెను సౌభాగ్య మేమిచెప్ప
దైవకృప గల్గలేని వింతలె శుభములు.

రాధామాధవము సంస్కృతమున జయదేవకవి రచియించెనని కవి యీక్రింది పద్యములో వ్రాసియున్నాడు.

క. నుతియించితు వాగ్విశేష
స్థితి రాధామాధవంబు చెప్పినవిద్యా
చతురానను నీలాచల
పతిహితు జయదేవసుకవి వంచప్రదరన్.

జయదేవకవి నామధారులు మువ్వురున్నారు. అందిరాధా మాధవకావ్యమును రచియించిన జయదేవుడెవ్వరో నిశ్చయింపలేము. ఈవిషయమునుగూర్చి జయదేవకవి చరిత్రమున జర్చించియున్నాడను,

ఈకవి రచించిన రాధామాధవమందలి రాద పరకీయ కాదు. ఈతనితరువాత రాధాకృష్ణవిలాస మనుపేర కృష్ణదాసును, రాధామాధవసమాగమమనుపేర, నెడపల్లి వేంకటపతియు రాధామాధవ సంవాదమనుపేర వెలిదిండ్ల వేంకటపతియు, రాధికాసాంత్వన మనుపేర ముద్దుపళనియు బ్రబంధములను రచియించియుంచిరి. వీరి గ్రంథము లన్నిటియందును రాధ పరకీయగా వర్ణితమైనది. ఈరాధామాధవుల

కథ భాగవతాదులయందు లేదు. ఈ విషయమున రాధామాధవ పీఠికయందు విమర్శాదర్శక శ్రీ నడకుదుటి వీరరాజు పంతులుగారిట్లు వ్రాసియున్నారు.

"బ్రహ్మవైవర్త పురాణమున రాధాదేవీ పరమోత్కృష్టము వివిధ విశేష మహిమలతో వర్ణింపబడియున్నది. అప్పురాణమునందు విష్ణుదేవునకు లక్ష్మీదేవివలెనే త్రిమూర్తులకును మూలకారణుడైన శ్రీకృష్ణదేవునకు నీరాధాదేవి నిత్యానపాయినియైన దేవిగా నభివర్ణింపబడియున్నది. మఱియు నందు నీరాధయే మూలప్రకృతిగను శ్రీకృష్ణుడే యాది పురుషుడుగను గీర్తింపబడిరి."

భగవంతునియెడ భక్తునికిగల యెడతెగని ప్రేమము, స్వైరిణికి నుపపతియందు గలుగు నిరంతర దృఢతరానురాగమువంటిదను ననుభవ సాధ్య దృష్టాంతమును రూపకముగా బ్రదర్శించుటకుగాను బ్రహ్మవైవర్త పురాణకారుడు శాపమిషంబున మూలప్రకృతీ స్వరూపిణియైన రాధాదేవిని భూలోకమునకు దెచ్చి యామెకు బరకీయా భూమికను గల్పించి యాత్మభర్తయైన శ్రీకృష్ణునినే యుపభర్తగా జేసి, యామెకు నాతనియెడగల నిరతిశయానురాగవ్యాజమున బరమభక్తినే (లోకమునకై) ప్రబోధించినాఁడు. ఇక్కథలోని బహిర్భావమునుమాత్రమే కావ్యవస్తువుగాఁ బరిగ్రహించిన యితర కవులు రాధికను కేవలజారిణిగనే ప్రదర్శించి తమ తమ గ్రంథముల నతివేల శృంగారరసవాహినులలోఁ దేల్చివైచినారు. భక్తిపరిబోధమునకై పురాణకర్తచేఁ గల్పింపబడిన యిక్కథ యిక్కవులచే వ్యత్యస్తముగాఁ బరిణమించినది. మన రాధామాధవకవి యట్టిమార్గము ననుసరింపక లక్ష్మీనారాయణులనే రాధామాధవులనుగాఁ జేసికొని యిమ్మనోహర కావ్యరాజమును శృంగార రసానుప్రాణితమైన భక్తిరస సుధా సాగరముగాఁ జేసివైచినాఁడు. మఱియు, పల్లవనాయకుఁడైన సహస్రగోపుని తనయయగు రాధను దేవీమూర్తిగనే భావించి యామెనువర్ణించుపట్టునఁ (గవిసంప్రదాయానుసారము) పాదాదిశిరఃపర్యంతము నవయవవర్ణనము నొనర్చియు

న్నాఁడు. ఇట్టి భక్తితాత్పర్యముచేతనే యీతనికి గవితాతాదాత్మ్యము గలిగి రాధామాధవత్వము ప్రాప్తించినది.

ఇకావ్యమునందంతటను బవిత్రమైన రాధామాధవతత్త్వమే ప్రతిపాదితమై యున్నది.

సీతారాములవలెనే విష్ణుభక్తులకు రాధాకృష్ణులు నభీష్టదైవతములై యున్నారు. రాధాదేవిగాక రుక్మిణ్యాద్యష్టమహిషులు శ్రీకృష్ణునకు ధర్మపత్నులై యున్నట్లు పురాణాదులయందున్నను, భక్తులెల్లరు రాధాకృష్ణ నామమునకే ప్రియపడెదరు. మరియు, వారు తక్కిన యేదేవేరుల నామములతోడను శ్రీకృష్ణనామమును జేర్చి సంస్తుతించుచున్నట్లు (రుక్మిణీకృష్ణ, సత్యభామాకృష్ణ...ఇత్యాదిగ) గానరాదు."

ఈమహాప్రబంధమును గోదావరి మండలమందలి కపిలేశ్వరపురము జమీందారుగారగు శ్రీ బలుసు బుచ్చిసర్వారాయఁడుగారు వీరరాజుపంతులుగారి పీఠికతోఁ జక్కగాఁ ముద్రింపించి యున్నారు. ఈరాధామాధవము శ్రీకృష్ణదేవరాయల జీవితకాలములో ననఁగా క్రీ.శ. ౧౫౨౦-౩౦ నడుమ రచితమయ్యెనని చెప్పవచ్చును.

ఈకవిరచించిన రెండవగ్రంథము తారకబ్రహ్మరాజీయము. ఇది సంస్కృతమున నారాయణాశ్రముఁడు రచించిన గ్రంథమున కాంధ్రీకరణమని కవి యీక్రింది వాక్యములలోఁ జెప్పియున్నాఁడు.

"శ్రీరామబ్రహ్మ తారకరాజీయంబు పరమభాగవతోత్తముండు ప్రయాగ క్షేత్రవాసి నారాయణాశ్రములను మహాయతీశ్వరుండు సంస్కృతంబున రచియించె నది తెలుంగున సకలజనులకుం దెలియునట్లుగా..."

ఈగ్రంథమెన్ని యాశ్వాసములో తెలియదు. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నాల్గవయాశ్వాసమువఱకున్న ప్రతియొకటియు రెండాశ్వాసములు గల ప్రతియొకటియునున్నవి. ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమున నొక ప్రతికలదు.

ఈకవి యీగ్రంథము నచ్యుతరాయలకడ కందాచారమును (**Military accounts**) వ్రాయునంజయతిమ్మరుసు కోర్కెపై శ్రీరామచంద్రున కంకితముచేసెను. నంజయకుమారుఁడు తిమ్మరుసు నియోగి బ్రాహ్మణుఁడు; కాశ్యపగోత్రుఁడు; నంజయ తిప్పాంబలకుఁ బుత్రుఁడు రాయమంత్రి తిప్పాఁబలకు బౌత్రుఁడు; ఈతిమ్మరుసుభార్య లింగాంబిక. ఈదంపతులకు నంజయ యనుకుమారుఁడు కలఁడని యీక్రింది పద్యములలో గవి చెప్పియుండుటచే, కృతిప్రదానకాలమునాటి కాతని కేఁబదేండ్లుండునని తలంపవచ్చును.

క. శృంగారవతీమణి పు
ణ్యాంగన నంజరుసు తిమ్మనార్యుని సతియౌ
లింగాంబిక యంబిక కెన
మంగళసూత్ర ప్రభావ మానధనములన్.

ఉ. ఆహరిణాక్షియందు సుగుణాఢ్యుఁడు తిమ్మరుసయ్యగాంచె దే
జోహరి సత్కృపాహరి విశుద్ధయశోహరి నిత్యభోగ ల
క్ష్మీహరి నంజమంత్రిని సమిద్ధకులాంబునిధీంద్రచంద్రునిన్
మోహనపుష్పసాయక సముజ్జ్వల రూపవిశాల వైభవున్.

అచ్యుతదేవరాయలు ప్రతిసంవత్సరమును శ్రీ వేంకటేశ్వరున కొక్కొక్క ప్రబంధమును రచియింపించి సమర్పించుచున్నట్లీ క్రిందివచనములవలనఁ దెలియుచున్నది.

"అమ్మహామహీశ్వరుం (నంజయతిమ్మరుసు) డొకనాఁడు చతుస్సముద్ర ముద్రిత మధ్యభూభువన సింహాసనాధీశ్వరుండగు నచ్యుతదేవరాయల కొలువు చేసివచ్చి నిజనివాస భాసురచంద్రశాలా ప్రాంగణ మణిమంటపంబున విజయనగర రాజధానింగల బంధువర్గంబును విద్వత్కవీంద్రులును వందిమాగధగాయక వారకామినీ నికరంబును సముచిత ప్రకారంబున సేవింప సుఖగోష్ఠిం బ్రవర్తింపుచు నిజస్వామియగు నచ్యుతదేవరాయలు ప్రతిసంవత్సరంబు శ్రీ వెంకటేశ్వరునకు సత్కావ్య ప్రబంధ పుష్పాంజలి సమర్పించుచుఁ గీర్తిసుకృతంబులు నిర్వహించుకొను

చున్నవాఁడు. తదనుమతంబున నవ్విభునకు నాకు నభ్యుదయ పరంపరాభివృద్ధియుఁ జతుర్విధపురుషార్థసిద్ధియుఁ గలుగువట్లుగా నాయిష్టదైవంబగు శ్రీరామచంద్రునకు నంకితంబుగా నొక్కపుణ్యప్రబంధంబు చెప్పింపవలయునని సువ్యాజ్జనంబులతో" నాలోచించి

క. రాధాకుణాధరోరుప
యోధర కాశ్మీర పరశురసరసోదయ కవితా
మాధుర్యధుర్యు నన్నున్
రాధామాధవుని సుకవిరత్నముఁ బలికెన్.

కృతిపతియుఁ గృతినాయకుడును బంధువులైన ట్లీక్రిందిపద్యము సూచించుచున్నది.

ఉ. నావుఁడు నీకు నంకితమొనర్పఁదలంచినవాఁడ బంధు సం
భావన నీకు నిష్టముగ బ్రహ్మమయుం డగురామభద్ర ధా
త్రీవరమాళికంకిత మిదే యొనరించి (రచింతు) నైఁడికిన్
దావి ఘటిల్లె నేమియన నంజయతిమ్మ! వివేకభూషణా!

కృతిపతిని వర్ణించిన పద్యములలో రెండిటి నీక్రిందనిచ్చుచున్నాఁడను.

చ. తిరుపతిగెల్చి పాండ్యనరదేవుని పట్టముగట్టి యుత్కళే
శ్వరుఁ గరుణించి మ్రొక్కిన సవాయికిఁ దా నభయంబొసంగి పెం
పరుదుగఁ గీర్తిఁ జేకొనిన యచ్యుతరాయల మంత్రిరత్నమై
తిరముగనున్న నంజవిభుతిమ్మరుసుం దగుఁ బ్రస్తుతింపఁగన్.

ఉ. వేదపురాణశాస్త్రముఖవిద్యల కెల్ల గురుండు బ్రహ్మ వి
ద్యాదృఢబుద్ధినేర్పు విపులన్నియు వార్య, సమస్తదేశ భా
షాదు లెఱుంగు స్వామి హితమైన ప్రయోజన మాచరించునా
వాదిశిలం బ్రసిద్ధుఁడగు నంజయతిమ్మనిఁ బోలరెవ్వరున్.

అచ్యుతరాయలు క్రీ.శ. ౧౫౩౦ మొదలు ౧౫౪౨ వరకును విజయనగర సింహాసనమందున్నవాఁడు. రాధామాధవకవి యీమధ్య

కాలములోఁ దారక బ్రహ్మ రాజీయమును రచియించి నంజయతిమ్మరుసున కంకితముచేసెను. ఈకవికాలము క్రీ. శ. ౧౪౮౦–౧౫౫౦ అని తలంపవచ్చును.

ఈతని రాధామాధవమునననుసరించి, మల్లన కవి రాధాముకుంద మనుపేర నొకపద్యకావ్యమును రచియించెను.

ఈ యెల్లయార్యకవి విష్ణుమాయానాటకమును రచియించెనని యాగ్రంథముద్రిత ప్రతులు చెప్పుచున్నవి. ఆగ్రంథమీ యెల్లయార్యునిది కాదనియు, నాగ్రంథకర్త, మడికి యనంతయ్యయనియు, నేనా యనంతయ్య చారిత్రమున వ్రాసియుంటిని. పాఠకులీసందర్భమున నా చారిత్రము నొకమారు మరలఁ జదువవలసియున్నది. అందుపైని శ్రీ వేదము వెంకటరాయ శాస్త్రులవారిక్రిందివాక్యములను వ్రాసి విష్ణుమాయానాటకగ్రంథకర్త మడికి యనంతయ్య కాఁడనియు, నీయెల్లయార్యుఁడే యాగ్రంథమును రచియించెననియు నిర్ణయించియున్నారు. ౧

" మడికి సింగయ్యకు అనంతయ్యయను సోదరుఁడు కలఁడు. కాని అతఁడు వీరివిమర్శచే కవిగా నెలకొన్నాఁడు. వీరికాధారము నామసామ్యము వహించుటచేతను, గోత్రము లొకటే యగుటవలనను, విష్ణుమాయానాటక గ్రంథకర్తయైన యనంతకవియు, మడికి యనంతయ్యయు నొకరేయని వీరి నిర్ణయము. వీరు మరచిపోయినది, లేక వీరికి తెలియని విషయ మొకటికలదు. రాధామాధవమతము మడికి సింగన కాలమున నాంధ్రదేశమున లేదు. భాగవత కథలను గొనిరచించిన పారిజాతాపహరణాదులుకూడ తర్వాతివే. ౧౬ వ శతాబ్దమధ్యము వఱకును ఈ మతానుసారి గ్రంథములు బయలువెడలలేదు. రాధామాధవ మతాభినివేశముతో రచితమైన యీ విష్ణుమాయానాటకము రాధామాధవకవిదే గాని మడికి అనంతయ్యది కాదు. తర్వాతి అనంతయ్య దొంగయగుటచేతను, మడికి అనంతయ్య చాలప్రాచీనుడగుటచేతను, చారిత్రకదృష్టిలేని శేషయ్యగారి మతము నిలువదు. (శ్రీ)కోరాడ

---

౧ భారతి సం ౨౬ పుట ౨౦౪.

రామకృష్ణయ్యగారి యభిప్రాయమే సమంజసము. ఏదో నూతనసిద్ధాంతము నెలకొల్పుచున్నామను భావముతో వీరు అసలు విషయమును చూడలేదు.'' అని వారు వ్రాసినారు.

విష్ణుమాయానాటకకర్త యెల్లయార్యుఁడే కాని యనంతయ్య కాఁడనుటకు శ్రీ శాస్త్రిలుగారు పైవిమర్శనమునఁ జూపిన హేతువులు మూఁడు.

౧. అనంతయ్య కవి కాఁడు.

౨. మడికి సింగన కాలమున రాధామాధవమత మాంధ్రదేశమున లేదు.

3. విష్ణుమాయానాటకము రాధామాధవ మతాభినివేశముతో వ్రాయబడినది. కావున రాధామాధవ మతము నెలుఁగని కాలమున నీగ్రంథము బయలువెడలుట యసంభవము.

## (౧) అనంతయ్య కవి కాఁడా ?

అనంతయ్య నావిమర్శనమువలనఁ గవిగా నెలకొనలేదు. ఒక తాళపత్రప్రతియందున్న గ్రంథాంత గద్యవలనఁ గవిగా నెలకొనినాఁడు. గోత్రమును బితృనామమును గొన్ని యితర సందర్భములును సరిపోవుటచే నాగద్యయందు నెలకొనిన యనంతయ్య మడికి సింగనకు సోదరుఁడని నేను నిర్ణయించితిని. సింగన, తన తమ్ముఁడు కవియని చెప్పనంత మాత్రమునఁ నాతఁడు కవికాఁడనియు నాతనిని నావిమర్శనమే కవిగాఁ జేసిన దనియుఁ దలంపరాదు. తెనాలి సోదరకవులు ఒకరినొకరు తమతమ గ్రంథములలోఁ గవులని చెప్పలేదు. తాళ్లపాక కవులు నట్లే చెప్పలేదు. ఇట్టివారు మఱికొందఱుండవచ్చును. అంతమాత్రమున వారు కవులు కాకపోలేదు.

చింతలపూఁడి యెల్లనార్యునకుఁ దరువాతి కాలమున గోత్రమును పితృనామమును సరిపోయిన మఱియొక యనంతయ్యను శ్రీశాస్త్రిలుగారు చూపిరేని, వారికి వందనములొనర్చి నాయభిప్రా

యమును మార్చుకొనియుందును. శ్రీ శాస్త్రిలుగారట్టి యనంతయ్యను జూపలేదు.

## (౨) మడికి సింగనకాలమున రాధామాధవ మతమాంధ్రదేశమున లేదా?

రాధామాధవమతము బ్రహ్మవైవర్త పురాణమున విపులముగాఁ జెప్పఁబడినది. ఆమతము చైతన్యునితో వచ్చినదికాదు. బ్రహ్మవైవర్తపురాణము మడికి సింగనకుఁ దరువాతఁ బుట్టినదికాదు. రాధామాధవనామములును ఆకథలయందలి భక్తి, ప్రేమ భావములును బ్రహ్మవైవర్త పురాణమును బదునాలవ శతాబ్ది మధ్యభాగమువఱకును ఆంధ్రులెఱుంగరని తలంచుట యన్యాయము.

రాధానామము ప్రత్యేకముగాఁ జెప్పకున్నను. రాధామాధవ తత్వమే శ్రీకృష్ణలీలయందు భాగవత దశమస్కంధమునఁ జెప్పబడినదని పండితులంగీకరించియున్నారు. ఆభాగవత దశమస్కంధమును మడికి సింగన ద్విపద కావ్యముగా రచియించియుండెను. పారిజాతాపహరణ కథను హరివంశమునుండి తిమ్మయాఖ్యుఁడు గ్రహించెను.

బ్రహ్మవైవర్త పురాణమును జదివి రాధామాధవ తత్త్వమును అనంతయ్య తెలుసుకొనియుండెనని భావించుటలోఁ దప్పులేదు, ఇంతకును:—

## (౩) విష్ణుమాయా నాటకము రాధామాధవ మతానుసారియా?

రాధామాధవతత్వమన నేమియో రాధామాధవ పీఠికాకారులు వ్రాసిన వాక్యములవలనఁ (పైనినుదాహరించితిని) దెలియఁగలదు. ఆమతమునుబోధించు కథలుగాని వాక్యములుగాని విష్ణుమాయానాటకమున లేవు. ఈగ్రంథమునకు విపులమైన పీఠిక వ్రాసిన శ్రీ కోరాడ రామకృష్ణ పండితుల కిందు రాధామాధవమతము గన్పడలేదు. ఆమతమును గూర్చి వారేమియు నందు వ్రాయలేదు.

ఈగ్రంథమున సంశయాస్పదములైన యాశ్వాసాద్యంత పద్యములందక్క మఱియెచ్చటను రాధానామ ముదాహృతముకాలేదు. "గోప

వధూసహస్ర గోబృంద కసత్కదంబ విటపీ వ్రజకేళివిహార" "కలశాంభోనిధి కన్యకాకుచతటీకస్తూరికా పంకసంకిలసుస్నిగ్ధవినీల" అని యాశ్వాసాంత పద్యములయందున్నది. గ్రంథమంతయుఁ బూర్తియైనపిదప ధర్మరాజు శ్రీకృష్ణుని నుతించు దండకమున మాత్రమే రాధానామము గన్పడుచున్నది. రాధామాధవకవి రచియించినట్లు గన్పడు గద్యమునుబట్టి యీగ్రంథము రాధామాధవ మతానుసారియని తలంచిరేమోగాని రాధామాధవతత్వ మిందించుకంతయును లేదు.

రాధామాధవ తత్త్వమును దెలుపుటకే గ్రంథముద్దేశింపబడలేదు. నేనే గొప్పవాఁడనను నహంభావ మెవ్వరికినుండఁగూడదనియు, నట్టియహంభావపూరితులగువారి గర్వమును బరమేశ్వరుఁడడఁచివేయుననియు సర్వజ్ఞుఁడు సర్వశక్తుఁడు శ్రీమహావిష్ణువొక్కఁడేయనియు బోధించుటకీగ్రంథముద్దేశింపఁబడినది. శ్రీకృష్ణునకత్యంతము ప్రియురాలైన సత్యభామయు; శ్రీమహావిష్ణునిభార్యయైన లక్ష్మీదేవియుఁ; కుమారుఁడును. సృష్టికర్తయునైన బ్రహ్మయు; పరమభక్తాగ్రేసరుండును బ్రహ్మమానసపుత్రుఁడునైన నారదుఁడును; జగదీశ్వరుఁడైన యీశ్వరుఁడును గూడ నహంభావ పూరితులై యెట్లు భంగపడిరో వారిగర్వములనా శ్రీమహావిష్ణువెట్లుడంచెనో తెలుపు కథలే యిందు వర్ణితములైనవి. విష్ణుమాయానాటకమున రాధాకృష్ణ మతతత్త్వము లేదు. కావున క్రీ.శ. ౧౫౫౦ సంవత్సరము దాఁటినపిమ్మటఁగాని యిట్టిగ్రంథనిర్మాణమున కవకాశము లేదని నిర్ణయించిన శ్రీశాస్త్రిలువారి యభిప్రాయముతో నేకీభవింపజాలను.

నాయభిప్రాయమును మార్చుకొనవలసిన యవసరమును దెలుపు హేతువులు శ్రీశాస్త్రిలువారి విమర్శనమున లేవు. అందుచే నీయెల్లయ కవి రచనములలో విష్ణుమాయానాటకమును జేర్చలేదు. ఆగ్రంథకర్త యనంతయ్యాయనియే యిప్పటికుని నావిశ్వాసము.

రాజమహేంద్రవరమున శుకబ్రహ్మచే స్థాపితుఁడైన గోపాల స్వామి యుండెననియు, నాస్వామికిఁ గాటయవేముఁడు కుమారగిరి

రెడ్డితోఁజెప్పి యనపర్తిగ్రామము నిప్పించెననియు ననపర్తిశాసనము వల్లఁ దెలియుచున్నది. విష్ణుమాయానాటకమునఁ బలుతావుల శుక బ్రహ్మయని పేర్కొనుటనుబట్టియు నాగ్రంథమును గోపాలస్వామికంకితముసేయుటనుబట్టియు నాకృతికర్త మడికి యనంతయ్యయని నిర్ణయించుటలో నావిశ్వాసము మఱింత దృఢమైనది. అనంతయ్య తండ్రియైన యయ్యలమంత్రి, రాజమహేంద్రపురి కధిపతియైన తొయ్యేటి యనపోతభూపాలునికడ మంత్రిగానుండినట్లు వాసిష్ఠ రామాయణకృత్యాది యందు సింగనకవి చెప్పియున్నాఁడు. అనంతయ్య తన కృతిని రాజమహేంద్రవరమందు శుకబ్రహ్మచే స్థాపితుఁడైన గోపాలస్వామి కంకితముచేసెనని నిశ్చయింపవచ్చును. ౧

శ్రీనాథుని పద్యములను బోలిన పద్యములు రాధామాధవ కవికృత రాధామాధవ గ్రంథమునఁగలవని శ్రీ బులుసు వేంకటరమణయ్యగారును౨ పింగళిసూరనార్యుఁడీతని రాధామాధవము నాదర్శముగాఁ గైకొనెనని శ్రీ వీరరాజుపంతులుగారును 3 వ్రాసియున్నారు.

ఈతనికవిత్వము ద్రాక్షాపాకమున మృదుమధురపదసంయుతమై హృదయంగమముగా నున్నది. ఎల్లయార్యుఁ డుత్తమ కవుల తరగతిలోఁ జేర్పఁదగినవాఁడు.

వ్యాకరణ సంబంధములయిన కొన్ని నెరసులున్నను, నీతని కవిత్వము శ్రీవీరరాజుపంతులుగారనినట్లు ప్రౌఢమై ద్రాక్షాపాకలలితమై హృదయంగమమై యొప్పారుచున్నది. శైలి తెలియుటకై కొన్ని పద్యముల నుదాహరించి యీతని చారిత్రమును ముగించెదను.

ఉ. శ్రీయుతమూర్తి గోపకులశేఖరు నందకుమారు రూపు నా
రాయణుఁ జూచియున్ జనపరంపరచే వినియు న్మనంబులన్
బాయనివంత వేఁగిరి నృపాలక ! సర్వజగంబులందుఁ బ
ద్మాయతనేత్ర లెల్లమదనాశుగ సంప్రభవానలార్చులన్. ౧౪౧౦౹

౧. ఆంధ్రకవితరంగిణి. ౨వ సంపుట. ౧౮౮ పుట.
౨. భారతిసం ౧౩ భా ౨ పుట ౩౨౧.౩౨౬
3. రాధామాధవ పీఠిక.

ఉ. ఈతరళాయతాక్షి రచియించెడి చాతురి యెట్లు గల్గెనో
ధాతకు ధాతచేత రచితంబగునే యిటువంటి రూపు నేఁ
జూతునకాదె యక్షసుర సుందరులన్ సృజియించువేళలం
దేతదనూన విభ్రమము లెక్కడి వ్రాచిగురాకుబోండ్లకున్. ౨౮౫౫

ఉ. కోరికఁజేరి కామినులకుంతలముల్గబళించి మించి పై
చీరచెఱంగెడల్చి కుచసీమలయందు సుగంధఘర్మవాః
పూరముదీర్చి మర్మపథముల్ దగనంటుచు సంవృతాత్ముఁడై
కూరిమిసల్పునట్లు దిరుగు న్మలయానిలుఁ డప్పురంబునన్. ౩౮౭౭

ఉ. రాజకళావిశేషముఁ దెరల్చి విభావరినంటుమాన్చి పా
థోజనికిం బ్రియంబొసఁగు తొందరవచ్చె నినుండు వచ్చె మీ
ర్వోజరగుండు విచ్చియని వేగరి వేగరికాఁడు తారకా
రాజికిఁ జెప్పవచ్చెననఁ గ్రుక్కనఁ జుక్క వెలింగెఁ దూర్పునన్.

ఉ. నాసరి గొల్లవారని మనంబునఁ జూచెదవేమొ కౌముసూ
పాసిన దాకళంకము కృపానిధియైన సువర్ణభూధరే
ష్వాసనుచేత రాజ్యమహిమాతిశయంబును భూపతిత్వమున్
వాసియుఁ గల్గినాము సరివారె? మహీశులు మాకు నీభువిన్.

తారకబ్రహ్మరాజీయము:—

శా. శ్రీరాజీవదళాక్షు కౌస్తుభమణీసింహాసనం బెక్కి య
ర్కారూఢస్ఫుట దీప్తియుంబలెన పెంపారన్ నభోమండలా
ధార శ్రీ విలసిల్లు విష్ణుఁడుజగత్కల్యాణచారిత్రగం
భీరున్ నంజయతిమ్మమంత్రివరు లక్ష్మీవంతునిం జేయుతన్. ౧౮౧

క. అక్షయ కరుణాసంప
ద్వీక్షి విశాలాక్షితోడ విశ్వేశ్వరుఁడే
సాక్షాత్కరించె నని ప
ద్మాక్షియుతున్ నిన్నుఁగంటి మాహ్లాదమునన్. ౧౮

క. కులశీలంబులు విడిచెను
దలఁకక ప్రాణంబు విడువఁ దలఁచెను విప్రుం

డలివేణి నెత్తుకొనిచను
తలఁపున నెవ్వాఁడు దైవము చేతన్. ౨౮

ఉ. సీతయు నాదిలక్ష్మియని చిత్తము లంబరికించి రాముడున్
సీతయు నాగిరిఁ దప్పునఁ జిత్తజలీలలఁ దేలుచున్ వన
వ్రాతములన్ గొలంకుల విరాజితరత్నదరీగృహంబులన్
బ్రీతిఁ జరింపఁ నమ్మునిగరిష్ఠులు నిష్ఠలు దక్కి రందఱున్.

క. మారునికగపడక కులాచారాదులు నిర్వహించుసతులనుబురుషుల్
వేరు జగంబులఁ బుట్టనివారున్ దేహంబు లేనివారున్ దక్కన్.

శా. ఆవిశ్వప్రభుఁ డర్క వంశమున మాయామానవాకారుఁడై
యాఘర్మాపమునొంది పాక్రృతునియట్ల య్యోభువిం
దేవీదివ్యకళాంశమున్ జనకపుత్రింగూడి క్రీడించెడున్
బూవిల్కానికిఁ జిక్కి తక్కినజనుల్ పుష్పాయుధున్ గెల్తురే?

పండితులు నూతనవధూవరుల నాశీర్వదించు

శ్లో॥ కళ్యాణదాయి భవతోస్తు పినాకపాణేః
పాణిగ్రహే భుజగకంకణ భూషితాయాః
సంభ్రాంతచిత్తసహసైవ నమశ్శివాయ
ఇత్యుక్త్వార్ధలజ్జితనతం ముఖమంచికాయాః

అను శ్లోకమందలి భావమునుగైకొని రాధామాధకవి, కృత్యాదియందలి ౮వ పద్యము నిట్లు రచించియున్నాఁడు.

చ. పరిణయవేళయందు నిజభర్తృవిభూషణ శేషపూత్కృతి
స్ఫురణఁ దలంకి కన్నొగిచి చూడఁగ నోడి నమశ్శివాయ యం
చరనుడి వాత సిగ్గువడి యావతకోమల మందహాసము
దరవదనారవింద యగు తన్వి మహీధరకన్యఁ గొల్చెదన్.

శ్లోకము నందలి రసము పద్యమునఁ గన్పట్టకపోయినను మనోహరముగా నేయున్నది.

(గ్రంథాంతమునం దీక్రింది పద్యము ముద్రితమైయున్నది. ఇది యెవరి రచనమో)

ఉ. సంతతభావశుద్ధియుత సంస్థితియున్ సదయ క్రియాపరి
శ్రాంతియు సర్వలక్షణవిచారణయున్ ఫలియించె రాధికా
కాంతుఁడు ప్రాణవల్లభుఁడు గావునఁ భావనమూర్తియైన యీ
చింతలపూడి యెల్లకవిశేఖరు కోమల కావ్యకన్యకన్.

మాకుబంధువులును బరమమిత్రులును నగు కవిరాజ హంస బాలాంత్రపు వేంకటరావుగారు విష్ణుమాయానాటక కర్తృత్వమును గూర్చి యీగ్రంథము శ్రీనాథ విరచితమనియు ననంతయ్య ప్రణీతకవి యనియు నొక నూతనాభిప్రాయమును వెలిబుచ్చుచు, నాకుత్తరము వ్రాసియుండిరి.

౧. శ్రీనాథుని శైలిని బోలిన పద్యములిందనేకములుండుట.

౨. భీమఖండములోని తుల్యభాగ సర్పవరము గోదావరి మొదలగు వానివర్ణనములను బోలిన వర్ణనములిందుండుట.

3. శ్రీనాథవిరచితమగు క్రీడాభిరామమునందును విష్ణుమాయానాటకమునందును గోవిందశర్మయుండి మఱియెచ్చటను లేకుండుట;

౪. శ్రీనాథుఁడు నందనందన చరిత్రమును రచియించెనని జనశ్రుతి యుండుట; ఈవిష్ణుమాయానాటక మదియేయని తలంచుట కవకాశ ముండుట.

౫. శ్రీనాథుఁడు ననంతయ్యయు, నేకనగరమందో, సమీపగ్రామములయందో నేకకాలముననుండుట.

౬. రాధామాధవకవి కాలమునాటికీగ్రంథము శ్రీనాథవిరచితమని యనుకొనుచుండిరని తలంచుటకవకాశముకలిగియుండుట మొదలగుననేక హేతువులచే నీవిష్ణుమాయానాటకమును శ్రీనాథుఁడురచియించి క్రీడాభిరామమువలెనే కర్తృత్వమును అనంతయ్య కొసంగియుండునని శ్రీవేంకటరావు పంతులుగారియూహ.

ఈవిషయమింకను బరిశోధనీయమగుచున్నది.

—*—

# 133 కుడిచెర్ల తిప్పరాజు

ఈతని చరిత్రమేమియుఁ దెలియలేదు. ఆంధ్రసాహిత్య పరిషత్తునందున్న యుదాహరణ గ్రంథములోనివని యీక్రిందిపద్యములు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రబంధ రత్నావళిలోఁ ప్రకటించియున్నారు. ఈపద్యములు కాంచీమాహాత్మ్యములోనివని యందు వ్రాయఁబడియున్నది.

సీ. అరుణమణిదీప్తు లంతంత నతిశయిల్ల
విమల శశికాంతరోచులు విస్తరిల్లఁ
గావ్యబుధగురు సంగతి గలిగిపురము
సూర్యసోమవీధులు కడు సొంపుమిగిలె

గీ. కనకభూధర శిఖరాను కారులగుచు
నాపురంబున నొప్పారు గోపురములు
సంతతాధ్వగమన పరిశ్రాంతులైన
చంద్రసూర్యుల విశ్రమస్థలములట్లు.

మ. జ్వలదగ్ని ప్రథమాన తేజుని భరద్వాజున్ వినిర్ధాత వ
ల్కల భాస్వత్పరిధానుఁ బింగళ జటాలంకారుఁ గృష్ణాజినో
జ్జ్వల సంవ్యానుఁ దపఃకృశీతతనున్ శాంతాత్ము బ్రహ్మైకని
శ్చలచిత్తున్ విజితేంద్రియున్ బ్రముదిత స్వాంతున్ గృపావంతునిన్

సీ. పద్మరాగ ప్రభాభాసుర పటలము
కాల సంధ్యారాగ లీలఁ బెనుపఁ
గాశ్మీర కనకనిర్గతదీప్తి యసమము
బాలాతపస్ఫూర్తిఁ బరిఢవింప
హరినీలచురులు కస్తురిప్రోవులును ననా
రంభ నీలాభ్ర విభ్రమముఁ జేయ
వజ్రమౌక్తిక హిమవాలుకాదీప్తులు
నిర్మ్ల శాచంద్రిక నిర్వహింపఁ

గీ. జతుర బహువర్ణ పట్టవస్త్రప్రభాతి
నిర్గలదజాల సముదీర్ణ నిర్జరేంద్ర
చాపలక్ష్మి రచింపఁ బ్రశస్త (దీప్తి)
(వి) తతినొప్పారు నప్పురి విపణివీధి

సీ. మహానీయతర యాజమాన మంత్రంబులు
జపియించు ముఖచతుష్టయము దనరఁ
బావననవనీత పరిలేపనంబున
మెఱుఁగెక్కియున్న కొమ్మేను వెలుఁగ
బహుచిత్ర మృదుసూక్ష్మ పక్ష శోభితమైన
హారిణాజినోత్తరీయంబు మెరయ
శ్రీవత్సలాంఛన శ్రీమూర్తి చింతన
సంభృతానంద బాష్పములు దొరుగ

గీ. శారదాదేవి, సావిత్రి, శ్రద్ధ, తుష్టి,
మతియుఁ గుశసూత్రకాంచిదామములు వెట్ట
నెమ్మిఁ గొలువంగ దర్భాసనమ్మమీఁదఁ
జూడనొప్పెఁ బితామహ సోమయాజి.

ఉ. సవ్యాముఁ గాంచె వాణి వనసై రభ సామజ సింహగండకా
సవ్యాము సిద్ధసాధ్య సురచారణ కిన్నరసన్మునీశ్వర
గ్రావ్యాము శృంగసంశ్రిత కిరాతవధూసుత దివ్య యోషిదై
తివ్యాము నగ్రభూసుఖతతిగ్మమయూఖర తాపవాహ్యామున్.

పై పద్యములలో భరద్వాజమహాని వినుతుఁడగుటచే కావ్యకర్త గాని కావ్యభర్తగాని యాగోత్రియుఁడేమోయని యూహకలుగుచున్నది. కాంచీమాహాత్మ్యమిప్పుడెచ్చటను దొరకుట లేదు. ఉదాహరణ గ్రంథకర్త క్రీ.శ. ౧౨౬౦ ప్రాంతమువాఁడై యుండునని శ్రీప్రభాకర శాస్త్రులువారు నిర్ణయించియుండుటచే నీకవి యంతకుఁ బూర్వుఁడనుట నిశ్చయము.



# 134 నాగలూటి శేషనాథార్యుఁడు

ఇతఁడు శ్రీపర్వతపురాణమను నాలుగాశ్వాసముల పద్యకావ్యమును రచియించి శ్రీశైల మల్లిఖార్జున కంకితముచేసెను. ఇతఁడారాధ్య బ్రాహ్మణుఁడు. వీరశైవధర్మము ననుసరించి యీకవి తన కుల గోత్రములను జెప్పుకొన నిష్టములేనివాఁడై యీగ్రంథమునఁ దననుగూర్చి

క. శివజన్ముఁడ శివగోత్రుఁడ
శివలింగధ్యానరతుఁడ శీలవ్రతుఁడన్
శివపూజాపరతంత్రుఁడ
శివయోగసుధానుభవుఁడ శేషాహ్వయుఁడన్.

అనిచెప్పినాఁడు. ఎట్లో తనపేరునుజెప్పుకొనుట కంగీకరించుటచే నీతనిపేరైన దెలియవచ్చినది. కాని యుఁడకూడ శివనామముతోఁ జెప్పినచో మనకీతఁడెవ్వరో తెలియక యీగ్రంథమొక యనామధేయ కవి ప్రణీతంబని చెప్పుకొనవలసి వచ్చును.

ఈక్రింది పద్యమువలన నీతఁడు వ్యాకరణశాస్త్ర పండితుఁడనియు నిరుపమాన కవితాశక్తికలవాఁడనియుఁ దెలియుచున్నది.

మ. ప్రణుత శ్రీగిరినాథలబ్ధకవితా ప్రజ్ఞాకళాభిజ్ఞుఁడన్
గణభుద్గ్రంథ మతప్రయోగ విలుఠద్గాథార్థసంవేత్త ద
త్పణిభాష్యాయుత ఫక్కికాదృఢపదప్రౌఢీ సమాఢౌకిత
ప్రణిపత్యస్ఫుట శబ్దశాస్త్రనివహప్రామాణ్య పారీణుఁడన్.

ఈక్రింది రెండుపద్యములలో నీతఁడు సంస్కృతాంధ్రభాషలను జాతుర్యముగా వర్ణించియున్నాఁడు.

ఆ. భూషణలీలల దేశవి
భాషలుఁత త్ప్రదేశ భాసురములగున్
భూషించు వస్త్రమట్లను సు
భాషితమై సంస్కృతంబు బహుదేశములన్

చ. జనని సమస్తభాషలకు సంస్కృతభాష ధరాతలంబునన్
ఘనలలితార్థగౌరవవికాసి తెనుంగభిరమ్యమంతకున్
గనుఁగొనఁ జాతబీజమునకంటెను గోమలపత్రపుష్ప శో
భన మృదుపల్లవాఢి నవబాలరసాలము సొంపునింపదే.

ఈకవిసత్తముఁడు కవిత యెటులుండవలయునో, ఈక్రిందిపద్యములలోఁ దెలిపి తదనుగుణముగఁ దన గ్రంథమును రచియించియున్నవాఁడు.

శా. చేతశ్శుక్తికయందునిల్చి కళలం జేకూఱి శాస్త్రోదక
వ్రాతం బక్షరమూర్తి మౌక్తికములై వర్ధిల్లెడున్ సత్ప్రభ
ఖ్యాతోపేత గుణప్రయుక్తి పదలంకారాంగ హారాళి నా
రీతిన్ సత్కవి కూర్చ నేర్చును బుధశ్రేణీగళాగ్రంబునన్.

ఈపద్యము మురారికవికృత యనర్ఘరాఘవమందలి యీక్రింది శ్లోకమున కాంధ్రీకరణము.

శ్లో. చేతశ్శుక్తికయా నిపీయ శతశః శాస్త్రామృతాని క్రమా
ద్వాన్తైరక్షరమూర్తిభిః సుకవినా ముక్తాఫలైర్గుమ్ఫితాః
ఉన్మీలత్కమనీయనాక గుణగ్రామోప సంవర్ధన
ప్రౌఢాలంకృతయో లుఠన్తి సుదృశాం కంఠేషు హారస్రజః.

క. తెనుఁగైననేమి కవితా
జనితాలంకార చిత్రసంగత పదవ
ర్ణన వచిన రచన చతురత
వినయోగ్యంబైన కృతియ విందు మహాత్ముల్.

ఈకవి చిన్నతనమునుండియు శివభక్తుఁడనియుఁ దన గ్రంథరచనమునకు శివభక్తియే కారణమనియు నీక్రిందిపద్యములలోఁ దెలిపియున్నాఁడు.

శా. నావారున్ గడు చిన్నప్రాయమున "నోనామశ్శివాయ" లుం బ్రేమతో
శీవాయక్కలు జెప్ప నాటఁగోలె నే సేవింతు నీయాన నా

భావంబందున నిన్నె యెన్నుదును విభ్రాజద్భవద్భక్తి స
ద్భావజ్ఞాన సుధానుభావరతుఁగా భావింపు మల్లేశ్వరా!

మ. శివచారిత్రము బీజ మంకురము నీసేవావివేకంబు స
త్కవితాశ్రేణులు పల్లవంబులు సమాఖ్య వ్రాతముల్ పుష్పముల్
భవదీయ స్తవముల్ ఫలావళులు సద్భావంబులే కీరముల్
భువి మత్కావ్యమహీరుహంబునకు శ్రీభూభృత్పురాధీశ్వరా!

కవిచరిత్రకారులీ కవిగృహనామము "నాగులూరి" యనియుఁ బేరు శేషనారాధ్యుఁడనియు నూటయేఁబది సంవత్సరముల క్రిందట (క్రీ.శ. ౧౭౫౦) నుండి యుండుననియు వ్రాసియున్నారు. వ్రాఁత ప్రతులయందును ముద్రితప్రతియందును నీక్రింది పద్యమున నాగలూటి యనియే యున్నది. ఇది కృత్యాదియందలిది.

శా. ఆస్ఫోటించిన దైత్యగర్వ తిమిరంబ క్రాంతముం బాపెఁ ద
త్స్ఫూర్తిస్ఫుటాసిధనుః కుఠార పరిఘప్రాసాది శస్త్రప్రభా
విస్ఫూర్తుల్ గరపంక్తుల న్మెఱయఁగా విశ్వామరత్రాణ శౌ
ర్యస్ఫారుండగు నాగలూటిపుర వీరస్వామిఁ గీర్తించెదన్.

ఇందలి 'పుర'శబ్దమునకు ముద్రిత ప్రతిలో 'చిన' అనియున్నది కాని యది పొరపాటు.

కర్నూలు మండలమున నందికొట్కూరునకై దుమైళ్లదూరమున నాగలూటి యను గ్రామమున్నది. అందు వీరభద్రేశ్వరాలయమున్నది. ఆయాలయమునకుఁ దూర్పుగోపురమును బొంతల నాగిశెట్టి యనునాతఁడు శా.శ. ౧౫౪౬ రక్తాక్షి సంవత్సరమునఁ గట్టించినట్లు వ్రాయించిన శాసన మొకటి నాగలూటిలోనే యున్నది ౧. నాగలూటిని సంస్కృతీకరించి కాఁబోలు శాసనమున "లాంగలూటి" అని వ్రాసి యుండెను. కావునఁ గవిగృహనామము నాగలూటియనియు నాతని నివాసమాగ్రామమే యనియు నిశ్చయముగాఁ జెప్పవచ్చును. శ్రీపర్వత పురాణమున శ్రీశైల మాహాత్మ్యమే వర్ణితమైనది. శ్రీశైలముకూడ నందికొట్కూరు తాలూకాలోనిదే.

ఈకవి గ్రంథాంతగద్యలో శేషనాథార్యుఁడననియే చెప్పుకొని యున్నాఁడు.

గద్య:— ఇది శ్రీమల్లికార్జున కృపాలబ్ధ మేదురాష్ట్రభాషావిశిష్ట శివయోగి గుణవర్య శేషనాథార్య ప్రణీతంబైన శ్రీపర్వతపురాణంబు నందుసర్వంబును షష్ఠమాశ్వాసము. గద్యయందలి శబ్దాలంకారమును బట్టి యీతనిపేరు శేషనాథార్యుఁడనియే నిర్ణయింపవలసియున్నది.

ఈగ్రంథమునఁ జాలభాగము శ్రీపర్వతముయొక్కయు నందలి వృక్షములు, నదులు, బిలములు, దేవతాగృహము మొదలగువాని యొక్కయు మహిమలు వర్ణితములై యున్నవి. ఇందలి నాల్గవయాశ్వాసమున నొకకథకలదు. చంద్రగుప్తుఁడను రాజునకుఁ జంద్రవతీదేవియను తనయ, యత్యంత సౌందర్యవతి కలదు. ఒకనాఁడామె మనోహరముగా నలంకరించుకొని, సఖీజనులతో సరససల్లాపంబు లాడుచు:—

గీ. పడఁతి నానారసప్రౌఢ భంగులందుఁ
బ్రౌఢకీతుల గీతముల్ పాడ నృపతి
సూడ నంగజన్ముఁడు ప్రసూనశరము
వాఁడి గావించి నిగుడించి వంకదీర్చె' నఁట!

తండ్రిదనను:—

క. మోహించిన జనకవ్యా
మోహంబది దురితకర్మమూలంబని తా
నూహించి మగుడ తన
గృహ "బాహ్యదేశమున నిల్పెఁ దెరవలు దానున్"

చంద్రవతియది గర్హించి :—

క. మదనుండు పాపకర్ముఁడు
మొదలున దర్పకుఁడు గాన మూర్ఖుఁడు గాఁడే

౧. A. R. 53 of 1915.

మదనాంతకు డెందంబున
పదిలంబుగ నిల్పి తంత్రిడిపగ సాధింతున్.

అనిచెప్పి శ్రీశైలమున కేగి, యీశ్వరుని మల్లికా పుష్పములచే ననుదినమారాధింపుచుండ స్వామి ప్రత్యక్షమై వరంబుఁ గోరుకొమ్మని యానతీయ, మల్లికాపుష్పములచే నారాధితుఁడవై ప్రత్యక్షమైతివి. కావున నానామమును ధరింపుమని చంద్రవతి కోరెనఁట. అప్పటినుండియు నాదేవుఁడు మల్లికార్జుననామమును వహించెనఁట. ఈకథయుండుటనుబట్టి బ్రౌనుపండితుఁడీగ్రంథముపైఁ దనయభిప్రాయము నీక్రింది విధముగా వ్రాసియుంచినాఁడు.

**"This volume contains two tales translated from the Schandapuranam, Probably that part called Sreesailakhandam, though this is not named. It is a silly stupid book, utterly worthless, yet written by a man of learning and in a good style of poetry. The name of it is Sri Parvatapuranam"**

**"This poem the Parvatapuranam is written in classical and learned style but the story is a parcel of odds and ends. In the third canto a new tale commences regarding a father who is in love with his own daughter"**

శ్రీపర్వతపురాణ కృత్యాదియందలి

ఉ. తత్తరపాటుతో నిరులు దద్దయు మాన్పఁగఁజాలు కన్నును
వ్వొత్తున వేల్పుమూఁకలకు విందులు పెట్టెడుకన్నుఁ దమ్మియున్
మొత్తమునత్త లచ్చికిని మున్నును బుట్టిన ముద్దుపట్టి మే
నెత్తింపఁజూచు కన్నుగల వెట్టిడు వేలుపుఁ గొల్తు నిచ్చలున్.

అను పద్యమును ప్రబంధరత్నాకరమున రామాప్రెగ్గడ జగ్గన యుదాహరించి యుండుటచే నీశేషనాథార్యుఁడు పదునాఱవ శతాబ్దికిఁ బూర్వుఁడనుట నిశ్చయము.

ఇతఁడు పాలకురికి సోమనారాధ్యుని గ్రంథములను బాగుగాఁ జదివి, యందలి భావములను దనగ్రంథమునఁ జేర్చుకొనినట్లుభయుల గ్రంథములను జదివినవారికిఁ దెలియును.

శేషనాథార్యుని కవిత్వము ప్రౌఢమై మనోహరముగానున్నది. శైలి తెలియుటకై ఆయాశ్వాసములనుండియు నాలుపద్యములనిట నుదాహరించుచున్నాఁడను.

మ. కనియెన్ వ్యాసుఁడు వాగ్విలాసుఁడు సమగ్రప్రీతి మందాకినిన్
ఘనపాపౌఘవిలుంఠకక్రమకరగ్రాకీర్ణనిస్త్యక్షే
లవ దేవేంద్రపురాంగనా కుచతటాలంకార కర్పూర చం
దనమందాకినిఁ జక్రవాకిని విశుద్ధన్యాయతశ్లోకినిన్. ౧౮

ఉ. పంకజ గర్భవంద్య శివభక్త గణప్రియ! విన్నపంబు నా
వంకఁ గృపాసుధార్ద్రపరిపృద్ధిత దృష్టియొనర్చి నను నీ
వెంక గణాళిలోన నొక వెంకనుగాఁ గృపఁజూడుమయ్య ని
శ్శంక వృషాంకకింకర వశంకర శంకర! శాంకరీప్రియా! ౨౮

శా. దుత్తూరంబులబిల్వ హల్లకములన్ ద్రోణాది పుష్పంబులన్
దత్తద్వేళల మల్లికార్జునుని యేధన్యుండు పూజించినం
దొత్తుల్ వానికి ముక్తికామినులు యస్తోకంబులై శ్వర్యముల్
బత్తుల్ పంకజసంభవాదులు దివోభాగ్య ప్రభావోన్నతుల్. ౩౮

చ. సుజనుఁడు శృంగముం గనినచూపులు ముక్తిపురీకవాటముల్
విజయవిలాసతం దెరుచు వీక్షణచాతురియేమి చెప్ప నీ
త్రిజగములందు నద్భుతము దృష్టికవాటపు కుంచెకోలయో
గజదనుజాంతకుండు కడఁగట్టిన కీలకతంత్ర సూత్రమో. ౪౮

తాళవృత్తము:—

విపులహిరణ్యాం విస్రితపుణ్యాం వికసితకీర్తిం విలసితమూర్తిం
నిరుపమశక్తిం నిశ్చలభక్తిం దవ్యపతిత్వం ధరణీశత్వం
కురు తేసృజతి కరోతివధత్తే రచయతి వివిదాంత్యత్ప్రద
యుతి వ్రధనవిభావతి సంపాదయతి. ౫౮

ఉ. అత్యంతవ్రతులాద్యకందఫల దుగ్ధాహారకుత్కంఖరుల్
నిత్యారాధకు లుంఛవృత్తి విరతుల్ నీవార ముష్టింపచుల్

ప్రత్యక్షప్రముఖుల్ ప్రబోధిత పరబ్రహ్మైకవాచంయముల్
సత్యాత్ముల్ కదళీ తపోధనవరుల్ షట్చక్రపారంగతుల్. ౬౪

భద్రకవి లింగకవి యీశేషనాథార్యుని బూర్వకవిగా నుతించి యుండుటచేతను లింగకవి, యచ్యుతదేవరాయల కాలమువాఁడని ఋజువగుట మూలమునను సీతఁడు, క్రీ. శ. ౧౫౦౦ ప్రాంతమువాఁడని నిర్ణయించుటకు సంశయింపనక్కఱలేదు. ఇంకను గొంచెముముందు వాఁడైన గావచ్చును. ఈకవినిగూర్చి యింకనేమయినఁ దెలియు నేమో యని నాగలూటి కుత్తరములు వ్రాసితిని. గాని యేమియుఁ దెలియరాలేదు.

## 135 ఘటశాసి మల్లుభట్టు

రామాప్రెగ్గడ జగ్గనకవి ప్రబంధరత్నాకరములో నీతని జలపాలిమహత్త్వములోనివని మూఁడు పద్యముల నుదాహరించియుంచుటచే నీకవి నామము మనకుఁ దెలిసినది. ఇంతకంటె నీతని చరిత్రమేమియు దెలియలేదు. ఈతని గ్రంథము కాలగర్భమునఁ బడిపోయినది. ఆమూఁడుపద్యముల నీక్రిందనుదాహరించు చున్నాఁడను.

సీ. అత్రిముసీశ్వరుం డడవి కేఁగినవేళ
హరిహరబ్రహ్మలు ధరకు వచ్చి
యనసూయపత్తినం బరయఁ దలంచి వా
రతిథులై యాహార మడిగినంత
యవుఁగాక యని వేగ నన్నపానాదులు
వడ్డింపఁ దలఁచుచో వారికోర్కి
తప్పకుండఁ బతివ్రతాప్రభావంబున
నకలంక యగుచు బాలకులఁ జేసి

గీ. యంబరములూడ్చి సకల పదార్థములను
బాత్రములఁ బెట్టి తొంటిరూపము లొనర్ప
సంతసంబంది తత్తదంశముల సుతుల
వరములందె సయ్యది పతివ్రతలమహిమ.

సీ. కచధర కృష్ణమేఘంబులఁ బ్రభవించు
మెఱుఁగుఁదీగలరీతి మేనులలర
వదనేందు దరహాస వరశరచ్చంద్రిక
లక్షిచకోరంబు లనుభవింప,
నతులసౌందర్యాబ్ధి కధరబింబద్యుతుల్
పవడంపుఁదీగెల బాగుమెఱయ,
జగము గెల్వఁగ దక్షునగరంబు దొనసేసి
మరుఁడు దాఁచిన దివ్యశరములనఁగ

గీ. సరసలీలావలోకన చతురగతుల
నప్సరస్త్రీస్సమూహంబు లభ్యసింపఁ
బద్మినీజాతి ముఖ్యస్వభావములను
వన్నె మెఱయుదురప్పరివారసతులు.

సీ. ధవళాంగుఁడగు శంభుదత్త గర్భముగాఁగ
వనితదేహము పాండువర్ణమయ్యెఁ
బుత్త్రలాభానంద పూరిత కుక్షియై
యఖిలభక్ష్యములందు నరుచియయ్యెఁ
జెలులు వచ్చినఁజూచి సిగ్గుననున్నట్లు
పలుక నోపకయుండె నలసవృత్తిఁ,
దతిమరాళములకు గతినేర్పుకైవడి
నళినాక్షి మందయానము వహించె,

గీ. హేమకలశాగ్రములయందు నింద్రనీల
రత్నములరీతిఁ దత్కుచాగ్రంబులందు
నలుపు సొంపార గర్భచిహ్నములుగలుగ
నతివతల్లికి సంతోషమావహిల్లె.

ఘడిశాసలవారు బ్రాహ్మణులలో కరణకమ్మ శాఖలోనున్నారు. ఘటశాసి — ఘడిశాసలవారొక్కరో భిన్నులో తెలియదు.

ఏనుఁగు లక్ష్మణకవి పూర్వులలో జలపాలామాత్యుఁడున్నాఁడు. జలపాలేశ్వరునిబట్టి యీతనికానామము వచ్చినది. ఏలూరున జలపాలేశ్వరుఁడున్నాఁడని తెలియుచున్నది. జలపాలి అనుగ్రామముండెనేమో తెలిసికొనవలసియున్నది. ఆమాహాత్మ్యముతో సంబంధించిన కథలిందు వర్ణితములైనవేమో! ఉత్తరార్కాడు మండలమున జలనాథేశ్వరుఁడున్నాఁడు. కాని ఆయీశ్వరునకును నీగ్రంథమునకును సంబంధ ముండియుండదు.

రెండవపద్యమందలి "దక్షనగరము" ద్రాక్షారామమేమో!



## 136 కానుకొలను అన్నమరాజు

ఇతఁడు సంస్కృతమందలి అమరుకమను శృంగారకావ్యము నాంధ్రీకరించెను. ఇతనియాంధ్రామరుక మెచ్చటను కనఁబడుటలేదు. రామాప్రెగ్గడ జగ్గన ప్రబంధ రత్నాకరమునందీ క్రింది రెండుపద్యము లుదాహృతములయియున్నవి.

చ. చులుకన జాపముండిగుచుచోఁగటకాముఖ పాణిమీఁదఁ బె
ల్లొలయు నఖాంశులం గదిసి యొప్పెడుకెంజిగురాకు గుత్తిచే
నలవడి కర్ణపూరమున నంటిన తుమ్మెదవోని పార్వతీ
లలన కటాక్షదృష్టి మనలం జరితార్థులఁ జేయుఁ గావుతన్.

సీ. తివిరి రాశికి నెక్కి తిరుగు చక్రింబులు
మెట్టులఁ బదిలమై మెఱయు తేరు,
బహుముఖంబుల నేర్పు పచరించు సారథి
వ్రాసిచూపఁగరాని వారువములు

గట్టియై వీఁకనక్కఁ దీర్చు విలుగమ్మి
శ్రుతిహితంబుగ మ్రోఁతచూపు నారి
విజయానుకూలమై విలసిల్లు బాణంబు
సరిలేని కోటు లసంఖ్యబలము

౪. దనకు నబ్బుటయునుఁ బురత్రయముఁ గెలిచి
పృథులవిఖ్యాతిఁ గైకొన్న రథికవరుఁడు
జయముఁ దేజంబు భూతియుఁ బ్రియమెలర్ప
మనలఁ గరుణావిధేయుఁడై మనుచుఁ గాత !

ఈయన్నమరాజను అన్నమయ్య యనికూడ నందురు. అన్నమ రాజు అనియే శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిలువారు ప్రకటించిన ప్రబంధ రత్నావళియందున్నది. అన్నమరాజని నామముండుటచేతను, కాను కొలనువారు నియోగి బ్రాహ్మణులలో నుండుటవలనను నీతఁడు నియోగి బ్రాహ్మణుఁడని యూహింప నవకాశము కలుగుచున్నది.

ఇతఁడేకాలమువాఁడో ఎచ్చటివాఁడో తెలియదు. ప్రబంధ రత్నాకర కృతికర్త క్రీ.శ. ౧౫౬౦ ప్రాంతమువాఁడు. కావున అన్నమ రాజుకవి యంతకుఁ బూర్వుఁడనుట నిశ్చయము. పైనినుదాహరించిన రెండుపద్యములును అమరుక కృత్యాదియందలి పద్యములవలెఁ గన్పట్టుచున్నవి.

కానుకొల్లు అనుగ్రామము కృష్ణామండలములోనున్నది. ఆగ్రామమునుబట్టి యాకవి గృహనామ మేర్పడినదని చెప్పఁజాలము. "కానుకొల్లు" అను నింటిపేరుగల నియోగిబ్రాహ్మణులు వేఱుగఁ గృష్ణామండలములో నున్నారు. వారు భారద్వాజ గోత్రులు. వారి గృహనామ మాగ్రామమునుబట్టి వచ్చియుండును 'కానుకొలను' అను గ్రామమెచ్చటనున్నదో తెలియదు. ఈయన్నమరాజునుగూర్చి శ్రీనిడదవోలు వేంకటరావు పంతులు, ఎం. ఎ. గారిట్లు వ్రాసియున్నారు. ౧.

"ఈయన్నమరాజు క్రీ.శ. ౧౪౮౪ లో నున్నట్లీక్రింది శాసనము

౧. భారతి. సంపుటము ౧౬ పుట ౨౧.

వలనఁ దెలియుచున్నది. శ్రీగణాధిపతయేనమః. శ్రీజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౧౬ అగు నేంటి ఆనందసంవత్సర శ్రావణ బ ౧౦ ఆ రోహిణీనక్షత్ర తులాలగ్నమందు యజన యాజనాధ్యయన అధ్యాపక దానప్రతిగ్రహషట్కర్మనిరతులైన యజుఃశాఖ ఆంగిరస, బార్హాస్పత్య భారద్వాజ గోత్రులైన కాముంగొలని సూరపరాజు అన్నయ్యకొడుకు అన్నయ్య(ను) శ్రీతుంగభద్రాతీరం భాస్కరక్షేత్రమందుల శ్రీపంపావిరూపాక్ష దేవందు ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధి అగునట్టుగాను ఆచంద్రార్క పర్యంతం రక్షిం(చు)ను. మంగళంమహా శ్రీ శ్రీ జేయున్. (దక్షిణహిందూదేశ శాసనసంపుటములు ౪ సంపుటము. నెం ౨౭౧ రు, ౬౮ పుట హంపీక్షేత్రశాసనములు) ఇందు పేర్కొన్న భాస్కరక్షేత్రము గుత్తి ప్రదేశము.

ఈశాసనమునఁ బేర్కొనఁబడిన అన్నయ్యయే అన్నమరాజు. ఈతని తాత సూరపరాజు నామమీ విషయమును స్పష్టము చేయుచున్నది. మఱియు నీతఁడాపస్తంబసూత్రుఁడనియు, భాస్కరక్షేత్రవాసియనియు దెలియుచున్నది. కాముంగొలనే 'కానుకొలను అయినది. ఈఅన్నమరాజు పద్యము త్రిపురాంతక దేవునిగూర్చిన దీవ్రబంధరత్నావళిలో కలదు. (ఇది పైనివ్రాసిన సీసపద్యమే శతక కవులచరిత్రలో (పుట ౪౪౬) కానుకొలను నాయనప్ప' అని కలదు. అతనిగూర్చి ప్రకటితములైన వివరములు తెలియవు."

కాముంగొలనువారు కానుగొలనువారైరనుటకొక్క ప్రతిబంధకమున్నది. కృష్ణామండలములోని కానుకొలనువారు శ్రీవత్సగోత్రులు కానుకొలనువారిలో భారద్వాజ గోత్రులున్నారని ధ్రువపడిననేతప్ప కాముంగొలనువారే వీరని చెప్పుట కవకాశము లేదు. ఈశాసనమును కానుకొలనువారి కనువర్తింపఁ జేయవీలులేదు.

కాముంగొలను అను గ్రామమునుబట్టి కాముంగొలను అను గృహనామము వచ్చియుండునని తోఁచుచున్నది. కాని యాపేరిట గ్రామ మెచ్చటనున్నదియో తెలిసినది కాదు. కాముగొలను అను

నింటిపేరుగలవారు వేరుగా నున్నట్లు తెలియుచున్నది. ఆంధ్రసాహిత్య పరిషత్తునందున్న యోబనామాత్యకృత కృష్ణార్జున సంవాదమునకుఁ బ్రతి వ్రాసిన విలేఖరి కాముకోలను సాంబయ్యయని యందువ్రాసియున్నది. కావున నీవిషయమింకను బరిశోధనీయము.

ఈతని పద్యములను రామాప్రగ్గడ జగ్గన ప్రబంధ రత్నాకరము నందుదాహరించియుండుటచే నీయన్నమరాజకవి క్రీ.శ ౧౫౦౦ ప్రాంత మునందున్న వాఁడని నిశ్చయింపవచ్చును. కృష్ణామండలములోని కాము కోలనునందు అన్నమరాజు వృత్తాంతము తెలిసికొనవలయునని ప్రయ త్నించితిని కాని యదిలభింపలేదు.



## 137 ఎడపాటి యెఱ్ఱనకవి

ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; సోమయామాత్య పుత్రుఁడు, కౌండిన్యగోత్రుఁడు;

ఈకవి మల్హణ చరిత్రమను మూఁడాశ్వాసముల శృంగార ప్రబంధమును రచించి, చుండికాళయమంత్రి కంకితముచేసెను. కృతి పతి కవినిగూర్చి యాడిన పలుకులుగా రచియింపఁబడిన యీక్రిందిపద్య ములువలనఁ గవివృత్తాంతము కొంత తెలియుచున్నది.

క. శివభక్తినిధివి, మంత్రివి
కవితాభిజ్ఞుఁడవు నిత్యకారుణ్య మహా
త్ముఁడవు కౌండిన్యకులో
ద్భవుఁడవుఁ గడుఁగూర్చినట్టి బంధుఁడవనఘా!

ఉ. పాటిగలట్టిమేటి యెడపాటి పురాధిప! యెఱ్ఱనార్య!
నీసాటిగఁ జెప్పినట్టికృతి సాటువయై విలసిల్లుఁగా కిటన్
జాటుచు హీనమానవుల చాటున వ్యర్థకూటకా
ర్భాటకథల్ వినంగ నగుబాటగుఁగాక రుచింపనేర్చునే!

క. మలహారు భక్తులలోపలఁ
బొలుపుగ నుతికెక్కి జగతిఁబూజ్యుండగునా
మలహణుకథ నాపేరిటఁ
జెలువుగ నంకితముచేసి చెప్పఁగవలయున్.

కవి ఎడపాడు గ్రామకరణమయినట్లు పై యుత్పలమాలనుబట్టి తెలియుచున్నది. ఈయెడపాడు గ్రామమునుబట్టియే కవిగృహనామ మేర్పడియుండును. ఈగ్రామ మెచ్చటనున్నదియుఁ దెలియ లేదు. కొందఱు కవిగృహనామము "పెదపాటి" యని యనుచున్నారు. కాని తాళపత్రప్రతియందును ముద్రితప్రతియందునుగూడ "ఎడపాటి" అనియే యున్నది. కవితండ్రి సోమయామాత్యుఁడయిన ట్లీక్రింది గద్యవలనఁ దెలియుచున్నది.

"గద్య. ఇది శ్రీమత్సకలసుకవిమిత్ర సోమయామాత్య పుత్రసరస కవితాధుర్య యెడపాటి యెఱ్ఱనార్యప్రణీతంబైన మల్హణ చరిత్రంబు".

కవినిగూర్చి యింతకన్న నేమియుఁ దెలియరాలేదు. ఈతఁడు కుమారనైషధమను మఱియొక ప్రబంధమును రచించినట్లందలి కొన్ని పద్యములను జగన్నాథకవి తన ప్రబంధరత్నాకరమున నుదాహరించి యుండుటచేఁ దెలియుచున్నది. కాని యాగ్రంథమిప్పుడెచ్చటను లభించుటలేదు. జగన్నాథకవి, మల్హణ చరిత్రమును, కుమారనైషధమును రచించిన కవుల నామములు పెదపాటి ఎఱ్ఱాప్రెగ్గడ యనియే వ్రాసియున్నట్లు శ్రీప్రభాకరశాస్త్రిలువారు ప్రకటించిన ప్రబంధరత్నావళిలోఁ గన్పట్టుచున్నది. మల్హణ చరిత్ర రచించిన కవి యింటిపేరు ఎడపాటియైనచోఁ కుమారనైషధమును రచించిన కవి గృహనామము కూడ ఎడపాటియని మార్చవలయునా? లేక "పెదపాటి" యనియే భావించి, యీగ్రంథకర్తలిరువురును భిన్నులని భావింపవలయునా? యను ప్రశ్నయుదయించుచున్నది. పెదపాటివారిలోఁ గవులున్నారు. కవిబ్రహ్మ బిరుదాంచితుఁడగు సోమయ్య గృహనామము పెదపాటియే. గోదావరిమండలమందలి యేలూరు తాలూకాలో నొక పెద

పాడుకలదు అందిప్పుడు పెదపాటివా రితరకులములవారున్నారు. కాని నియోగి బ్రాహ్మణులు లేరు. పెదపాటియను నింటిపేరు గలవారు నియోగి బ్రాహ్మణులలో నీప్రాంతములయందున్నారు. వారు శ్రీవత్స సగోత్రులు. మల్హణ చరిత్రకర్త కౌండిన్యగోత్రుడు. పెదపాటి వారిలోఁ గౌండిన్యసగోత్రులున్నారని ఋజువగువఱకును మల్హణ చరిత్ర కపగృహనామము పెదపాటి యని తలంపవీలులేదు. మల్హణ చరిత్ర కృతిపతి నెల్లూరి మండలములోని చుండిగ్రామ నివాసుఁడు. అతఁడును గ్రంథకర్తయుఁ గడుఁగూర్చునట్టి బంధువులు. గోదావరి మండలవాసునకు నెల్లూరి మండలనివాసునితో బంధుత్వము కలియుట యాకాలమున నసంభవముకాకపోయినను దుర్ఘటము. కావున నెఱ్ఱా ప్రగడ నివాసమేలూరు తాలూకా పెదపాడని నిర్ణయింపరాదు.

మల్హణచరిత్ర కుమారసంభవకర్తలనామ మెఱ్ఱాప్రెగ్గడయే. అందొకరు ఎడపాటివారగుటయు నింకొకరు పెదపాటివారగుటయుఁ గాకతాళీన్యాయము కావలయును. అది యెప్పుడోగాని సమకూడదు. చాల అరుదుగా సంభవించెడి ఘటనముపై నాధారపడి వారిరువురును భిన్నులని యనుటకంటె ఏకవ్యక్తియే (ఎడపాటి యెఱ్ఱాప్రెగ్గడయే) యారెండు గ్రంథములను రచించెనని నిర్ణయించుటయే లెస్స.

కర్నూలు మండలములఁ బెద్దపాడు గ్రామమొకటియున్నది. ఆగ్రామమునకును నీగ్రంథకర్తకు నేమయిన సంబంధమున్న దేమో తెలిసికొనవలసియున్నది. ప్రబంధరత్నావళీకర్త యింటిపేరు పెదపాటి వారని తలంచి యీకవిని పెదపాటి యెఱ్ఱనయని తలంచుచున్నారు. ప్రబంధరత్నావళిని సమకూర్చిన యాతని యింటిపేరు "రామాప్రెగ్గడ" కాని పెదపాటికాదు. పెదపాడు నివాసుఁడగుటచేఁ బెదపాటిజగ్గన యని వాడుచున్నారు.

ఈకవి మల్హణచరిత్రమును కృష్ణరాయ ప్రభున కంకితమీయక దాఁచియుంచిన ట్లీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

ఉ. ఇట్టిమహాప్రధాన పరమేశ్వరమూర్తివి గాన నీవు చే
పట్టితి, మేలుచుండిపురిపాలక! కాశిన మంత్రిచంద్ర! మున్
గట్టిగఁ గృష్ణరాయజనకాంతున కీయక దాఁచినట్టి యా
రట్టడియైన యెఱ్ఱకవిరాజిత మల్హణ కావ్యకన్యకన్.

యీకావ్యమును గృష్ణరాయలకీయక యేల దాఁచినాఁడో తెలియదు. కాని కవి యీగ్రంథమును గృష్ణరాయల కాలములో రచించినట్లీ పద్యమువలన స్పష్టమగుచున్నది. ఈకృష్ణరాయలు ఆంధ్రభోజుఁడని కీర్తినహించిన కర్ణాట ప్రభువగు తుళువ కృష్ణదేవరాయలనియే యూహింపఁదగియున్నది. అది సత్యమయినచో నాతఁడు శాలివాహనశకము ౧౪౦౭—౧౪౩౦ సంవత్సరముల నడుమఁ గర్ణాటక రాజ్యము నేలినవాఁడు. కావున నీకవియు నప్పటివాఁడని చెప్పుటకు సంశయమక్కఱలేదు.

ఈకృష్ణజనకాంతుఁడు శ్రీకృష్ణదేవరాయలు కాక మఱియొక కృష్ణభూపాలుఁడైనచోఁ గాలము మారును. కాని గ్రంథములను గృతినొందు నఖిలంపకలవారా కాలమునఁ గన్పడుట లేదు. నంద్యాల కృష్ణమరాజగునేమో యని మల్హణ చరిత్ర పీఠికాకారులూహించినారు. నంద్యాల కృష్ణమరాజు లిరువురున్నారు. వారిరువురునుగూడ క్రీ. శ. ౧౫౦౦–౧౬౮౦ నడుమనున్నవారు. నంద్యాల కృష్ణమరాజయినను గవికాలములో విశేషభేదముండదు. పీఠికాకారులు "ఎట్లయినను, ఇందలి చుండి కాళుఁడు పదునారవ శతాబ్దమునకు చెందినవాఁడు మాత్రముకాఁడు. 17వ శతాబ్దమున నుండియుండవచ్చును." అని పీఠికలో వ్రాసియున్నారు కాని వారియూహల కాధారముల నిచ్చియుండలేదు. ప్రబంధరత్నావళీ కర్త క్రీ. శ. ౧౬౨౦ ప్రాంతమువాఁడని శ్రీప్రభాకరశాస్త్రులుగారు నిర్ణయించియున్నారు. అతఁడీకవి గ్రంథములనుండి పద్యములను గైకొనియుండుటచే నీకవియంతకుఁ బూర్వుఁడై యుండునుగాని తరువాతివాఁడు కాఁజాలఁడు. చుండి సంస్థానాధిపతికడ నీకృతిపతి యుద్యోగస్థుఁడని పీఠికాకారులు వ్రాసిరి.

కాని యందులకాధారములేదు. చుండిగ్రామమునకుఁ గరణమైనట్లు చుండిస్థల కరణచంద్ర! యను వాక్యమువలన స్పష్టమగుచున్నది.

చుండి సంస్థానము క్రీ. శ. ౧౩౦౦ ప్రాంతమునుండి కామినేని వారిక్రింద నున్నట్లును అంతకుఁబూర్వము కర్ణాటక ప్రభువులక్రిందను రెడ్డిప్రభువులక్రింద నున్నట్లును గన్పట్టుచున్నది. కృతిపతి గోత్రసూత్రములను గవి యీగ్రంథమునం దెచ్చటను జెప్పలేదు. ద్వితీయాశ్వాసాది పద్యములో "శ్రీఘటిత వేద్యవాటీమందిర" యను సంబోధనమున్నది. ఈవేద్యవాటి యెచ్చటిదో! చుండిలో యొకభాగమేమో! తెలియదు.

కృతిపతియైన కాళయామాత్యుఁడు రామయమంత్రి సోమాంబల కుమారుఁడు. కృతిపతి భార్య విస్సమాంబ. కవి కృతిపతిని వర్ణించిన వానిలో రెండుపద్యముల నీక్రింద వ్రాయుచున్నాఁడను.

ఉ. ఇమ్మహిఁగల్గు మంత్రుల ననేకులఁ జూచితి మేము వారు మో
దమ్మున నిచ్చినట్టి ధనధాన్యయుతంబగు దొడ్డయీవియున్
సమ్మతితోడ నీవొసఁగు సారపుఁగప్రపువీడియంబు తు
ల్యమ్ముగఁ జుండిపాలన! దయాకర! కాళన మంత్రిశేఖరా!

సీ. పరకాంతఁజూడఁడు పైత్రోవఁ జూచెనా
వర్ణించు మఱి కానివానిగాను
తలఁచు మాటాడఁడు తగుచోట నాడెనా
యది బ్రహ్మపదము శిలాక్షరంబు.
తలమెఱుంగక యీఁడు తగ మెచ్చియిచ్చెనా
చాలునర్థికి జన్మజన్మములకు
మనసీక నిల్పఁడు మదినిచ్చి నిల్పెనా
యది విభీషణపట్టమచ్యుతంబు.
రక్ష రాష్ట్రమునకును శ్రీరామరక్ష
యాజ్ఞ సుగ్రీవునాజ్ఞగా నడఁచె రిపులఁ

బుణ్యవంతుఁడు సద్గుణ భూషణుండు
చుండిరామయకాశ్యఁ డఖండ యశుఁడు.

నెల్లూరు మండలమందలి చుండి గ్రామమున కిప్పటికిని 'చుండి' వారే కరణములుగా నున్నారు. వీరాఱువేల నియోగులు. కౌశికగోత్రులు. యజుశ్శాఖ. కాశయమంత్రి వీరిపూర్వుఁడని నిశ్చయించుటకు సంశయము నొందఁబనిలేదు.

శివప్రభావమును దెలుపు కథ యిందు వర్ణితమయినది. కల్యాణపురమున యజ్ఞదత్తుఁడను బ్రాహ్మణునకు లేక లేక పరమేశ్వరప్రసాదమున మల్హణుఁడను కుమారుఁడుకలిగి విద్యానిధియను పండితునియొద్ద సంగీత సాహిత్యాది విద్యలఁ బూర్ణుఁడయ్యెను. ఆపురమున మదనసేన యను వేశ్య తన తనయ యగు పుష్పగంధి నాగురువునొద్దనే విద్య నభ్యసింపఁ జేర్చెను. మల్హణ పుష్పగంధులు సమవయస్కులై సంపూర్ణముగ విద్య నభ్యసింపుచు యుక్తవయస్సురాఁగా నన్యోన్య ప్రేమచే బద్ధులై భార్యాభర్తలవలె వినోదముగాఁ గాలము గడుపుచుండ, వేశ్యమాత, వారి ప్రేమమున కడ్డుతగిలి ధనాశచే నాపురమందలి యొక వైశ్యునిచే విశేషధనమునుగొని కూఁతు నాతనిఁగూర్ప యత్నించి, మల్హణుని తన యింటికి రాకుండఁజేసెను. వైశ్యుఁడరుదెంచిన నాఁటి రాత్రి పుష్పగంధి యాతనితోనుండ నిష్టములేకమాటలతోఁ గాలయాపనము సేయుచుఁ దమలపునీరుమియుటకై యివ్వలకువచ్చి యుమియ నది పుష్పగంధి మాటలను వినుటకై వచ్చి వీథిఁచరుగుక్రింద నిలుచుండి యున్న మల్హణునిపైఁ బడియెను. ఇంతలో మెఱుపుమెఱయనాకాంతి వలన మల్హణునెఱింగి పుష్పగంధి, యాతనికి నమస్కరించి క్షమింప వేఁడి, వారిరువురకును శాశ్వతానుబంధ మొనఁగూడునట్లీశ్వరునిఁ బ్రార్థింపుమని ప్రోత్సహించి యిరువురు నూరిబయటనున్న శివాలయమునకుఁ బోయిరి. మల్హణుఁడు పుష్పగంధితో "నాహృదయము నిన్నువీడి యీశ్వరునిమీఁదకు బోవుటలేదన నట్లయినచో నేను నిన్నుఁ గౌఁగిలించుకొని నీవెనుకవైపున నుండెదననియు నీశ్వరుని బ్రార్థింపు

మనియుఁ జెప్పి పుష్పగంధియట్లే చేయ మల్హణుం డేకాగ్రచిత్తుండై యీశ్వరునిఁ బ్రార్థింప నాదేవుఁడు ప్రత్యక్షమై మల్హణ పుష్పగంధు లకును, వారు పెంచిన చిలుకకును, వేశ్యమాతకును, మల్హణుని జననీ జనకులకును గైవల్యము నొసంగిన కథ యిందు వర్ణింపఁబడినది. ఇంద అకు గైవల్యమిచ్చిన యీశ్వరుఁడెందుచేతనో వైశ్యోత్తమునకు మాత్రము కైవల్యము నీయనందున నాతఁడు భయభ్రష్టుండైనాఁడు.

ఈగ్రంథమున నింకొక యుపకథయున్నది. అదియుఁగూడ నిట్టిదే. ఈకథోపకథలు పాలకురికి సోమనాథుఁడు రచించిన, పండితా రాధ్య చరిత్రమున నున్నవి. వానినే, ఎఱ్ఱనకవి పెంచి మూఁడాశ్వా సముల కావ్యముగా రచించినాఁడు. గ్రంథమున శృంగార వర్ణనములు కొంత పచ్చిగానున్నను, నీతిని బోధించు పద్యములుకూడ నందందు లేకపోలేదు. ఇకారసంధులు మొదలుగాఁ గొన్ని వ్యాకరణ దోషము లున్నను మొత్తమీద నీతని కవిత్వము మృదు మధురపదగుంభితమై మనోహరముగా నున్నది. కవిత్వశైలి తెలియుటకై కొన్నిపద్యముల నిట నుదాహరించుచున్నాఁడను.

చ. ఎక్కడిబావనయ్య! యితఁడిక్కడ వచ్చుచునున్నవాఁడు దా
నిక్కమె సాధుఁబోలి తననెయ్యముఁ దియ్యము చాలుఁజాలు నీ
చక్కటిఁ జేరనీయకుఁడు జాడఁజలింపఁగ నీతఁడెంతయున్
వెక్కసమైనచేత లివివిన్నను నామదిఁ గోపమయ్యెడున్. ౧ ఆ

క. మగవాని చిత్తమంతయు
నిగురొత్తఁగఁజేసి వేఁటయిఱ్ఱియపోలెన్
దగిలింపక తాఁదగిలిన
మగువెంతయు సొంపుచెడి యమాన్యత నొందున్. ౨ ఆ

ఉ. వేయునునేలనామనసు వేఁకక మల్హణు మీఁదగాని యో
తోయజగంధి! యన్యునెడఁ దూఁగోని రోయుచునుందు నందన
చ్ఛాయలఁ గల్పక ప్రసవసౌరభమ్మానుచుఁ జొక్కి మక్కువం
బాయని తేఁటి హేయమగు బ్రబ్బలిపూవుల కాససేయునే. ౩ ఆ

గీ. దద్దరము చేత నాచులోఁ దమ్మివిరిని
నున్న యెల తేఁటిపైఁ దేనె యొలికినట్లు
మలహాణునిమీఁదఁ బడియె నాజలకణములు
మదన సంతాపవహ్నికి మాటుదోఁప 3 ఆ

చ. అటువలె నుంటివేని, జలజానన! యేనును నాదిభోగితా
ట్కటకు నుమాకళత్రు శితికంధరు సన్నుతి చేసి నీదుముం
దటనట మెచ్చు చేకొనియెదన్ పను నావుడు నింతి యట్లకోఁ
గిటఁ గదియించె భక్తిఁబలికించె శివున్ నుతియించె నాతఁడున్.

కుమారసైష్ధమందలి కథ నలచరిత్రమే యైయుండును. ఇందలి ౧౬ పద్యములు ప్రబంధ రత్నావళియందుదాహృతములైనవి. వానిలో గొన్నిఁటి నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

సీ. అలరెడు తెప్పలల్లార్చినయుందాఁక
నవిమిషకన్యఁ గాదనఁగ వశమె?
యమృతంబు చిలుక మాటాడినయుందాఁకఁ
గనకంపుఁబ్రతిమ గాదనఁగ వశమె?
నడుఁగక యడుగెత్తి నడచినయుందాఁక
గొనబు పూఁదీగె గాదనఁగవశమె?
కలికితనూరేఖఁ గదిసి కన్గొనుదాఁక
ఘనవనలక్ష్మి గాదనఁగ వశమె?
గీ. యుపద సఖిమీఁద వెడవ్రాలియున్నదాఁక
నొనరు తొలుకారు మెఱుఁగు గాదనఁగవశమె?
వెలఁదిగుణములు సఖులచే వినినదాఁక
నంగసంభవుమాయ గాదనఁగ వశమె?

సీ. ఈశు చేఁగాంచి సాహిత్యవిద్య ధరిత్రి
నిల్పినయట్టిపాణిని భజించి,
శ్లోకార్థమునఁ జంద్రజూటు మెప్పించి యి
ష్టార్థములొన్నమల్హణు నుతించి,

గద్యంబుచెప్పి శంకరునిచేఁ గరములు
ప్రతిభతోఁ బడసిన బాణుఁదలఁచి
శతకంబుఁజెప్పి భాస్కరుని మెచ్చఁగఁ జేసి
యురుదేహుఁడైన మయూరుఁ గొలిచి

గీ. భవుని మెప్పించి కన్నులు పడసి తెచ్చి
వనితకిచ్చిన కాళిదాసునకు మ్రొక్కి
హరుని వినుతులచే బాసలాడఁజేసి
నట్టి భట్టుని నన్నయభట్టుఁ బొగడి.

సీ. మన్మథ దివ్యాగమమున కోంకారంబు
భూతేశు నొదల పువ్వుదండ
యుల్లశృంగార రేఖార్గళకుంచిక
యధికతమోదంతి కంకుశంబు
విరహిణీజనమర్మవిచ్ఛేద కర్తరి
యంబరక్రీడదంష్ట్రాంకురంబు
తారకామౌక్తికతతికి నంచితశుక్తి
దగునంబునిధికి ముత్యాలజోగు

గీ. మారు పట్టాభిషేకార్థవారికుంభి
చిత్తజునికోట లగ్గడంచెనపుగుండు
నాఁగనానాఁటి కభివృద్ధి నారుకొనిన
చంద్రుఁడుదయించెఁ గాంతిని సాంద్రుఁడగుచు.

చ. కలసి యొకళ్ళొకళ్ళు కనుగందని వేడ్కలఁ జూచువేళ త్ర
ప్పలు మఱువయ్యెనే నవియ పాయుట, తత్సుఖపారవశ్యులై
పలుకకయుండుటే యలిగి పైకొనకుండుట, యంతెకాని తొ
య్యలియు విభుండు బాయుటయు నల్గుట నాఁగ నెఱుంగ రెన్నఁడున్.

సీ. కోమరువెన్నెలమోసు నమలి ప్రాణేశ్వరు
కోసంగి యుల్లసానరించు నొకచకోరి,

పరపువెన్నెల గుజ్జుబంతెన గూళ్ళొడు
నోలినెచ్చెలులతో నొకచకోరి
పాలైనవెన్నెల తేటకేళాకూళి
నోలలాడుచునుండు నొకచకోరి.
గట్టివెన్నెల చల్దిగాఁ గట్టి వల్లభు
నుడు రాజుకడ కంపు నొకచకోరి

గీ. చేఁగవెన్నెల క్రొవ్వు భంజించి విందు
లొనరఁ జేయును జుట్టాలకొకచకోరి
పంచువెన్నెల మేర్పుఱిచిపతికి
నుబ్బుగానిచ్చు వేకువ నొకచకోరి.

సీ. పులు సొత్తు చేఁదు నుప్పును దీపు నొగరును
గణుతింప భాగాధికములు గాక,
చిమిడంగఁ బాకక చిక్కనై యిగురక
కాటువోవక మఱికలఁతవడక,
యుడికియు నుడుకకయుండి నిక్కమ్మక (?)
పసరు వేయక పరిపాటి చెడక,
సంబారములతోడి సంబంధ మెడలక
పొగుపువాసన విరిపోటుగాక,

గీ. వింతలై జిహ్వకును రుచుల్విస్తరిల్లఁ
దగు పదార్థంబు లెడనెడఁ దాము తామ
భోక్తలకు భోజనాసక్తిఁ బొడమఁజేయ
నింపు వేడుకఁ గూరలు వండనేర్తు.

ఈపద్యము నలుని పాకవర్ణనముగానోపు. ఈగ్రంథము లభించెనేని కవివృత్తాంతమిఁకను గొంత తెలియును.



# 138 బొడ్డుపాటి పేరయకవి

రామాప్రెగ్గడ జగ్గనకవి సేకరించిన పద్యములనుబట్టి యీతఁడు కవియనియు, అనంతమహాత్మ్యము, పద్మినీవల్లభము, మంగళగిరి విలాసము, శంకరవిజయము, సూర్యశతకము, అనుగ్రంథములను రచియించినవాఁడనియుఁ దెలియుచున్నది. మంగళగిరి విలాసమును రచియించినవాఁడగుటచే నీకవి కృష్ణామండలములోనివాఁడనుట నిశ్చయము. కృష్ణామండలములో బెజవాడకు సమీపమున బొడ్డుపాడను గ్రామమున్నదనియు, నందు బొడ్డుపాటివారారాధ్యుల నియోగులున్నారనియు, శతక కవుల చరిత్రకారులు వ్రాసియున్నారు. మరికొన్ని ప్రదేశములలో బొడ్డుపాటివారు వెలనాటి వైదికబ్రాహ్మణులును గలరు. కవికాలము తెలియదు. కాని క్రీ.శ. ౧౫౬౦ కిఁ బూర్వుఁడనుట నిశ్చయము. ఈతని గ్రంథములలో నొక్కటియు నిపుడు కన్పించుటలేదు. ప్రబంధ రత్నాకరములోనివని, యీక్రింది పద్యములను శ్రీ ప్రభాకరశాస్త్రులుగారు ప్రబంధ రత్నావళిలోఁ బ్రకటించియున్నారు.

అనంతమహాత్మ్యము:—

సీ. తన యనురాగాభ్యుదయమూర్తి పద్మినీ
  సతికిని ముఖవికాసంబొనర్పఁ
దనదుర్నిరీక్ష ప్రతాపవైఖరి యరి
  తమముల గిరిగుహాంతములఁ దార్పఁ
దనకరవిదళిత దానధారాశక్తి
  కలయులోకులకు నాకండ్లుదీర్పఁ
దనదు మిన్నందిన ఘనతరైశ్వర్యంబె
  నకు విబుధాళి సన్నుతులొనర్పఁ

గీ. దేజరిల్లెడు రాజన దినదినంబు
మూఁడుమూర్తుల జనులచే మ్రొక్కఁగొనెడు
పద్మినీవల్లభుని నాదుపాలివేల్పు
భక్తసులభునిఁ గొల్తు హృత్పద్మమునలర.

పద్మినీవల్లభము:—

సీ. కమలాకరస్ఫూర్తి కాసారములయందుఁ
దమయందుఁ గలుగంగఁ దనరుచుండు
గంభీర జీవనక్రమ మగడ్తలయందుఁ
దమయందుఁ గలుగంగఁ దనరుచుండు
ధారావిహారమత్తమ తురంగములయందుఁ
దమయందుఁ గలుగంగఁ దనరుచుండు
సుమనోవికాసంబు ప్రమదావనములందుఁ
దమయందుఁ గలుగంగఁ దనరుచుండు
దానమహిమ సముత్తుంగ దంతులందుఁ
దమకరంబులఁ గలుగంగఁ దనరుచుండు
సిరుల సంతోషమున ముఖ్యశీలవృత్తి
రణజయౌదార్యములఁ బురి రాజకులము.

సీ. గజముల నడలఁ దత్కరముల జిగులఁ ద
త్కుంభగౌరవములఁ గూర్చి కూర్చి
జలజస్ఫుటములఁ దచ్ఛద విభ్రమములఁ ద
త్కేసర సురభుల గిలిమిగిలిమి
మరువిండ్లఁ దన్మౌర్వి మధుకరరుచులఁ ద
దస్త్రంబు మొనలును నలమి యలమి
గనక వేదులు నందుఁ గాంతినుగ్గులును ద
త్ప్రగిత సన్మణులును దార్చి తార్చి.

గీ. గతులు నూరు-కుచములు మొగములు నేత్ర
ములును దనుగంధములు బొమ లలకములును
చూపులు నితంబములును రుచులును దశన
ములును విధిచేసె నా నుంద్రుపురి చెలువలు.

క. ఒక యెనిమిదడఁగె దిక్కుల
మకరంబున కొకటి యోడె మలహరుచే ము

న్నొకటుడిగె ధిక్కరింపఁగ
నిఁక నేలని మాఱుమలయు నేనుఁగులు పురిన్.

ఉ. పాయక కన్నె నాథుతలఁ బ్రాలిడఁ బూన్చిన యాణిముత్తెముల్
దోయిట పద్మరాగమణులో యన నించుక యెత్తి చూచు చోఁ
జాయల నింద్రనీలముల చాయలుగాఁ బతి మాళిమీఁదటన్
జోయఁగ బూవుమొగ్గలనఁ బొల్చె విచిత్రవిలాస వైఖరిన్.

ఉ. సారసరః ప్రతీర వనసౌరభపుష్పరజో విభూతి నొ
య్యారపుఁ జొక్కు చల్లి మలయానిలుఁడన్ గడిదొంగ వేకువన్
జోరసగండ్లఁ గన్నములఁ జొచ్చియు దివ్వెలు దూల్చి భోగభా
మారతితాంత ఘర్మకణమౌక్తికపంక్తులు దార్చు నిచ్చలున్.

శంకరవిజయము:—

చ. అడవి సరోజరాగమణు లామిషఖండములంచుఁ గట్టుకు
ట్లాడికము సేయు వేకుకల నుజ్జ్వలసన్మణులేర్చి నిప్పులం
దిడియున్న భల్లుకవ్రజనిరీక్షణముల్గని దివ్వెలంచు దేఁ
దడవుదు రొయ్యమాగ్ధ్యమునఁ దద్గిరిసీమఁ గిరాతబాలికల్.

ఉ. ఆమని కెంకిపట్లు మలయానిలు నిత్యవిహార సీమముల్
కాముని పాళెముల్ శుకపికంబుల జీతపుటూళ్లు కామినీ
కాముక విశ్రమంబులకుఁ గల్లని యొర్వకు (?) లాపురాంగనా
స్తోమమునందు నెందు నెలతోఁటలు శైలశిలోన్నత స్థితిన్.

గీ. తనకు బలమ్ముగలిగి తనమంత్రి మిత్రాప్త
బలము దనకుఁ దోడుపడుటకు గలిగి
వైరిబలము దఱిగి వారిచుట్టము లెల్ల
గ్రిందువడిన వేళ గెలువవచ్చు.

చ. తనరుచిగాని వేళ బెడిదంబగు వేఁడి నినుంపు దోఁచినన్
గను మొఱఁగుంట రాజునకుఁ గర్జమటంచెట యేనిఁ జన్నయు

ట్లను చరుల్తై వెలింగెడి గ్రహంబులుఁ దారలుఁ దోడరాఁగ వేఁ
గనచనె వెల్ల వెల్లని మొగంబు కళంకమునన్ శశాంకుఁడున్.

గీ. రాజురాకకుఁ దారహారముఁ తోడి
యామినీ పాత్ర నాడింప నేమి పమయు
నాటకుఁడు దోఁపు తెర వారినాఁడనంగ
సాంధ్యరాగము పచ్చిమాశను దనర్చె

సీ. సంజప్రొద్దున నాటసలుపు నంబరకేసు
తల యేటి జలకణ తతులనంగ
రజనీవధూద్విజరాజుల పెండ్లికే
ర్పఱచు ముత్తెపుఁ దలఁబ్రాలనంగ
గాలవాణిజ్యుండు నీలాంబరస్థలీ
స (?) జచరించు వజ్రములనంగ
వేళాఖ్య పుష్పలావిక యిందుఁడను రాజు
నకు నేరిచిన ప్రసూనంబు లనఁగఁ

గీ. బాలవెల్లి మథించు తొల్కాలమునను
నమృతబిందువులు దరి మిన్నందె ననఁగ
గగనమనుకోల నలమిన తొగ లనంగఁ
గలయఁ జుక్కలుతోఁచె నాకాశవీధి.

మ. సమలావణ్యము వన్నెకూడి రసముల్ సంధించి శృంగారవే
షముతోఁ జొక్కపుఁజూపు నవ్వొలయ నిచ్ఛాతూలికన్ భావచి
త్రముగాఁ బంచశరుండు రాగరతిఁ జెంతం జూచుచున్ వ్రాసి ప్రా
ణము వాగీశ్వరు వేఁడి నించెననమే నాపుత్త్రి యొప్పెం గడున్.

మంగళగిరి విలాసము:—

ఉ. హారతులిచ్చు వేయి న...సారికి రాయని గన్నతండ్రి కో
య్యారి మెఱుంగుఁ జూపులనె యారతులిచ్చె నొకర్తు తజ్ఝణా
త్కారకరద్వయీవలయకాంతులు గుత్తపుఁ జన్నుదోయి తా
హారగళంచలన్నలు జాలతశనెంతకు రాయభాకాంతిమై (?)

సూర్యశతకము :—

శా. ఈఁగల్వోలె వ్రణంబులే వెదకుచు న్నీర్ష్యాంబరున్ మెచ్చకే
మూఁగల్వోలె నిరంతరాస్యులగుచున్ మూర్ఖించి తర్కించినన్
వీఁగన్నేరని దుష్కవుల్ బ్రతుకనీ విక్రాంతులై వారినో
రాఁగం బోవఁగ నేల సత్కవుఁడు సూర్యా! పద్మినీవల్లభా!

మల్లిఖార్జునలింగ శతకము :

సీ. కాంతులఁ జూపట్టు కండ్లమరించిన
తిరమైనవిపులపుఁ దేరునందు
విద్యలపోఁక యా వృద్ధసారధినిల్పి
యతఁడుశిక్షించు హయములఁ బన్ని
తన్నివాసులమించు తిన్ననిప్రావిల్లు
చొక్కఁపైనారి నక్కవెట్టి (?)
గరితోడఁగూడ నాకసపు సూటిని బాగు
నెమ్మెనుఁ బసనిచ్చు నమ్ముఁ దొడిగి
గీ. యమరభటులార్వ దైత్యపురములు గెడపి
విజయమందివ జోద పీవిశ్వమునను
వేల్పులెవ్వరు నీసాటి విజయవాటి
మల్లికార్జునలింగ! యుమాప్రసంగ!

సీ. ఖండఖండంబుగఁ గదిసిన తేరును
భంగంపు టిరుసు బొసంగఁగూర్చి
విజ్జోడుపడి నిచ్చ విసువీథిఁ దిరిగెడు
చక్రంబు లొనగూడ సంఘటించి
తరుకొన్న భీతిఁ గొందలపడ బహుముఖ
భ్రాంతసారథి నేరుపరిగి నిలిపి
పలుకఁ బదక్రమంబుల నలుజాడలఁ
బోరెడి గుఱ్ఱముల్ పూనుకొలిపి

గీ. కుంటి వింటను బలువంకకోలఁ దొడిగి
విషమలక్ష్యంబు వేగతివ్రేసితయ్య... వేల్పు...

సీ. బంట్లున్న పాలెంబు బలువిల్లుగాఁజేసి
నవమణివలయంబు నారిఁజేసి
నుదుటి సెన్నడిమికన్నును ముల్కిగాఁజేసి
దక్షిణాంగంబయస్త్రంబుఁ జేసి
చేకోరతలవాని జోకసారథిసేసి
తనమూర్తి యొకటి రథంబుసేసి,
కనుఁదోయిఁ జక్రయుగ్మముగ యోజన చేసి
సమతనూరుపుల వశ్వములఁ జేసి

గీ యన్నియును నీయధీనంబు లగుటఁజేసి
పురము లేసితి గాక నీకొఘలుతోఁడె... వేల్పు...

"వేల్పులెవ్వరు నీసాటి విజయవాటి
మల్లికార్జునలింగ! యుమాప్రసంగ!"

అనుమకుటముతో శతకము వ్రాసియుండుటచే నీకవి బొడ్డపాడు నివాసుఁడగుట నిశ్చయమని చెప్పవచ్చును. ఆగ్రామమున బొడ్డపాటి వారార్వేలనియోగులు ఆత్రేయసగోత్రులును, భారద్వాజసగోత్రులును గలరనియు, నూఱు సంవత్సరములకిందట నాత్రేయస గోత్రులలో బొడ్డపాటి పేరాజుగారును; భారద్వాజస గోత్రులలోఁ గొండయ్య గారును నుండిరనియు, వారు కపత్వము చెప్పినట్లు కానరాదనియుఁ నాగ్రామకరణమగు బొడ్డపాటి లింగరాజుగారు నాకువ్రాసియున్నారు. తాతపేరు మనుమనికిఁ బెట్టుచు వచ్చుటచే నా నామములు గ్రమముగా వచ్చినవని భావించినచో నీబొడ్డపాటి పేరయకవి క్రీ. శ. ౧౫౦౦ ప్రాంతమున నీబొడ్డపాడు గ్రామమున నివసించియుండెననియు నాత్రేయసగోత్రజుఁడనియు నిర్ణయింపవచ్చును. బొడ్డపాటి కొండయకవి కూడ నున్నాఁడు. ఆతని చరిత్రమును నీతరువాతనే వ్రాసెదను. ఇంత కంటె నీకవినిగూర్చి యేమియుఁ దెలిసినదికాదు.

ఉదాహృత పద్యములవలన నీకవి రసజ్ఞులు మెచ్చునట్టి కవిత్వమును జెప్పఁగలవాఁడని స్పష్టమగుచున్నది. ఈతని గ్రంథమొక్కటియైనను లభింపకుండుట విచారకరమైన సంగతి.



## 139 బొడ్డపాటి కొండయ

రామాప్రెగ్గడ జగ్గన ప్రబంధరత్నాకరములో నీతని పద్యములని యుదాహరించిన యీక్రింది మూఁడు పద్యములను ప్రబంధరత్నావళినుండి గైకొని యిటవ్రాయుచున్నాఁడను. ఇతఁడు "అంగభవభంగ తిరుకాళహస్తిలింగ" యనుమకుటముతో నొకశతకమో తారావళియో వ్రాసియుండవచ్చును. అనంతమహాత్మ్యాది గ్రంథములను రచియించిన పేరయకవి యీతనివంశము లోనివాఁడేమో!

సీ. కడఁగి యొక్కఁడనైనఁ గదలని యరదంబు
    నరదంబుపై నిల్చినట్టి విల్లు
వింటికిఁ గాపుగా విహరించు చక్రముల్
    చక్రములను బ్రొద్దు జరపుశరము
శరమునఁ బొడమిన చక్కని సారథి
    సారథి మొగమున జాఁగుహరులు
హరుల సామర్థ్యంబు నరసిన శింజిని
    శింజినిఁ దరిత్రాడు సేయుబలముఁ
గీ. బొందువడఁజేసి దైత్యులపురము లేసి
యఖిలజగములు రక్షించునట్టిజోద
వనుచుఁ గొనియాడుదురు నిన్ను ననుదినంబు
నంగభవభంగ! తిరుకాళహస్తిలింగ!

సీ. తొమ్మిది తునుకల నెమ్మిఁగూర్చిన తేరు
    సరిజోకఁ గూడని చక్రయుగము

నొకముఖంబునఁ గడ్వ నోపనిసారథి
రూపింపరాని వారువపు సమితి
బెడిదంపు దెగలకుఁ బెలుచైన విలుకమ్మి
గాలిచేఁ బ్రొద్దులు గడపునారి
పదివంకలై చాయఁబోఁజని బాణంబు
పడి బన్తెములు లేని భటగణంబుఁ

గీ. బొందువడఁజేసి దైత్యుల పురము లేసి
యఖిలజగములు రక్షించునట్టిజోద
వనుచుఁ గొనియాడుదురు నిన్ననుదినంబు
నంగభవభంగ! తిరుకాళహస్తిలింగ!

సీ. దేహంబు మిక్కిలి తిరమైనరథముగా
ఘననేత్రయుగము చక్రములుగాఁగ
నూర్పులశ్వంబులై యొప్పారుచుండఁగ
(?) దొరయు బల్లెరము నూతుండుగాఁగ
సర్వాంగ మతిఘోరసాయకం బదిగాఁగ
షొరిదిఁ గుంతలములు జోడుగాఁగ
దలమైన విహారణస్థలము కార్ముకముగా
నలువైన హారంబు నారిగాఁగ

గీ. నన్నియును నీమహత్త్వంబ యగుటఁజేసి
లీలఁ ద్రిపురంబు లేసి గెల్చితివిగాక
నీకు నొరులు సహాయులై నిలువఁగలరె?
యంగభవభంగ! తిరుకాళహస్తిలింగ!

ఈమూఁడుపద్యములయందును త్రిపురసంహారమే మూఁడువిధములుగ వర్ణింపబడినది.

ఈకవినిగూర్చి బొడ్డపాటి పేరయకవి చారిత్రమున నించుక వ్రాసియుంటిని. కొండయకవి భారద్వాజసగోత్రుఁడనియు, విజయవాడకుఁ దూర్పునఁ బదునైదు మైళ్ళ దూరముననున్న బొడ్డపాడితని

నివాసమనియుఁ దెలియుచున్నది. "వేల్పులెవ్వరు నీసాటి విజయవాటి మల్లికార్జునలింగ! యుమాప్రసంగ!" అను మకుటముతోఁ బేరయకవి రచించిన శతకమందలి మూఁడు పద్యముల నాతని చారిత్రమున నిచ్చి యుంటిని. ఈకొండయకవి "అంగభవభంగ! తిరుకాళహస్తిలింగ!" యను మకుటముతోఁ గాళహస్తీశ్వరునిపై నొకశతకమును రచియించెను. వీరిరువురును భిన్నగోత్రీయులగుటచే నొకవంశమువారు కారనుట నిశ్చయము. వీరు సమకాలికులో వీరినడుమ నంతర మెంతయున్నదో చెప్పఁజాలము. వీరిరువురును దమతమ శతకములలోఁద్రిపురసంహార కథను వర్ణించియున్నారు. ఈపద్యములలో రెండిటికిని బోలికలున్నవి. పదసామ్యమును భావసామ్యమును గూడఁగలదు. ఎవరి నెవరనుకరించిరో చెప్పఁజాలను.

ఈకవినిగూర్చి యింక నేమియుఁ దెలియదు



## 140 తెనాలి అన్నయకవి

ఇతఁడు యాజ్ఞవల్క్య నియోగిబ్రాహ్మణుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. రామమంత్రి పుత్త్రుఁడు. పాండురంగ విజయ, ఘటికాచల మాహాత్మ్యాది గ్రంథములను రచియించి సుప్రసిద్ధుఁడైన తెనాలిరామకృష్ణకవియు, శ్రీశైలమాహాత్మ్య కృతికర్తయగు తెనాలి శ్రీగిరికవియు నీకవి కగ్రజులు. ఈభ్రాతృత్వమును ధ్రువపరచు పద్యములను వారిచారిత్రములయందిచ్చియున్నాఁడను. ఒకరినిగూర్చి యొకరు వీరుమువ్వురును దమతమ గ్రంథములయందు వ్రాసికొనియుండలేదు. అయినను వీరన్నదమ్ములనుట నిర్వివాదాంశము.

ఇతఁడు సుదక్షిణాపరిణయమను నైదాశ్వాసముల ప్రబంధమును రచియించి, పులిజాల సోమయామాత్యున కంకితముచేసెను. రామ

కృష్ణ కవివలెనే యీయన్నయకవియు, మొదట శైవుఁడై పిదప వైష్ణవమతమును గ్రహించినట్లీతఁడు దనగ్రంథమునఁ జేసిన గురువర్ణనము లనుబట్టి తెలియుచున్నది.

గీ. కాళిదాసాది సంస్కృత కవులఁదలఁచి
యాంధ్రభాషావిశేష భాషాధిపతుల
నన్నపార్యాదులను బుద్ధి సన్నుతించి
పాలగుమి భీమగురుని సద్భక్తిఁగొలుతు.

ఈతని సోదరుఁడైన రామలింగకవి గురువు పాలగుమి యేలేశ్వరుఁడు. రామలింగ (రామకృష్ణ) కవియు నీయన్నయయు సోదరులైనట్లే యీసోదరులకు గురువులైన పాలగుమి యేలేశ్వర భీమేశ్వరులుకూడ సోదరులేమో! ఈభీమేశ్వరుఁడు విద్యాగురువై యుండును. వైష్ణవమంత్ర ముసంగినవాఁడు కందాళభావనాచార్యుల తనయుఁడైన శ్రీరంగాచార్యులు. ఆతని నీకవి యిట్లు నుతించియున్నాఁడు.

క. కందాళభావనార్యుల
నందను శ్రీరంగగురుని నతబుధరత్నా
మందారంబు నుతింతును
మందారమరందబిందు మధురారభటిన్.

తెనాల్యగ్రహారమునం దీకవికెంతవఱకు సంబంధమున్నదియుఁ జెప్పఁజాలము. కాని యీతని నివాసము తెనాలియేయని సుదక్షిణాపరిణయమందలి యీక్రింది గద్యమువలనఁ దెలియుచున్నది.

"ఇది శ్రీమత్తెనాలి రామేశ్వర శాశ్వతకృపాకటాక్షలక్షిత కవితాభిరామ రామయపండిత కుమార సహజశైవాచార సంపన్న ధీమదన్నయ నామధేయ ప్రణీతంబైన సుదక్షిణా పరిణయంబను శృంగార కావ్యంబు"

తాను వైష్ణవాచార్యుని శిష్యుఁడనని వ్రాసికొనియు నాగ్రంథాంతగద్యయందే శైవాచార సంపన్నుఁడనని వ్రాసికొనుటఁజూడ నీతఁడు వీరవైష్ణవుఁడును వీరశైవుఁడునుగూడఁ గాఁడనియు, ముద్రాం

కితుఁడయును శైవాచారములను విడనాడలేదనియు శివకేశవులయెడ సమానాంతఃకరణము గలవాఁడనియు నిశ్చయింపఁదగియున్నది.

సుదక్షిణాపరిణయకృతిపతి తనను గూర్చి పలికిన వాక్యములఁ గ్రింది పద్యములలోఁ జెప్పుకొనియున్నాఁడు.

గీ. సవ్యసుగుణాభిరామ తెనాలిరామ
పండితాగ్రణి సత్పుత్రు భవ్యమిత్రు
హరపదాంభోజ సౌముఖ్య నన్నపాఖ్యు
నన్నుఁ బిలిపించి, యాదరోన్నతివహించి.

చ. పలుకులకల్కి కప్పురపుఁ బల్కులు చల్లినరీతిఁ బండువె
న్నెల తళుకుల్ విధుంతు హావణించిన మించున శంబరారిచెం
గలువలతూపుఁగోపుల ముఖాముఖిఁ జూపినయేపెసం గృతుల్
పలుకఁగనేర్తు పూర్వకవిపద్ధతి రామయ యున్నసత్కవీ !

గీ. సరససాహిత్య సౌహిత్య పరతనీవు
పరిభవించు సుదక్షిణా పరిణయంబు
కీర్తివిలసిల్ల మాకు నంకితముసేయు
కేటయుగు వాగ్విలాసంబు కోటిసేయు"

ఈకవికగ్రజుఁడగు రామకృష్ణకవి క్రీ. శ. ౧౫౦౦ – ౧౫౭౦ నడుమ నున్నవాఁడని యాతని చారిత్రమున వ్రాసియుంటిని. ఆతని సోదరుఁడగు నీకవి పదేండ్లుతక్కువగా నాకాలమువాఁడని తెల్పి యీ కవికాలమును సులభముగా నిర్ణయింపవచ్చును. కాని యింతులకొక యాక్షేపణము రావచ్చునని రామకృష్ణకవి చారిత్రములో ననుమాన మును జూపి యందులకు సమాధానము నిచ్చుటవ్రాయుదునని చెప్పియు న్నాఁడను (అ). కావున రామకృష్ణకవి కాలముపై నాధారపడకుండ నీతని కాలమును స్వతంత్రముగ నిర్ణయించి పైయనుమానమును దీర్పఁ బ్రయత్నించెదను.

---

(అ) ఆంధ్రకవితరంగిణి సం ౫ పుట ౭౬.

సుదక్షిణా పరిణయ కృతిపతిని పోషించినవాఁడు కోనేటి రామరాజు. ఇతనికాలములోని యాతఁడు తెనాలి యన్నయకవి. కోనేటి రామరాజునకు చిన్నముత్తాత కొడుకు అళియరామరాయలు. రామకృష్ణకవి యీతని కాలములోనివాఁడు ముత్తాత మునిమనుమల కాలములోనున్న రామకృష్ణాన్నయ కవులు సోదరులగుట సంభవమా? అనునదియే శంకాస్పదమైన విషయము.

ఈయన్నయకవి తన సుదక్షిణా పరిణయమును పులిజాల సోమయామాత్యుని కంకితము చేసెనని పైని వ్రాసియుంటిని. ఈతని వంశమును గవి ముప్పది పద్యములలో వర్ణించియున్నాఁడు. అందు రెండు పద్యములలోఁదక్క తక్కినవి కాలనిర్ణయమునకుఁ దోడుపడునవికావు. ఈరెండుపద్యములైనను స్వతంత్రముగఁ గాలనిర్ణయమును జేయఁజాలవు అయినను నాపద్యముల నిటవ్రాయుదును.

స్రగ్ధర, శ్రీమత్కోనేటి రామక్షితిపతి కరుణాసింధు సంభూత రాజ్య
శ్రీమాధుర్యైకధుర్యా శ్రితభరణ కళాశేష భూషోపమానా!
రామోద్దానుభావా! రసిక నుతగుణా రామరమ్యస్వభావా!
సామర్థ్యాకల్పమూర్తీ సతతనయ విశేషప్రధానసత్యకీర్తీ ౧౨౧౩౮

క. కోనేటి రామరాజ ద
యానూన ప్రాప్త శాశ్వతైశ్వర్యనిధీ!
దానకలాజిత జలధీ!
నానాకాంచనగృహాంగణ స్థాననిధీ! ౪ ఆ. ౧౬౮

కృతిపతిని సంబోధించిన యీరెండు పద్యములలోను, నతఁడు కోనేటి రామరాజునొద్ద నుద్యోగిగా నున్నట్లు స్పష్టమగుచున్నది. ఇంతియకాక:—

మ. స్మరజిద్వక్త్రమథామునఁ డాయళియ రామక్ష్మావరోత్తంసుచే
గురుసామ్రాజ్య ధురంధరత్వమునుఁ డాకోనేటి రామాధిప
స్థిరసైన్యాధిపుఁ డబ్బమంత్రి వరియించెన్ యజ్ఞమాంబన్ మనో
హర భాగ్యోన్నతిఁ గంకిపాటిపుర వేదామాత్య పుత్రీమణిన్.

ఈపద్యమున నుదాహృతుఁడైన యుబ్బమంత్రి కృతిపతికి రెండవ తమ్ముఁడు. కోనేటి రామరాజునొద్ద సేనాధిపతి. ఈ పద్యములనుబట్టి పులిజాల సోమయామాత్యున కాశ్రితుఁడు కోనేటి రామరాజని నిశ్చయమయినది. కావున నారామరాజు కాలమును దెలిసికొనఁగలిగితిమేని, కృతిపతి కాలమును దానిననుసరించి కవికాలమును నెఱుంగగలము.

కోనేటి రామరాజ వంశమును నన్నయకవి సుదక్షిణాపరిణయమున నెనిమిది పద్యములలో వర్ణించియున్నాఁడు. వాని ననుసరించియు రామపరాజు రంగపరాజుకవి రచించిన సాంబోపాఖ్యానమును బట్టియు, నీకవికాల నిర్ణయమునకుఁ వలయునంతవఱకు వంశవృక్షము నీక్రింద నిచ్చుచున్నాఁడను.

ఈక్రిందఁ జూపఁబోవు వంశవృక్షములో బుక్కరాజు, రామరాజు, తిమ్మరాజులను, దిమ్మరాజునకు మొదటి భార్యవలన కలిగిన నల్గురు కుమారులను ఇందులోఁ జినకొండరాజు తనయులు నల్వురను కోనేటి రామరాజును మాత్రమే అన్నయకవి వర్ణించియున్నాఁడు.

తక్కిన వంశవృక్షమును రంగపరాజు సాంబోపాఖ్యానమునుండి గ్రహించితిని.

ఇందులో శ్రీరంగరాజునకు మూఁడవ కుమారుఁడును శ్రీకృష్ణదేవరాయలకల్లుఁడునైన యళియ రామరాయలు క్రీ. శ. ౧౫౦౦ సంవత్సర ప్రాంతమున జన్మించి ౧౫౬౫ వ సంవత్సరమునఁ దాళికోట యుద్ధములోఁ జనిపోయెనని యనేక హేతువులను జూపి కృష్ణదేవరాయల చారిత్రమున నిర్ణయించియుంటిమి. అళియ రామరాయలు పెదతండ్రికి మునిమనుమఁడైన కోనేటి రామరాజు అళియరామరాయల కెంతయో తరువాతనుండునని స్థూలదృష్టికిఁ గోచరించును. కాని విమర్శించి చూచినచో నీకోనేటి రామరాజు అళియరామరాయలతో సమకాలికుఁడని స్పష్టమగుచున్నది. అళియరామరాయలచే నీకోనేటి రామరాజు గురుసామ్రాజ్య ధురంధరత్వము వడసెనని

# ఆరవీటి బుక్కరాజు

రామరాజు

- (పొట్లపాడి) తిమ్మరాజు
- పెదకొండరాజు — ఇతని వంశము చాలకలదు. కాని మనకిట పనిలేదని వ్రాయలేదు.
- (శ్రీ)రంగరాజు — ఇతనివంశము విశేషమున్నది. అవియంతయు నప్రస్తుతము ఇతని యైదుగురు కుమారులలో మూడవవాడు అళియరామరాయలు

(పొట్లపాడి) తిమ్మరాజు సంతానం:

మొదటిభార్య ..... వలన
(1) చినకొండ్రాజు
(2) తిమ్మరాజు
(3) అప్పలరాజు
(4) రామరాజు

రెండవభార్య లక్ష్మమ్మవలన
(5) పెదతిరుమలరాజు
(6) చినతిరుమలరాజు

మూడవభార్య గోపమాంబవలన
(7) నలతిమ్మరాజు
(8) విఠలరాజు
(9) చినతిమ్మరాజు
(10) పాపతిరాజు

4 వ భార్య తిరుమలమ్మవలన
(11) తిమ్మప్ప
(12) కోనప్ప
(13) సింగరాజు

(1) చినకొండ్రాజు భార్య కోనమ్మ సంతానం:
- కోనేటితిమ్మరాజు
- చినతిమ్మరాజు
- అప్పలరాజు
- రంగపరాజు — సాంబోపాఖ్యాన కృతికర్త

కోనేటితిమ్మరాజు కుమారుడు:
కోనేటి రామరాజు । (ఇతనియొద్దనే సువర్ణపరిణయ కృతిపతి మంత్రిగానుండెను.)

పైనుదాహరించిన "స్మరజద్విక్రమధాముఁ"డను పద్యము సాక్ష్యమొసం
గుచున్నది. క్రీ.శ. ౧౫౪౨ వఱకును గర్ణాటకరాజ్యపరిపాలమున నళియ
రామరాయలకు విశేషాధికారములేదు. సదాశివరాయలను పేరునకు
రాజుగానుంచి ౧౫౪౨ మొదలుగ నళియరామరాయలు కర్ణాట
రాజ్యపాలనమున సర్వాధికారము వహించెను. ఆకాలములో నీకో
నేటి రామరాజునకు రాజ్యపాలనలో జోక్యము కలిగినది. అళియ
రామరాజీతనికి రాజ్యాధికారమొసంగినది క్రీ. శ. ౧౫౫౦ ప్రాంత
మని యనుకొందము. అప్పటికాతని కధమను 25 సంవత్సరముల
వయస్సైననుండి యుండును. అందుచే నాతని జననము 1530
ప్రాంతమై అళియరామరాయలకంటె ముప్పదియేండ్లు చిన్నవాఁడై
1550 మొదలు 1565 వఱకు నాతనితో సమకాలికుఁడై యాత
నిచే గౌరవింపఁబడుచు రాజ్యాధికారమును వహించెనని స్పష్టమగు
చున్నది. రామకృష్ణకవి చారిత్రమునఁ జూపిన సంశయమును నివా
రించుట కీసంఘటన యొక్కటియే చాలును. కోనేటి రామరాజునొద్ద
మంత్రిగానున్న సోమయామాత్యుఁడు 1560 ప్రాంతమున సుదక్షిణా
పరిణయమును గృతినొందెననినచో నందు విపరీతమేమియు లేదు.

అళియరామరాజు క్రీ. శ. 1485—1500 ప్రాంతమున జన్మిం
చినపుడు ఆతని పెదతండ్రి మునిమనుమఁడు 1525 ప్రాంతమున
జన్మించుటెట్లు సంభవమగునను సంశయము పై వాక్యములవలనఁదీరదు
కావున నావిషయమును విమర్శింతము. అళియరామరాజు, తండ్రి
సంతానములో మూఁడవవాడు. అందుచే శ్రీరంగరాజునకును నళియ
రామరాజునకును నడుమ వ్యత్యాసము 40 యేండ్లుండవచ్చును. ఆప
క్షములో శ్రీరంగరాజు జననము 1455 ప్రాంతమగును, శ్రీరంగరా
జునకు జ్యేష్ఠాగ్రజుఁడైన పొట్లపాడి తిమ్మరాజు 1445 ప్రాంతమును
నాతని పెద్దకుమారుఁడైన చినకొండ్రాజు 1470 ప్రాంతమునను,
నాతని పెద్దకుమారుఁడైన కోనేటి తిమ్మరాజు 1495 ప్రాంతమునను,
నాతనికి 1525 ప్రాంతమునఁ గోనేటి రామరాజును పుట్టియుండురని

తలంచుటయందసంభవమేమియును లేదు. కావునఁ బైనిజూపిన సంశయమునకుఁ దావు లేదు.

(౨) పై వంశవృక్షములోని 7 వ సంఖ్యగల నలతిమ్మరాజు, దోనేరు కోనేరు కవిచే పద్య భాగవతమును వ్రాయించి తనతండ్రియు నప్పటికిఁ గీర్తిశేషుఁడునైన పొట్లపాడి తిమ్మరాజునకుఁ గృతియిప్పించెను. మఱియు నాతఁడే 9 వ సంఖ్యగల చిన తిమ్మరాజునకాకోనేరు కవిచేతనే ద్విపద భాగవతమును గృతినిప్పించెను. కోనేరుకవి తన ద్విపద భాగవత రచనాకాలము శా. శ. 1468 వ సంవత్సరమని చెప్పియున్నాఁడు. (కోనేరు కవిచారిత్రమును జూడుఁడు) నల తిరుమలరాజున కప్పటి కేఁబది సంవత్సరముల వయసుండునని తలంచి వచో నాతని జననము 1485 ప్రాంతమగును. ఇతనికైదుగురన్నలు కలరు. అందు మొదటివాని జననము 1470 ప్రాంతమని తలంప వచ్చును. దీనినిబట్టికూడఁ బై కాలము సరియైనదిగానే కన్పించుచున్నది. నలతిరుమలరాజును ఇతని జ్యేష్ఠాగ్రజుని తనయుఁడైన కోనేటి తిమ్మరాజును సమవయస్కులగుదురు. అందస్వాభావికము లేదు. చినతిరుమలరాజు కృతిచేయించిన పది - పండ్రెండేండ్లకు, కోనేటి రామరాజు దగ్గర మంత్రిగానుండిన సోమయామాత్యుఁడు కృతిఁబొందెననుటలోను విరోధము లేదు.

(3) సాంబోపాఖ్యాన కావ్యమును రచించిన రంగపరాజు, కోనేటి రామరాజునకుఁ బినతండ్రి. దోనేరుకోనేరు కవిరచించిన భాగవత కావ్యమును దన సాంబోపాఖ్యానములో నీతడు పేర్కొనినాఁడు. సాంబోపాఖ్యానము క్రీ. శ. 1550 ప్రాంతమున రచియించెనని సహేతుకముగ రంగపరాజు చారిత్రమున నిర్ణయించియుంటిని. రంగపరాజు తండ్రియైన చినకొండరాజు జననము 1470 ప్రాంతమైయుండునని పైని వ్రాసియుంటిని. ఆతని నాల్గవ కుమారుఁడైన యీ రంగపరాజు 1510 ప్రాంతమున జనియించి నలువదేండ్ల వయసున సాంబోపాఖ్యానమును రచియించియుండును. ఆతని పెద్దయన్న

గారైన కోనేటి తిమ్మరాజు జననము 1485 అని యనుటలో విరుద్ధము లేదు. రంగపరాజుకంటె నాతని యన్నకుమారుఁడైన కోనేటి రామరాజు పదునైదేండ్లు చిన్నవాఁడనుటలోఁగాని తనకావ్యమునకుఁదరువాత పదేండ్లలో నాతనియొద్ద మంత్రిగానున్న పులిజాల సోమయామాత్యుఁడు సుదక్షిణా పరిణయమును గృతినందెనని తలంచుటలోఁగాని విరుద్ధముండదు.

పై మూఁడు కావ్యముల నాధారముగాఁ జేసికొని తెనాలి యన్నయకవి క్రీ. శ. 1560 ప్రాంతమున సుదక్షిణా పరిణయమును సోమయామాత్యున కంకితము చేసియుండునని నిర్ణయించితిమి.

బ్ర. శ్రీ. వీరేశలింగము పంతులు గారాంధ్రకవుల చారిత్రమున సుదక్షిణా పరిణయ రచనా కాలము 1580 ప్రాంతమని నిర్ణయించి యున్నారు. శ్రీ మా. రామకృష్ణకవిగారా కాలము 1565 ప్రాంతమని వ్రాసిరి ౧. ఇదియే సరియైన నిర్ణయమని నాయభిప్రాయము.

ఆంధ్రవిజ్ఞాన సర్వస్వమున శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుపంతులు గారు, సుదక్షిణాపరిణయ ద్వితీయాశ్వాసములో మాయాశివుఁడు తన నివాసమునుగూర్చి చెప్పిన

క. పెనుగొండ నిలుతుఁ దఱచుగ
మనసెనసి ధనాఢ్యుఁ డొకఁడు మముఁ గూడుక రాఁ
జనవున సకలజనంబులుఁ
బనిసేయఁగఁ గొదవలేని బలగముతోడన్. 228.

అనుపద్యమున శ్లేషార్థమున్నదనియుఁ, బెనుగొండ యనఁగాఁ బెద్ద పర్వతమునకును, బెనుగొండ పట్టణమునకును, ధనాఢ్యుఁడనఁగాఁ గుబేరునకును మహారాజునకును జెల్లుననియుఁ దిరుమలరాయలు విజయనగరమునుండి పెనుగొండకు క్రీ. శ. 1562 వ సంవత్సరమునను పెనుగొండనుండి చంద్రగిరికి 1572 వ సంవత్సరమునకు దన రాజధానిని మార్చెననియుఁ గావున నీకావ్యము 1562—1572 నడుమ రచిత

౧ ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక పుట 103.

మయ్యోనని యూహింపనగుననియు వ్రాసియున్నారు. కాని నేనీయ భిప్రాయముతో నేకీభవింపఁజాలకున్నాఁడను. పెనుగొండ, రాజధానీ నగరమేమైనచోఁ గవి "తఱచుగ" అను శబ్దమునుపయోగింపఁడు. ఈశ్వరునకు ప్రధాననివాసము వేఱుగనున్నది. అట్లే యిచ్చట ప్రధాన నివాసము వేఱుగనున్న పురుషుఁడింకొకఁడుండవలయును. ఆపురుషుఁడు తిరుమలరాయలైనను గావచ్చును. మఱియెవ్వరైనఁ గావచ్చును. కావున నీపద్యమునుబట్టి కావ్యరచనాకాలము 1561–1562 నడుమ వని నిర్ణయింపఁజాలము.

ఈకావ్యకృత్యాదియందలి పద్యములనుబట్టి రచనాకాలము 1560 అనియే నిశ్చయింపవలసియున్నది.

పై పద్యము సుదక్షిణాపరిణయకవికిఁ గానికృతిపతికిగానియన్వయిం చునేమోచూడవలసియున్నది. ధనాఢ్యుఁడైన పులిజాల సోమయా మాత్యునితోఁగూడి యప్పుడప్పుడు పెనుగొండయందుండెడివాఁడనని కవితనస్థితిని శ్లేషగా యిందుఁదెలిపియుండుననియుఁ బెనుగొండ, కోనేటి రామరాజు పరిపాలనలోఁ జేరిన ప్రదేశమనియుఁ బరిపాలనా కార్య ములపై సోమయామాత్యుఁడు తఱచుగఁ బెనుగొండకు వచ్చుచుం డెడివాఁడనియుఁ నీపద్యమున కర్థము చెప్పవచ్చును. కోనేటి రామ రాజు నంద్యాల ప్రభువంశములోని వాఁడైనను, నాతని ప్రజ్ఞావిశేష ములనుబట్టి బెనుగొండసీమపై యధికారమును దాత్కాలికముగనైనను రామరాయలీతని కొసంగియుండును. అయిన నీవిషయమింకను బరి శోధనీయము.

తెనాలి రామకృష్ణుని జననము 1485–1500 ప్రాంతమని యాతని చరిత్రమునఁ జెప్పియుంటిమి. ఆతని రెండవ సోదరుఁడగు నీయన్నయకవి 1510 ప్రాంతమున జన్మించి తనతో సమవయస్కుఁ డగు సోమయామాత్యునకు తనకు 50 సంవత్సరముల ప్రాయమున నీకృతిప్రదానము చేసియుండునని తలంచుటలో విరుద్ధముండదు.

రామకృష్ణకవి పాండురంగ విజయమును, క్రీ. శ. 1550 ప్రాంతమున విద్యార్థి వేదాద్రికిఁ గృతియిచ్చియుండునని యాతని చారిత్రమున వ్రాసియుంటిని. ఆతనికంటెఁ బదేండ్లు పిన్నవాఁడును రెండవ సోదరుఁడునగు నీయన్నయకవి దాదాపుగ నావయసుననే పులిజాల సోమయామాత్యునకుఁ దనగ్రంథమును క్రీ. శ. 1560 ప్రాంతమునఁ గృతియిచ్చియుండునని నిర్ణయింతము.

పైనిఁజేసిన కాలనిర్ణయము శాసనములనుబట్టి పరీక్షించినప్పుడు నిలుచునా? మారిపోవునా? యనికూడఁ జూడవలసియున్నది. కృతిపతియైన పులిజాల సోమయామాత్యుని వంశములోనివారుగాని కృతిపతికాశ్రయుఁడైన కోనేటి రామరాజుగాని వ్రాయించిన శాసనములు కనుపట్టలేదు. ఈరామరాజు తండ్రియైన కోనేటి తిమ్మరాజునకుఁ బుణ్యముకోర కాతని కార్యకర్త వ్రాయించినది * క్రీ. శ. 1546 సంవత్సరమునాఁటిది కలదు. ఈతిమ్మరాజు జననము 1480 ప్రాంతమని పైని వ్రాసియుంటిమి. ఈశాసనకాలమునాఁటికి 56 ఏండ్లు వయసున నీతఁడుండియుండును. అప్పటికాతనికి ముప్పదేండ్లు వయస్సుగల రామరాజను కుమారుఁడును నుండియుండును. ఈశాసనమునుబట్టి యప్పటికాతఁడు జీవించియుండెనో లేదో తెలియదు. జీవించియున్నాఁడనుకొనినను 1550–1560 ప్రాంతమునఁ దెనాలియన్నయ యాతని కుమారుని మంత్రికిఁ గృతియిచ్చెనని నిర్ణయించుట కీశాసనము తోడుపడునుగాని యాటంకమును గలుగఁజేయదు. నెల్లూరు శాసన సంపుటములలో కోనేటి తిమ్మరాజు శాసనమొకటి శా. శ. 1471 (క్రీ. శ. 1548) లోఁగలదు ♦. ఈశాసనముకూడ పైనిఁజేసినకాలనిర్ణయమును బాధింపదు.

కోనేటి రామరాజునకుఁ బినతాతలైన విఠలరాజు, చినతిమ్మరాజు, పాపతిమ్మరాజు (పై వంశవృక్షములో 8, 9, 10 సంఖ్యలలోఁ

* A. R. 269 of 1928.

♦ నె. శా. సం. పుట 216.

జూపఁబడినవారు) అనువారల శాసనములు చాలఁగలవు 1. అవి క్రీ. శ. 1543 మొదలు 1551 వఱకు నున్నవి. వీనినిబట్టిచూచినఁ దాతయు మనుమఁడు నేకకాలమువారుగా గన్పట్టుదురు. కాని విమర్శించిచూచినచో నీవ్యత్యాసము గన్పింపదు. విఠలరాజు తన నలువది – నలువదైదేండ్ల వయసున మొదటి శాసనము వ్రాయించెనను కొనుఁడు. అప్పుడాతని జననము 1485 ప్రాంతమగును. ఇతఁడు పొట్లపాడి తిమ్మరాజునకు మూఁడవభార్యవలనఁ గలిగిన రెండవ సంతానము. ప్రథమభార్యవలనఁ గలిగిన ప్రథమసంతానమునకును విఠలరాజునకును నడుమనంతరము 25 సంవత్సరములుండునని తలంచితిమేని చినకొండ్రాజు జననము 1460 ప్రాంతమనియుఁ గోనేటి తిమ్మరాజు జననము 1485 ప్రాంతమనియుఁ గోనేటి రామరాజుజననము 1525 ప్రాంతమనియుఁ దేలును. ఇందువిరుద్ధమైన దేమియులేదు.

పొట్లపాడి తిమ్మరాజు జననము 1445 ప్రాంతమని యూహించితిమి. ఆతని తుదిసంతానముయొక్క జననము 1505 అయినచో నప్పటికిఁ దిమ్మరాజునకు 65 వత్సరములవయసుండును. ఇందును నస్వాభావికము లేదు. ఈయూహలలో నెచ్చటనైనఁ గొంచెము హెచ్చు తగ్గు లున్నను, గృతిప్రదాన కాలమును బాధించునవి కావు. రామకృష్ణాన్నయల సోదరత్వమునుగాని వారి చారిత్రములయందిచ్చిన కాలములను గాని బాధింపవు. అళియరామరాయలు కోనేటిరామరాజునకు సామ్రాజ్యపాలనాభారము నప్పగించెననినమాట యసత్యము కాదనియు ముత్తాతయు మునిమనుమఁడును నేకకాలములో నుండుట కొన్నిసందర్భములనుబట్టి కొన్నికుటుంబములలో నసంభవముకాదనియుఁ జూపుటకై యింతదూరము చర్చింపవలసి వచ్చినది.

ఈయన్నయకవి తనకుఁ గందాళ భావనాచార్యుని తనయుఁడైన శ్రీరంగాచార్యులు గురువని వ్రాసికొనినపద్యమును పైని నుదాహరించి

1. A.R. 360, 361 of 1932; 269 of 1935; 265 of 1933; 671-674; 708 of 1917; 18 of 1933. 2. దే. సం. 5 సంఖ్య 1, 51, 122, 156.

తిని. ఆరంగాచార్యుని శాసనములు క్రీ. శ. 1540 ప్రాంతమునఁ గన్ప ట్టుచున్నవి. ‡ ఇతఁడన్నయకవికి ముద్రాగురువుగాని విద్యాగురువు కాడు. విద్యాగురువు పాలగుమ్మి భీమేశ్వరుఁడేయైయుండును, అతఁడే శైవదీక్షనిచ్చియుండును.

కృతిపతికిఁ గుమారుఁడును కృతిపతి తమ్మునకుఁ బౌత్రులున్నా రని కవి వర్ణించియుండుటచేఁ గృతిప్రదానకాలమునకుఁ గృతిపతి యరు వదియేండ్లకు మించిన వయసు కలవాఁడుగా గాన్పించుచున్నాఁడు. కృతిపతినివాసము పులిజాల అయినట్లు "పులిజాలధామ" అనువాక్యము నుబట్టి తెలియుచున్నది. అది యెచ్చటనున్నదో తెలియలేదు. సుదక్షి ణాపరిణయ కృత్యాదియందుఁ గవి "దానొక్క ప్రబంధంబు రచియింప నుద్యోగించు సమయంబున మణికుట్టిమప్రాసాదసౌధమహాహట్టబాదాలి పట్టణ (శ్రీ) కిరీటం బగు కొలువుకూటంబునఁ" గృతిపతియగు సోమా మాత్యుఁడు సత్కావ్యగోష్ఠి యందుండి తనను బిలిపించినట్లు చెప్పి యున్నాఁడు. ఈబాదాలిపట్టణ మెచ్చటనున్నదో యదియు నెఱుంగ రాలేదు. బళ్ళారిమండలమున హర్పణహల్లితాలూకాయందు 'బాగాలి' యను గ్రామమును ననంతపురము మండలమున హిందూపురముతాలూ కాలో 'బూదలి' యనుగ్రామమును గలవు. బాదాలి ఈరెండింటిలో నేదైన నొకటియేమో! బాదాలి పులిజాలమాత్రము కాదు. పులిజాల కృతిపతి జన్మస్థానమును; బాదాలి యుద్యోగస్థానము నై యుండును.

ఇక్ష్వాకువంశమున జన్మించిన దిలీపమహారాజు చరిత్రయు, నాతఁడు రత్నచూడుఁ డను రాక్షసుని సంహరించి సురథుఁడనువాని తనయ సుదక్షిణయను గన్యను పరిణయమాడుటయు నీకావ్యమందలి ప్రధానవిషయములు. గ్రంథమునకు సుదక్షిణాపరిణయ మనునామమే కాని పంచమాశ్వాసమునందెక్కడ మఱియెచ్చటను నామెపేరే కాన్పిం పదు. దిలీపునితండ్రి యంశుమంతుని పరిణయవృత్తాంతము, ఆతనికి సంతానము లేకపోఁగాఁ దపము చేయుట, దిలీపజననము, అతని పరాక్రమ

‡ A. R. 703 of 1922; 528 of 1915 ఆ. దే. నం. 654, 655 T.T.

వర్ణనము, మృగయాఖేలనము మొదలుగాఁ బ్రబంధమునఁ నుండఁదగిన వర్ణనములు వీనితోఁ గ్రంథము నిండిపోయినది. ఇందుఁ గథావైచిత్ర్య మేమియు లేదు.

అన్నయకవిత్వము ప్రౌఢమై సలక్షణమై యన్నగారి కవిత్వముతోఁ దులతూగుచు మనోహరముగా నున్నదనుటకు సందియము లేదు. సంస్కృత రఘువంశమునఁ గాళిదాసు దిలీపమహారాజు చారిత్రమును విశేషముగా వర్ణించియున్నాఁడు. కాని యందు సుదక్షిణాపరిణయ మొకటిరెండు శ్లోకములకంటె నధికముగా లేదు. రఘువంశకావ్య మీ దిలీపమహారాజుతోడనే యారంభమైనది. అంశుమంతునకు దిలీపుని వలెనే దిలీపునకు రఘుమహారాజును లేక లేక కలిగిన సంతానమే. రఘుమహారాజునకు కౌత్సుఁడను ఋషీశ్వరుని యాశీర్వాదబలమున నజమహారాజుదయించెను. దశరథునకుఁ బుత్రకామేష్టి చేసినపిమ్మటఁ గాని శ్రీరామచంద్రాదులు కలుగ లేదు. రఘువంశమునం దిదియొక విచిత్ర సంఘటనము.

కవిత్వశైలి తెలియుటకై కొన్ని పద్యముల నుదాహరించెదను.

ఉ. కాంచనసౌధవీధిఁ బురకాంతలు నిల్చి నిజు త్తరంగిణీ
కాంచనపంకజమ్ముల నఖప్రతతిం జిదుమంగఁబోయి త
త్ప్రాంచితచంచరీకవలయంబులు ఝుమ్మను నాటమాని యో
డించుకొనంగఁ బూనినవడిన్ మరలింతురు మోముఁదామరల్. 1ఆ

ఉ. విప్రకులావతంస! వినవే యనుమానము మాని పుత్రకుం
డప్రతిమప్రభావనిధి యన్వయదీపకుఁ డుద్భవిల్లు న
వ్యప్రచురాంగకాంతిభర యౌవన లక్ష్మియు నిన్నుఁ జెందు ని
త్యప్రమదంబు చేకుఱు మహౌషధ మొక్కటి నీకు నిచ్చెదన్. 2ఆ

మ. ఉపధాసిద్ధుఁ ద్రివర్గశోభితు శుభోద్యోగిన్ నియోగిం గృపా
విపులస్వాంతు నితాంతశాంతు స్వమనోవిశ్రాంతు నశ్రాంతు జ్ఞా
నవరున్ దానగురున్ బ్రసిద్ధగుణసంతానున్ సమానున్ గళా
నిపుణున్ మంత్రిగఁజేసి భూపతిగనున్ నిర్ణిద్రసౌఖ్యోన్నతిన్. 2ఆ

ఉ. భానుమతీకుమారకుఁడు పల్కు మహేంద్రుని జూచి దేవయె
వ్వానికి గెల్వనోపమియు వచ్చునె కానొకవేళ దీనికై
దీనతయింత యేటికి మదీయభుజాగ్ర ధనుర్విముక్త నా
నానిశితాస్త్రపాతముల నాకుల నేనవలీలఁ గాచెదన్. 3 ఆ

ఉ. భానుమతీకుమార! పటుబాహుబలాఢ్యుఁడు రత్నచూడుఁడె
వ్వానికి వానికిన్ సమరవైఖరు లందలఁ జూపరాదు ము
న్నేనలినాసనుండిఁక నభీష్టవరంబుల నిచ్చె నేనిఁ బై
పై నెతిమించు కేసరికిఁ బక్కెర వేయుట గాదె మేదినిన్. 3 ఆ

ఉ. ఎక్కడనుండి వచ్చితి మునీంద్ర మహేంద్రునివీటినుండియో
యక్కమలామనోహరున కాస్పదమౌ తెలిదేవినుండియో
పుక్కిటియందు నిందుముఖిఁ బూనిన వేలుపుటెంకినుండియో
చక్కరవిల్తునేర్చు దొరసావడినుండియో ధాత్రినుండియో. 4 ఆ

ఉ. తమ్ములగొంగ జక్కవలదాడి వియోగులముక్కుగొయ్యలో
కమ్ములతన్వి పాల్కడలికానుపు వేల్పులచల్ది చంద్రికాం
తమ్ములు నానుమందు కుముదమ్ముల జన్మఫలంబు కల్వచె 4 ఆ
ల్వమ్ములయిక్క చక్కనగువాఁడు సుధాంశుఁడు దోఁచె దూర్పునన్.

శా. పన్నీటం జలకంబు దీర్చి తరుణీపంచాస్త్రుఁ డారాజు లే
మిన్నల్ గొల్కెడు నొంట్లుహారలతయున్ మేతావినున్న్యాఁతయు
న్నిన్నుంగన్న మేఱుంగు రంగును సురామెట్టంబసల్ వేల్పుఁబూఁ
బిన్నల్ చుట్టుశిఖాకలాపము దగంబ్రేమంబు దైవాఱఁగన్. 5ఆ

చ. ఎదుట మహీశుఁగాంచి తరళేక్షణ మేను చెమర్ప సమ్మదం
బొదవియు సిగ్గుపెంపునఁ బయోజదళాక్షుల వంపుఁజూపుముం
దుదలనదల్చివై చికరతోయజకేళి సరోరుహంబునన్
బదరుచుఁ ద్రిప్పివైచె విభుపార్శ్వగతంబగు రత్నదీపమున్. 5 ఆ



# 141 రెడ్డిపల్లె ముద్దమరాజు

ఈకవినిగురించి యేమియుఁ దెలియరాలేదు. ఆంధ్రసాహిత్యపరిషత్తునందున్న యుదాహరణగ్రంథములో నీముద్దమరాజు అష్టమహిషీకళ్యాణము లోనివని రెండుపద్యము లుదాహరింపఁబడియున్నవి. వానినీక్రింద నుదాహరించుచున్నాఁడను.

ఉ. రామకథాసుధారసము బ్రహ్మపయోంబుధి మున్నియుండఁగా
నేముని వాక్యమందర మహీధరసన్మథనంబుచే సము
ద్దామత సంగ్రహించి విబుధప్రకరంబున కిచ్చె నర్థిమై
నామహితుం బ్రచేతసుని యాత్మజుఁ గొల్చెద నాదిసత్కవిన్.

శా. శ్రీవామాగ్రహలిప్త సన్మృగమదశ్రీఁబొల్చు వక్షంబునన్
శ్రీవత్సంబు వెలుంగఁ గౌస్తుభము లక్ష్మిదీపమై యొప్పఁ ద
ద్దేవీఖేలనలోలచిత్తుఁ డగు శ్రీదేవుండు కృష్ణుండు స
ద్భావం బొప్పఁ గృపావలోకనమునన్ బాలించు త్రైలోక్యమున్.

రెడ్డిపల్లె అనంతపురమండలమున కదిరితాలూకాలో నున్నది. ఆగ్రామమునుబట్టి యీకవి యింటిపే రేర్పడియుండవచ్చును. ఆగ్రామమున రెడ్డిపల్లెవా రుండి రేమో తెలిసికొనుటకుఁ బ్రయత్నించితిని గాని నాప్రయత్నము నెరవేరలేదు. ఈపద్యముల నుదాహరించిన యుదాహరణగ్రంథకర్త క్రీ.శ. 1560 ప్రాంతమువాఁడు కావున నీకవి యంతకుఁబూర్వుఁ డగుట నిశ్చయము.



## 142 ఒడ్డెపూడి పెద్దయకవి

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కాశ్యప గోత్రుఁడు; పేరమాంబావెంకటమంత్రులతనయుఁడు.

ఈతఁడు వాయుపురాణమందలి మాఘమాహాత్మ్యము నాంధ్రీకరించి కమ్మచౌదరీపట్టభద్రుఁడగు దాసరి చినగంగన్న కంకితము చేసెను. ఈకవి చినయొడ్డెపూడికిఁ గరణమైన ట్లీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది. ఈచినయొడ్డెపూడి నైజాము రాష్ట్రములోనిదై యుండును.

చ. వినతసమస్తభూభుజుని వేంకటమంత్రికిఁ బేరమాంబకున్
దనయుని బుణ్యావర్తనుని దానగుణాన్వితు సారసింహస
ద్వనరుహచంచరీకు ననీవార్యవచోరచనావిశారదున్
ననుఁ జిన యొడ్డెపూడిపురనాథునిఁ బెద్దకవీంద్రుచంద్రునిన్.

ఈకవి లక్ష్మీనృసింహ వరప్రసాద లబ్ధకవితాసార యశస్కుఁడైన ట్లీక్రిందిగద్యములోఁ గాననగును.

"ఇది శ్రీమద్వరాహగిరి లక్ష్మీనృసింహవరప్రసాదలబ్ధ సారస్వత విచిత్రాపస్తంబసూత్ర కాశ్యపగోత్రపవిత్ర ఒడ్డెపూడి వేంకటమంత్రి పుత్ర సకలసుకవిజనవిధేయ పెద్దయ నామధేయప్రణీతం బైనవాయు పురాణంబునందు మాఘమాహాత్మ్యం బనుమహాప్రబంధంబు".

ఈలక్ష్మీనరసింహస్వామి విశాఖపట్టణమందలి సింహాచలమందున్నాఁడు. ఈకవి యాస్వామి యనుగ్రహముచే లబ్ధమైన సారస్వతము గలవాఁ డనుటచే నాప్రాంతములవాఁడనితోఁచుచున్నది. ఈకవియో, యాతనితండ్రియో, యచ్చటనుండి యోఢ్రరాజులనాశ్రయించి, తెలంగాణమునకు వచ్చి యొడ్డెపూడికరణికమును సంపాదించి యుండును.

ఈగ్రంథకృత్యాదిలో:—

"అని శ్రీమద్వరాహగిరి వేంకటలక్ష్మీనృసింహులం దలంచి తదనుగ్రహంబున నిరఘుండనై కృతార్థతం జెందితి" నని చెప్పుకొని యున్నాఁడు.

గ్రంథాదిపద్యమున శోభనాద్రీశ్వరుని నీక్రిందిపద్యములో నుతించియున్నాఁడు.

శా. శ్రీ లింపొందఁగ నాల్గుహస్తముల లక్ష్మీదేవి నుంజెక్కులన్
బాలిండ్లన్ సవినోదలీల మకరీపత్రావళుల్ వ్రాయుశౌ
భాలంకారుఁడు శోభనాచలనృసింహస్వామి సద్ధర్మసం
శీలున్ దాసరిచిన్నగంగవిభు దాక్షిణ్యంబునం బ్రోవుతన్.

కవినిగూర్చి కృతిపతిపలికినవాక్యముల నిందుక్రిందఁబొందుపరచుచున్నాఁడను.

వా......వాయుపురాణం బుత్తమం బని యార్యజనంబు లెన్నుదురు. తదీయఖండత్రయంబులో మాఘమాహాత్మ్యఖండంబు పయఃపారావారమథనంబున నుదయం బగుసుధారసంబుపోల్కి హరిభక్తిహేతుకంబును సకలజన వర్ణితంబునునై యొప్పు నప్పుణ్యకథ యాంధ్రభాషావిశేషంబు నొక్కకృతి చమత్కృతిగా రచింపుమని......

ఉ. పంకజగర్భదారకటిభాగ విశాసితభర్మమేఖలా
కింకిణికావిరావములఁ గేరి తదీయకరాగ్రవిస్ఫుర
త్కంకణ నిష్కళంకనినదంబు నగున్ చినయొడ్డెపూఁడిమా
వేంకటమంత్రిపెద్దన నవీనవిలాసవచోనిగుంభముల్.

ఈయొడ్డెపూఁడినిబట్టి కవి గృహనామమేర్పడియుండును.

ఈకవి యీక్రిందిపద్యములోఁ గావ్యలక్షణమును జెప్పి యందులకు లక్ష్యముగాఁ దనకావ్యమును రచియించియున్నాఁడు.

ఉ. లక్షణయుక్తమై కనదలంకృతితో నతులార్థసంగ్రహా
ధ్యక్షణ గల్గి భర్తకునుదీర్ణయశంబును గల్గఁజేయుచున్
దక్షతతోడుతన్ వినిన దారితకల్మషయై పతివ్రతా
ఝాక్షి యనంగ నొప్పవలదా కృతి సర్వసభాంతరంబులన్.

కవి తనగ్రంథమునఁ గమ్మవారి నిట్లు వర్ణించియున్నాఁడు.

చ. హరిపదసంభవుల్ బుధహితాతిశయుల్ కమలాశ్రయుల్ శుభా
చరులును బుణ్యజీవనులు సత్పదవర్తులు లోకపావనుల్

సరసకవిప్రజాప్వదులు చార్రుగభీరులు నై వియన్నదీ
స్థిరగతు లైనవారి నుతిచేసెదఁ గమ్మకులాగ్రగణ్యులన్.

కృతిపతిని గవివర్ణించిన పద్యము నీక్రింద నుదాహరించుచు న్నాఁడను.

సీ. సహకారపనసకేసరనింబజంబీర
సరళాది భూరుహోత్కరము నిల్పె
నిఖిలజీవాధార నిమ్నపుష్కరమైన
చెఱువు చేయించె నచ్చెరువుగాఁగఁ
జతురదేవాగార శార్ఙకోదండప్ర
తిష్ఠాసమానకీర్తిఁ దేజరిల్లె
నుర్వీసురశ్రేణి కుపనయనయనోద్వాహ
వస్తుప్రదాతయ్యెఁ డై వాసికెక్క
నౌర! యన మీఱెఁ బురుషోత్తమాభిధాన
పట్టణ స్థితిచాదరి పట్టభద్రుఁ
డనుపమోదారనియుతవర్తనుఁడు మాన
ధనుఁడు దాసరిచినగంగఘనయశుండు.

కృతిపతికిఁగలవిద్యాదక్షత, యీక్రిందిపద్యమువలనఁ దెలియును.

మ. క్రమమింపొందఁ బురాణముల్ వినియు, ముఖ్యగ్రంథశాస్త్రేతిహా
సములున్ నాటకకావ్యలక్షణ బహుచ్ఛందంబులన్ జ్యోతిషా
గమసంగీతరహస్యముల్ స్మృతు లనేకంబుల్ విమర్శించితిన్
సమబుద్ధిప్రతిభన్ రమేశ్వరపదాబ్జ ధ్యానసంశీలినై;

కృతిపతినివాసము, బెజవాడసమీపమందున్న కొండపల్లికిఁ జేరువనుగల పురుషోత్తమపట్టణమనియు, నది పురుషోత్తమగజపతిచే నిర్మింపఁబడినదనియు నీక్రిందివచనమువలనఁ దెలియుచున్నది.

"......కొండపల్లికిం బ్రాగ్భాగంబున నున్నతస్థలంబునఁ గటకసింహాసనాధీశ్వర వీరశ్రీపురుషోత్తమ గజపతి నిర్మితంబును,... పురు

షోత్తమనామ పట్టణంబునం బరిపూర్ణ కరుణాసముద్రిందును గమ్మ వంశ పారావార చంద్రిందును,...శ్రీమన్నారుట్లగోత్ర పవిత్రుండును, సూరివర్ణిత చరిత్రుండును మద్దాలి తిరుమలాచార్య శిష్యుండును గవిత వైదుష్యుండును నగు దాసరి చినగంగనాహ్వయుండు".

కృతిపతికి నల్వురు పుత్రులున్నట్లును, వారు దానశౌర్యాది గుణములుగల యుత్తములైనట్లును గవివర్ణించియుండుటచే నీగ్రంథమును గృతిపొందిననాఁటికి, గృతిపతి యిరువది సంవత్సరములకుఁ దక్కువ కాని వయసునందుండియున్నట్లూహింపఁదగియున్నది.

గ్రంథరచనాకాలమును గవి చెప్పియుండలేదు. ఈకవికాలమునుగూర్చి భిన్నాభిప్రాయమున్నది. కృతిపతినివాసమైన పురుషోత్తమపట్టణము పురుషోత్తమ గజపతికాలమున నిర్మింపఁబడినదని చెప్పియుండుటచేతను, పురుషోత్తమ గజపతి హూణశకము 1466 మొదలు 1486 వరకు రాజ్యముచేసినవాఁడగుటను నీకావ్యము పదునైదవ శతాబ్దికిఁ దరువాత రచితమయ్యెననుట స్పష్టము. ఇదిగాక కవికాలమును దెలిసికొనుట కింకొక యాధారము గన్పట్టుచున్నది. కృతిపతియైన దాసరి చినగంగన హరిశ్చంద్రమహీపతిచేత బహుమతులనుబడసినట్లీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

ఉ. సాంద్రయశోధనుండు హరిశౌర్యుఁడు బాహుబలేంద్రుఁడాహరి
శ్చంద్రమహీతలేశుఁడు భృశంబుగ సత్యవచో (?) నొసంగఁగాఁ
జంద్రనుగంధపుష్పఘన సంకుమదాంబర రత్నరాజి ని
స్తంద్రశుభోక్తిఁ గైకొనియె దాసరి గంగన లోకమెన్నఁగన్.

ఈహరిశ్చంద్రుఁడు, ఓఢ్రదేశపు రాజులైనగజపతులకడ సైన్యాధిపతిగానున్నవాఁడు. ఈతనిని కులీకుతుబ్షాహాయను గోలకొండ ప్రభువు కుమారుఁడగు హైదర్‌ఖాన్ అనునాతఁడు జయించి పట్టుకొనినట్లు అద్దంకి గంగాధరకవి తపతీ సంవరణోపాఖ్యానమున నీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

శా. కీవిన్ హైదరుఖానుఁడుద్దవిడి నొడ్డీలన్ విభాళింపు చో
నావేళన్ భెదకొండపల్లి కడ జన్యక్షోణి దీప్తారి ర
క్తావైయార్తులు వాహినీపతి హరిశ్చంద్రుండు మార్కొన్న చో
జీవగ్రాహముగాఁగఁ బట్టుకొనె నక్షీణప్రభావోన్నతిన్.

కులీకుతుబ్‌షాహ క్రీ. శ. 1511 మొదలు 1543 వఱకును రాజ్యము చేసినవాఁడు. ఈతని రాజ్యకాలములోనే హైదర్‌ఖాను హరిశ్చంద్రుని జయించియుండును. కావున కృతిపతియైన చినగంగన యాకాలమువాఁడని యనుటకు సంశయము లేదు. కులీకుతుబ్షా కుమారుఁడైన హైదరుఖానును ఆతని తమ్ముఁడైన జంషడ్‌కుతుబ్‌షా తండ్రి జీవితకాలములోనే యంధునిఁ గావించి, తండ్రియైన కులీకుతుబ్షానును వధించి క్రీ. శ. 1543 లో గోలకొండ సింహాసన మాక్రమించుకొనియెను. అందుచేత హైదరుఖాను, హరిశ్చంద్రునిఁ బట్టుకొనినది 1543 సంవత్సరమునకుఁ బూర్వమైయుండును. హరిశ్చంద్రుఁడు చినగంగనను గౌరవించినకథ యీగ్రంథమున వర్ణితమైనది. కావునను, ముకుందదేవుని పేరుదాహృతమైనది కావునను, నీకావ్యము క్రీ. శ. 1550–60 ప్రాంతమున రచితమయ్యెనని నా యభిప్రాయము. బ్ర. శ్రీ. వీరేశలింగము పంతులుగారు, "వాయు పురాణము కృష్ణదేవరాయని కాలమున కనంతరముననే రచియింపఁ బడినట్లు తెలిసినది. కాని యెప్పుడు చేయఁబడినదో తెలియదు. అప్పకవి యీ పురాణమునుండి పద్యముల నుదాహరించి యుండకపోవుట మొదలయిన కొన్ని హేతులనుబట్టి హరిబట్టకవి కాలమువలెనే యీకవికాలమును 1660 సంవత్సరప్రాంతమని యూహింపఁదగియున్నది." అని వ్రాసియున్నారు. శ్రీపంతులుగారి హృదయమునకుఁ దట్టిన "మొదలైన కొన్ని హేతువు"లేవో మనకుఁ దెలియవు. అప్పకవి యీతని గ్రంథము నుండి పద్యముల నుదాహరింపకపోవుట కారణముగాఁ గైకొని యీ కవిని అప్పకవికిఁ దరువాతివాఁడనుట సమంజసము కాదు. అప్పకవి లక్ష్యములుగాఁ దీసికొనని గ్రంథములనేకము లంతకుఁబూర్వపుకవికలవు.

శ్రీపంతులుగారీకారణముచేతనే యప్పకవికిఁ దరువాతివాఁడని నిర్ణయించిన హరిభట్టు శాసనవాఙ్మయాధారములచే నప్పకవికి నూఱేండ్లు పూర్వుఁడని స్పష్టమైనది. కావున నిప్పట్టున శ్రీపంతులుగారి యూహ యనుసరణీయము కాఁజాలదు.

కమ్మవారి చారిత్రమును రచించిన శ్రీ కొత్త భావయ్య చౌదరి గారు శ్రీపంతులుగారియూహ నాధారముగాఁ గైకొని మరికొన్ని యుపపత్తులను జేర్చి కృతిపతికాలము క్రీ. శ. 1660 ప్రాంతమని నిర్ణయించియున్నారు. పెద్దయకవి రచించిన మాఘమాహాత్మ్యకృత్యాది యందలి పద్యములనుబట్టి యీక్రింది వంశవృక్షమేర్పడుచున్నది.




దాసరి తిమ్మనీఁడను నాతఁడు, వెలుగోటి కస్తూరి రంగనాయునితోఁ బోరి పారిపోయినట్లు వెలుగోటివారి వంశావళిలో నున్నదనియు, నాయుద్ధము క్రీ. శ. 1578 లో జరిగెననియు, నాతిమ్మనీఁడే, పై వంశవృక్షములోని రెండవ పురుషుఁడనియు, నాతనికి మునిమనుమఁడైన చినగంగన క్రీ. శ. 1660 ప్రాంతమున నున్నవాఁడని నిశ్చయింపవచ్చుననియు, శ్రీ భావయ్య చౌదరిగారి యభిప్రాయము.

శ్రీ చౌదరిగారాధారపడిన వెలుగోటివారి వంశావళిలోని పద్య భాగమిదియైయుండును.

> "దాసరేంద్రుని తిమ్మనిఁ దటిమితటిమి
> జయముఁ జేకొన్న వెలుగోటి సార్వభౌమ
> విమతమదభంగ యేచభూవిభునిరంగ! 132వ పుట

ఆతిమ్మనీఁడే యీతిమ్మనీఁడనుట కాధారములు లేవు. కృతిప తికిఁ బిమ్మట నావంశములోనో మఱియొక వంశములోనో వేఱొక తిమ్మనేఁడుదయించి సూరుఁడై యుండును. కృతిపతినివాసము కొండ పల్లిసమీపముననున్న పురుషోత్తమపట్టణము. ఈకొండపల్లి దుర్గమును క్రీ శ. 1515 లో శ్రీకృష్ణదేవరాయలు స్వాధీనము చేసికొనియెను. ప్రతాపరుద్ర గజపతికిని, రాయలకును జరిగిన సంధిననుసరించి, తరు వాతనాదుర్గము గజపతుల పరమైనను నది విశేషకాలము వారిక్రింద నుండలేదు. రాయలయనంతరముఁ గులీకుతుబ్షా స్వాధీనము చేసికొని నట్లు తపతీసంవరణోపాఖ్యానములోని "కొండంత జయముతోఁ గొండ పల్లి" యనువాక్యము చెప్పుచున్నది. ఆప్రాంతమూ తరువాత నెప్పు డును మరల గజపతుల స్వాధీనములోనికి రాలేదు. చినగంగన కాలము 1660 ప్రాంతమనినచో గజపతుల వాహినీపతియైన హరిశ్చంద్రుని యధికార మాకాలమువఱకు నాప్రాంతముసఁ జెల్లుచుండవలసి యుం డును. అట్లుండెననుట కాధారము లేమియు లేవు. 1660 వ సంవ త్సరమునకుఁ బూర్వమే ఒరిస్సారాజ్యమే మహమ్మదీయుల వశమైపో యినది. ఒరిస్సావారియధికారము కొండపల్లి ప్రాంతమునఁ జెల్లుచు న్నదని తలంపవీలు లేదు. మాఘమాహాత్మ్య ద్వితీయాశ్వాస ప్రారం భమునందలి.

> "క. శ్రీసార్వ హరిశ్చంద్రమ
> హీస్థలసుత్రామ ప్రహృష్టహృదయాదరుణో
> ద్భాసిత విభవముకుంద స
> దాసేవాంతరంగ! దాఖరిగంగా!"

అనుపద్యమునుబట్టి ముకుందదేవుని సామంతుఁడై యుండునని శ్రీ భావయ్యచౌదరి గారూహించినారు. ముకుందదేవుఁడు ఒరిస్సా రాజ్యమును క్రీ. శ. 1559–1568 సంవత్సరములలోఁ బరిపాలించిన వాఁడు. ఇతఁడు అక్బరుతో క్రీ. శ. 1565 వ సంవత్సరములో సంధి కావించుకొనియెను. ఈముకుందదేవుని కుమారుఁడైన బాహుబలేంద్రుని శాసనము క్రీ. శ. 1604 లోఁ గన్పట్టుచున్నది. 1. కాని యీబాహుబలేంద్రుఁడు దాసరిగంగనకాలములోని బాహుబలేంద్రుఁడు కాఁడు. దాసరిగంగన్న కాలములోని బాహుబలేంద్ర హరిశ్చంద్రులు ముకుందదేవునకుఁ బూర్వులు. ముకుందదేవునిబట్టి చూచినను, మాఘ మాహాత్మ్యకృతిపతి క్రీ. శ. 1560 ప్రాంతమువాఁడగును. కాని 1660 ప్రాంతమువాఁడు కాఁజాలఁడు. గోలకొండ సుల్తానగు కులీకుతుబ్షాకుమారులు జంషడ్ కుతుబ్షా, ఇబ్రహీంకుతుబ్షాలును, మనమఁడగు మహమ్మద్ కులీకుతుబ్షాయును దమతమ కాలములలో (1544–1611) ఒరిస్సాదేశముపై దండెత్తియుండిరని చరిత్రలు చెప్పుచున్నవి. ఆపక్షములో 1660 ప్రాంతమునఁ గొండపల్లిప్రాంతము ఒరిస్సా పరిపాలకులక్రిందను, వారి సామంతులక్రిందను నున్నదని తలంచుట కవకాశము లేదు. కావునఁ గృతిపతిని బహూకరించిన హరిశ్చంద్రుఁడును హైదరుఖానుచే జయింపఁబడిన హరిశ్చంద్రుఁడును నొక్కఁడేయనియుఁ మాఘమాహాత్మ్య కృతిపతి క్రీ. శ. 1510–1560 కాలమువాఁడే ననియు, పెద్దయకవియు నానాఁటివాఁడేయనియు నిశ్చయింతము. చినగంగనను బహూకరించిన హరిశ్చంద్రుఁడు బాహుబలేంద్రుని కుమారుఁడని తోఁచుచున్నది. వీరికిని ముకుందదేవునకునుగల సంబంధము విచారణీయము.

కవి, కృతిపతి నెంతగా వర్ణించియున్నను, నీతఁడొక రాజ్యమే లేని ప్రభువుగాఁడనియు, మహౌదార్యగుణముగల ధనవంతుఁడగు నొకగొప్ప భూస్వామియనియుఁ దలంపవలసియున్నది. పురుషోత్తమ పట్టణమునందు చౌదరీ పట్టభద్రుఁడని కవియే చెప్పియున్నాఁడు.

1. కళింగదేశచరిత్ర. పుటలు 657–661.

కవిత్వమునందక్కడక్కడఁ గొన్ని సెరసులున్నను మొత్తము మీఁద నీతని రచన రసవంతముగానే యున్నది. కవిత్వశైలి తెలియుటకై మాఘమాహాత్మ్యమునుండి కొన్ని పద్యముల నుదాహరించుచున్నాఁడను. ఈగ్రంథమింకను ముద్రితముకాలేదు. మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమునందొక తాళపత్రప్రతి యున్నది.

మ. కరుణాచ్ఛాదితమై ఘనాఘన బృహద్గర్జారవస్ఫారమై
నరవిద్యుల్లతికాతతీ ప్రభవమై వాస్తోష్పతిప్వాస బం
ధురమై సర్వదిశావిభాగముల నస్తోకాంబు పూర్ణంబుగాఁ
గురిసె న్వర్షము నీడజవ్రజము సంక్షోభింప భీమంబుగాన్.

చ. చెలఁగి వసంతవేళ విలసిల్లిన చంపకకింశుకావళీ
విలసిత నుప్రసూనములు విస్ఫుటమై తగుకోకకాకలీ
కలకలరావముల్ బహుముఖంబుల భవ్యరసాల పంక్తులన్
వెలయఁగ బంభరధ్వనులు వీనులకింపుదలిర్పుచుండఁగన్.

మ. అలగీష్మర్తువుచేతఁ బంకము నిరాహారమ్ము సూర్యోదయా
కలనన్ చీఁకటిమాడ్కి జ్ఞానమొదవంగాఁ గర్మవిచ్ఛిత్తియా
విలసజ్ఞానము కర్మమూల మనుప్రావిద్వ్యోమ వాక్పద్ధతిన్
సలుపంగా వలయున్ నిరంతరము విశ్వాసంబు సంధిల్లగన్. 4 ఆ

ఉ. ఎందులనుండి ధైచ్చటికి నేఁగుచు నెట్టివ్రతంబు పూన్కి మీ
రిందుల కేఁగుదెంచితి రహీన గుణాకరులార! యిట్లు నా
నందముతోడ వచ్చుకతన్ జననంబు ఫలించె భాగ్యముల్
సెందె సమస్తపుణ్యములు సేరె కృతార్థుఁడనైతినింతటన్. 4 ఆ

మ. అని మందానిలుఁ బంచి కీరవరవాహారూఢుఁడై తుంటవి
ల్గొని వేదంబులు నారిఁగూర్చి మకరాంకుండుల్లసత్పుష్పబా
ణనికాయంబులు గాధినందనుమది న్నాటించినన్ సంచలిం
చిన చిత్తంబున వమ్మునీశ్వరుఁడు రాజీవాక్షి నీక్షించుచున్. 5 ఆ

చ. ననవిలుతుండు గాధినిజనందనుఁడున్న తపోవనంబు చే
రిన సకలాగమంబులు పరిస్ఫుటమై విలసిల్లి సంగనుం

గాని కడుచోద్యమంది మునిపుంగవు డంగభవుండు వచ్చినాఁ
డని కని వ్యాఘ్రరూపధరుఁడై భయదాకృతి నేగుదెంచినన్.



## 143 గంగరాజు చౌడయ్య

ఈతని చరిత్రమేమియుఁ దెలియరాలేదు. జగ్గన కవిసేకరించిన ప్రబంధ రత్నాకరములోనివని శ్రీ ప్రభాకర శాస్త్రిలుగారు ప్రబంధ రత్నావళిలో నీక్రిందిపద్యములను బ్రకటించియున్నారు. ఇందు సాముద్రిక శాస్త్రము కనువయామాత్యున కంకితమీయఁబడినది యున్నదని శ్రీశాస్త్రిగారు పీఠికలో వ్రాసియుండిరి.

సాముద్రిక శాస్త్రము :—

క. ఉదరంబు దర్దురోదర
సదృశంబై జఘన మతివిశాలంబై నన్
సుదతీ రత్నంబున క
భ్యుదయంబుగ ధరణియేలు పుత్త్రుఁడు పుట్టున్.

క. కడునిడుదయుఁ గడుఁగుఱుచయుఁ
గడువలుఁదయుఁ గడుగృశంబుఁ గడునల్లనిదిన్
గడు నెఱ్ఱని దగుమెయిగల
పడఁతిని గీడనిరి మునులు వరమునిచరితా!

నందనచరిత్ర :—

ఉ. వెన్నెలరూపు కప్పురపు వేలుపు వజ్రపుబొమ్మ తెల్లతా
బన్నిన నొప్పు లెప్పమనఁ బంకజ మధ్యమునందుఁ బొల్చి క్రే
గన్నుల బ్రహ్మఁజూచి చిలుకం బలికించుచు నున్నవాణియు
ద్యన్నవశబ్దభావరస తత్త్వము మత్కృతి కెచ్చు నెప్పుడున్.

సీ. కురులు వ్రాయుటయును గొదమతుమ్మెదలయ్యెఁ
గన్నులువ్రాయంగఁ గలువలయ్యె

నధరంబు వ్రాసిన మధురబింబంబయ్యె
గళము వ్రాయుటయును గంబువయ్యెఁ
జనుఁగవ వ్రాసినఁ జక్రవాకము లయ్యెఁ
జేతులు వ్రాసినఁ జివురులయ్యె
నడుము వ్రాయుటయును నవలతయ్యె యొప్పెఁ
బాలుపారఁ గటివ్రాయఁ బులినమయ్యెఁ

గీ. దరుణితొడలు పాదతలములు వ్రాసినఁ
గరికరములుహల్లకములు నయ్యె
నేమివ్రాయఁదలఁచి యేమివ్రాసితి నని
మదన విభ్రమమున మనుజవిభుఁడు.

క. కులమున బలమునఁ జలమున
నలవునఁ గార్యమున సదృశులగు వారలతో
బలిమి యుడిగి సామముగాఁ
దలకొని చేయునది నీతితత్త్వజ్ఞులకున్.

గీ. దొడ్డము త్రియుతంబు తోరంపుఁ బటికంబు
వెండిగుండు మొల్లవిరులచెండు
రసము గుళికకప్పురంబున కరుడు నా
సొంపుమిగిలి వేగుఁజుక్క వొడిచె.

సీ. బచ్చెనయోవరీ బంధాల మేల్కట్టు
సకినల మంచంబు జమిళిపఱుపు
నిలువుటద్దము హారినీలంపు గద్దియ
పటికంపుగిండి హరాంబట్టు నురఁటి
పసిఁడిపావలు వెండి పడిగంబు ముత్యంపు
జాలవల్లిక కెంపుసాన టాయి
పగడంపుదివియకంబము వజ్రములతట్టు
మరకతమయ మగుమధువుకుడుక

గీ. గరిగ పోఁకయొత్తు బరణినున్న పుఁగోవి
కప్పురంపుఁబెట్టె గాజుకోర
తనువు నునుపు తడయొత్తు మడుఁగులు
నాదిమైనవాని నలవరించి.

చ. ముదిమికి మందు వాకలిమిముంగలి జిహ్వాతపః ఫలంబు స
మ్మదము నివాస మింపుగని మారవికారము ప్రోది కామినీ
వదన విభూషణంబు జనవశ్యము హాస్యరసాభిలాస్య సం
పద యుదయస్థలంబు మధుపాన సుఖంబు జగత్త్రయంబునన్.

గీ. వికసితంబైన మోమున వెండికోరఁ
గదిసి మధువొక్కయెత్తున సుదతి కొనిన
మగువమొగ మెచ్చునను శశిమండలంబు
చెలువముగఁ జేయఁ బెట్టింపఁ జేర్చినట్లు.

శా. సారాచార విచారు నుత్తమకులున్ సౌజన్యధన్యున్ కృపా
పారున్ శూరు విశారదూరు ననఘున్ గంభీరు ధీరున్ మహో
దారున్ భవ్య సమస్తకార్యవిదు నాప్తప్రవృత్తు సర్వేంగితా
కారజ్ఞున్ హితు మంత్రిఁ జేసి పతి సౌఖ్యంబందుచుండందగున్.

ఇది నందన చరిత్రయే కాని, నందనందన చరిత్రకాదు. కవి చారిత్రము తెలిసికొనుట కాధారములు లభింపలేదు. నందన చరిత్ర మనఁగా నందనుఁ డనురాజు చరిత్రమేమో! యని మనుజవిభుఁడను పదమును బట్టి తోఁచుచున్నది. ఇందలి పద్యములు శృంగార-రసమును బోషించుచున్నవి. ఈకవి క్రీ. శ. 1560 కిఁ బూర్వుడనుటకంటె నేమియుఁ దెలియరాలేదు.



## 144 నారన సూరన

ఈకవి యింటిపేరేదియో తెలియదు. ఇతని తండ్రిపేరు నారన. తండ్రిపేరునుబట్టి నారన సూరన యని యాంధ్రకవుల చరిత్రమున వ్రాసియుండుటచే నేనును నట్లే వ్రాసితిని. ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; కౌండిన్యగోత్రుఁడు; తండ్రి నారన; తల్లి అక్కమ.

ఈకవి వనమాలీ విలాసము, ఉదయనోదయము అను రెండు చక్కని ప్రబంధములను రచించెను కాని యవి రెంటినుగూడ ముద్రితముకాలేదు. వనమాలీ విలాసముయొక్క యముద్రితప్రతి బ్ర. శ్రీ. కందుకూరి వీరేశలింగము పంతులుగారిదగ్గర నుండెడిదఁట. ఆయన యీకవినిగూర్చి ఆంధ్రకవుల చారిత్రమున వ్రాసినవాక్యముల నీక్రిందఁ బొందుపరచుచున్నాఁడను.

"ఇతఁడు వనమాలీవిలాసమను కావ్యమును జేసి కొండూరి యక్కదండనాథుని కంకితముచేసెను. నావద్దనున్న యీగ్రంథము యొక్క ప్రతి యసమగ్రమయినది. అవతారిక లేదు. కృతిపతి మంత్రియు దండనాథుఁడునయి యజ్ఞముచేసిన నియోగిబ్రాహ్మణుఁడు. కవి నారనామాత్యుని కుమారుఁడైన నియోగి విప్రుఁడు. ఇతఁడాధునికుఁడని చెప్పుటదక్కఁ గవికాలనిర్ధారణముచేయుటకుఁ బుస్తకమునం దాధారమేదియుఁ జిక్కలేదు. ఈతనికవిత్వము సలక్షణమయి మృదువుగానున్నది." వనమాలియనఁగా శ్రీకృష్ణుఁడు. వనమాలీ విలాసమనఁగా శ్రీకృష్ణవిలాసమని యర్థము. మిత్రవిందతోఁ గృష్ణునకైన పరిణయకథ యిందువర్ణితము.

ఈకవి తన గృహనామము నెచ్చటను జెప్పియుండలేదు. ఆంధ్రపరిషత్కార్యాలయమున వనమాలీ విలాసముయొక్క వ్రాఁతప్రతి యొకటి కలదు. అందుఁగృత్యాదిలేదు. కృతిపతియైన యక్కయ దండనాథునితల్లి యెల్లమాంబికయైనట్లును భార్యపేరు ఐతమాంబయైనట్లును ఆశ్వాసాంతపద్యములనుబట్టి తెలియుచున్నది. ఇతఁడు సోమయాజికూడనై యున్నాఁడు.

"ఎల్లమాంబికాకుమార ! హేమశైలధీర ! సం
ఫుల్లవై భవత్కుబేరమానహార ! విద్వదా
పల్లతావన కుఠార ! పల్లవాధరామనో
హల్లకాస్త్రరూప ! కొండురక్కదండనాయకా !
కొండూరి యక్కాధ్వరీ !"
"ఐతమాంబాధవా ! అబ్జగర్భాన్వయాఖ్యాత కొండూరియక్క
ప్రభుగ్రామణీ !" కొండూరక్కమహేంద్రా !"

ఈయక్కదండాధినాథుఁ డెవ్వరో యేప్రభువునొద్ద దండాధిపతిగనుండెనో తెలియలేదు. వనమాలీ విలాసమునుబట్టి కృతిపతి కృతికర్తలనివాసములును దెలియరాలేదు.

ఈకవి రచించిన రెండవగ్రంథమగు నుదయనోదయ మైదాశ్వాసములుకలది. దీని యముద్రిత ప్రతియొకటి తంజావూరు సరస్వతీ మహాలునందును దీనిపుత్రిక, యాంధ్రసాహిత్య పరిషత్తునందును గలదు.

ఈగ్రంథము ముడియము లోకయామాత్యుని కుమారుఁడైన భాస్కరమంత్రి కంకితమీఁయబడినది. కృతిపతి నందవరీక నియోగి బ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు.

ఈగ్రంథమున సూరనకవి తననుగూర్చి యిట్లు చెప్పికొని యున్నాఁడు.

సీ. కౌండిన్యగోత్ర విఖ్యాతుండ సత్కవి
 మాన్యుండ నరసనమంత్రి మణికి
వనిత యక్కాంబకు వరతనూజుఁ డంగి
 గూన్నాఖ్యునకు గూననాహ్వయునకు
గారాపుసయిదోడ నారాయణ పదార
 వింద సంసేవనా విమలమతిని
గాఢ్యనిష్ణాతుండ గజరావు బిరుదాంకుఁ
 డను రాచవారికిఁ దగుహితుండ

తే. సృష్టివాచ్చీఘర......వర
నాభిరాముఁడ బంధులోకానుభావ్య
మానవిభవుండ వ్యయుకశౌమ్యంధిరుండ
సూరనామాత్యుఁడ సత్యసంధాభిరుండ.

సూరనకవి గ్రంథమును రచించి భఘువ్వరికిని కృతియివ్వకుండఁ జనిపోయెనఁట! అతని కుమారుఁడైన నారయామాత్యుఁడు, ముడియము భాస్కరామాత్యునకుఁ గృతియిచ్చినట్లీగ్రంథి గద్య పద్యములవలనఁ దెలియుచున్నది.

"అని యిట్లు ప్రాకారముఖ విద్యోతితాత్మ ప్రజ్ఞాధురంధరుండైన మాతండ్రి సూరనమంత్రి నిర్మించిన యుద్ధయానోదయంబను మహాప్రబంధంబు తత్పుత్రుండగు నారనామాత్య శేఖరుం డుపలక్షించి యేతత్కావ్యకన్యకుం దగిన వరుం డెవ్వండు కలండో యని తలంచు సమయంబున—

తే. భానుసూనుండు ముడియము భాస్కరుండు.........

వ. శ్లోకయుష్ప్రభుని బాబామాత్యుండున్నతి పేరోలగంబుండి నన్ను నారనామాత్యునిం బిలిపించి, బహుమానపురస్సరంబుగా నర్ధాసనంబునఁ గూర్చుండ నిడికొని యిట్లనియె.

క. నీజనకుఁ డుదయనోదయ
మోజంగావించె సురుచిరోక్తుల నటె సం
యోజింపుము నాపేరిట
భూజననుత నారనాత్రిపుణ్యవిచారా!

కృతిపతి వంశవర్ణనమును గవి పెక్కుపద్యములలోఁ గావించియున్నాఁడు. కొన్ని యాపద్యములున్న భాగము శిథిలమగుటచేఁ గాఁబోలు తంజాపురాంధ్ర గ్రంథవివరణమును బ్రకటించినవారు పద్యభాగములను మాత్రమే యుదాహరించియున్నారు. కృతిపతియైన భాస్కరమంత్రి రాయని భాస్కరుఁడేమో యని సంశయము కలుగవచ్చును. ఈసంశయనివారణమునకై యాపద్యభాగములనుండి గ్రహిం

చిన వంశవృక్షము నీక్రింద నుదాహరించుచున్నాఁడను. వీరి నందవరీకులగుటయు శ్రీవత్సగోత్త్రులగుటయు నిశ్చయము.

నరసింహేంద్రుఁడు
|
నారసింహామాత్యుఁడు
|
లక్కమంత్రి = పోచమాంబ
|
గోవిందమంత్రి = గంగమాంబ | అన్నప్ప | బాచమంత్రి
|
లోకమంత్రి = కసువమాంబ | నారదండాధినాథుఁడు | నాగవిభుఁడు
|
పెదతిమ్మయన్న | భైరవుఁడు | చినతిమ్మయన్న | నాగన్న | భాస్కరమంత్రి (ఇతఁడే కృతిపతి) | గోవిందయ్య | ఎల్లయ్య | పాపతిమ్మఁడు | పుత్త్రి మాచాంబ | పుత్త్రి గంగాంబ

తే. ........ మంత్రిమాత్రుండై భాస్కరామాత్యవరుఁడు.

క. ఆభాస్కరార్యవరుఁడు
ప్రాభవమునఁ గోనమాంబఁ బరిణయమయ్యెన్
శ్రీభామామణి నంబుజ
నాభుఁడు శంకరుఁడు శైలనందన బోలెన్.

సుప్రసిద్ధుఁడైన రాయనిభాస్కరుఁడు వసిష్ఠగోత్త్రుఁడు. కావున నీరెండువంశములకును సంబంధము లేదు. నందవరీకులు పదుమూఁడుగోత్త్రములవారనియు, నైదువందలయిండ్లవారనియు నందు నూటయిండ్లవారు శ్రీవత్సగోత్త్రులనియుఁ, గవి యీ క్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు.

క. ఆనందపురవరంబున
నానందితబంధుమిత్రులై గుణధనులై
యేనూటిండ్ల గృహస్థులు
దీనిధు లుందురు భారతీపతినిభులై.

క. వీరు త్రయోదశగోత్రో
ద్ధారకు లన్యోన్యబంధుతావిస్రంభో
దారులు పారావారగ
భీరులు వెలయుదురు పాపభీతులు ఘనులై

క. వారలలో వసుధాస్థలి
బేరుం బెంపును వహించి పృథుసంబంధో
దారులు శ్రీవత్సముని
స్ఫారాన్వయజాత సదనశతం బమరున్.

కృతిపతి యైనముడియముభాస్కరుఁడు బయకారరామప్పదండ నాథునియొద్ద సైనికోద్యోగిగానుండిన ట్లీక్రిందిగద్యపద్యములవలనఁ దెలియుచున్నది.

"వ.........కర్ణాటకసింహాసన సామ్రాజ్యలక్ష్మీసార్వ భౌమ కారుణ్యలబ్ధకొండవీటిప్రముఖనిఖిల దుర్గాధిపత్యారామ బయకారరామ ప్రధానసుత్రామ సర్వసర్వంసహాభారభరణ సంధుక్షణదక్షిణదక్షిణ భుజాస్తంభుండును......"

సీ. పాలించెఁ బ్రజలెల్లఁ బ్రస్తుతింపఁగ నబ్ధివేష్టితాశేషపృథ్వీతలంబు
నిలిపె నిశ్చలమనోనీరజాసనమునఁ బద్మలోచన పాదపద్మయుగళి
సదనము గ్గావించె శక్తిధాత్రేపాలికహిసింహశార్దూలసహితగుహలు
విడిపించె సత్కీర్తివిమలేందుముఖ సప్తజలధిమద్వేష్టితవలయసీమ.

నతఁడు బయకారరామదండాధినాథ
రాజ్యలక్ష్మీశుకీపద్మరాగరత్న
పంజిరాయణిశేషణిసార్వభౌమదీర్ఘ
బాహుపీఠుండు లోకేంద్రభాస్కరుండు.

ఈబయకార రామప్పయ్య కాలమును గనుగొంటిమేని, సూరన కవికాలమును సులభముగాఁ దెలిసికొనఁ గల్గుదుము. ఇతనికి రామయ మంత్రియని నామాంతరము కలదు. ఇతఁడు అళియరామరాయల ప్రోత్సాహముపై స్వరమేళకళానిధియను సంగీతశాస్త్రమును రచించెను. ఇతనివంశీయులలోఁ ప్రతాపవంతులును గీర్తివంతులును పెక్కురున్నారు. కావున నీబయకార రామప్ప వంశవృక్షమును తిరుపతి దేవస్థానమువారి శాసనసంపుటమునుండి గైకొని యీక్రిందనిచ్చుచున్నాఁడను. *




వీరు పరాశరగోత్రులు. యజుశ్శాఖీయులు. పాదిరికుప్పము గ్రామనివాసులు. ఆపస్తంబసూత్రులు. పాదిరికుప్ప మెచ్చటిదో తెలియదు. కుప్పములు సామాన్యముగా చిత్తూరుమండలమున నుండును. పెరుమాళ్ళకుప్పము, పిళ్ళారికుప్పము అనుగ్రామము లామండలమునందే యున్నవి.

* సం 6 భాగము 2 పుట 76.

భాస్కరశబ్దవాచ్యులు పెక్కురు రాయనిభాస్కరుని వంశములో నున్నారు. వారికిని వీరికినిఏట్టిసంబంధమును లేదు. వారిదివశిష్ఠగోత్రము. ఋక్శాఖ అశ్వలాయనసూత్రము. నందవరీకులు; వీరిదిపరాశరగోత్రము. యజుశ్శాఖ. వీరు నందవరీకులు కారు. ఆపస్తంబసూత్రులు.

ఈవంశములో రామమంత్రి నాల్గవకుమారుడైన భాస్కరుని రామయామాత్య భాస్కరుడందురు. వీరికాలములను శాసనసాహాయ్యమున ముందుగ నిర్ణయించి పిమ్మట వీరినిగూర్చి యాలోచింప వలసియున్నది.

రామయభాస్కరుని శాసనములు

1. శా. శ. 1456 జయ సం. కర్కాటకమాస శు ౧౦ సోమవారము అనూరాధ (క్రీ. శ. 20-7-1534) *
2. శా. శ. 1458 దుర్ముఖ సం॥ మకర మాస శు 2 సోమవారం శ్రవణము (క్రీ. శ. 12-1-1537). ♦
3. కొండవీటు ప్రాంతముననున్న పర్వతము దిగువ గోపీనాథస్వామి యాలయమును నిర్మించెను. ఈశాసనకాలము లేదు. ∮
4. శా.శ. 1468 పరాభవసం॥ జ్యేష్ఠ శు ౧౫ (క్రీ.శ. 1547) £
5. గోపీనాథస్వామి యాలయ ముఖద్వారమునందున్న పద్య శాసనము. †

పెదతిమ్మయ శాసనము.

కడప మండలమున చినకొమర్లలో ఆపస్తంబ సూత్రుడును బరాశరగోత్రుడునైన తిమ్మరసు శాసనమొకటియున్నది. అది శా.శ. 1455 విజయ కార్తీక శు 12 నాడు వ్రాయించినది. § అతడీ వంశవృక్షములోని పెదతిమ్మయ యనినాయుద్దేశము.

---

* సం 4 పుట 67. £ దక్షిణ హిం. శా. సం. 4 సంఖ్య 688.
♦ సం 4 పుట 150. † ఆంధ్రకవితరంగిణి సం 4 పుట 38
∮ A.R. 445 of 1915. § A.R. 357 of 1933.

బరకార రామప్పయ్య లేక రామయమంత్రి శాసనములు.

1. తండ్రితోఁ గలిసి అయిదుగ్రామములను శ్రీవేంకటేశ్వరునకర్పిం చిన శాసనము (క్రీ. శ. 14-6-1544. * క్రోధిసంవత్సర మిథున బ ౧౨ ఆదివారము) గుంటూరు మండలములోని చీరాల, పేరాల, అందు పల్లి, కొప్పోలి, యనుగ్రామము లీదానమునఁ జేరినవి. ఈశాసనములో రామమంత్రితనయుఁడైన బాచరుసయ్య పుణ్యమునకును అతనికుమారుఁ డగుకృష్ణప్పయ్య పుణ్యమునకును కొంతయేర్పాటుచేసినట్లు కలదు. మఱియు, పరుచూరు, కారుచూరు, కుప్పాయినిగుంట అనుగ్రామము లనుగూడ శ్రీవేంకటేశ్వరున కర్పించినట్లీశాసనమునయున్నది.

2. శా.శ. 1461 వికారి సం. భాద్రపద శు౧౨ (25-8-1539) తన పినతండ్రియైన బాచరుసయ్యకును, నాతనిభార్యయైన అమ్మా జమ్మకును దనపినతండ్రి కుమారుఁడైన కృష్ణప్పయ్యకును బుణ్యమునకు గాను శివాలయములను నిర్మించి శాసనము వ్రాయించెను. తనతల్లి పేర లక్కసముద్రమను తటాకమును నిర్మించెను. ఈశాసనకాలము నాఁటికి బాచరుసయ్య జీవించియుండెననియు నాకుటుంబమునం దీరామమంత్రి కీఁగల గౌరవమును జూపుటకై వారి నామములతో బాచేశ్వర, అమ్మే శ్వర, కృష్ణేశ్వరాలయములను నిర్మించెననియుఁ దోఁచుచున్నది. §

3. శా.శ. 1478 నల సం. వైశాఖ శు3 (క్రీ.శ. 1556) తనపుత్రి యైన యచ్యుతమ్మకుఁ బుణ్యముకొరకు ఆమెపేరున అచ్యుతాపురమను గ్రామమును నిర్మించి యందు బాలకృష్ణాలయమును గట్టించెను.

ఈబయకార రామప్పయ్య శాసనములింకను గలవు.

చి న్న మ్మి శా స న ము

బయకార రామప్పకుమేనత్తయు బాచరుసయ్యకు సోదరియు నగు చిన్నమ్మి ప్రతాప యల్లరుసు భార్యయని తిరుమల దేవస్థానము వారు పైవంశవృక్షములోఁ గనుపరచియున్నారు. ‡

---

* తి. దే. శా. సం. 5 - సంఖ్య 17.

§ A.R. 302 of 1925. బళ్ళారిమండలము.

‡ తి. దే. రిపోర్టు పుట 236.

తిరుపతి దేవస్థానమునందే చిన్నమ్మి శాసనమొకటియున్నది. † ఆశాసనమీఁచిన్నమ్మిదేయని వారుగుర్తించియున్నారు. § కానియాశాసనమున నీచిన్నమ్మి ప్రతాప యల్లరుసు కుమార్తెయనియున్నది. ఈభేదమును దేవస్థానపు శాసన ప్రకటనకర్తలు గమనింపలేదు. చిన్నమ్మి ప్రతాపయల్లరుసు కుమార్తె యైనచో నామె నీవంశవృక్షమునఁ జేర్చకూడదు. ఈమె రామమంత్రి కుమార్తె యైనట్లు పైనినుదాహరించిన బాచరుసయ్య శాసనములవలనఁగాని రామప్పయ్య శాసనమువలనఁ గాని ధ్రువపడుటలేదు. ఇందువలన నీవంశములో చిన్నమ్మి లేకపోయియుండవలయును లేదా పై శాసనములోని చిన్నమ్మియు నీచిన్నమ్మియు భిన్నవ్యక్తులై యుండవలయునని తోఁచును. ఇది యరవభాషలో వ్రాయబడినదగుటవలన భాషాంతరీకరణకర్తలు భార్యయనుటకు మారుగ కుమార్తెయని పొరపాటున వ్రాసియుండవచ్చునని యీక్రింది శాసనమునుబట్టి తెలియుచున్నది. ‡

ఈశాసనము చిన్నమ్మి వ్రాయించినదియే. గుంటూరు మండలమునందలి వంకాయలపాడులో సంబంధించినది. శాసనకాలము శా. శ. 1462 శార్వరి సం చైత్ర శు. ౧౫ (క్రీ. శ. 1540) ఇందుఁ దాను రామయామాత్య భాస్కరుని సోదరిననియుఁ బ్రతాపయెల్లరుసు భార్యననియుఁ జెప్పుకొనియున్నది. మఱియుఁ బైనిఁజెప్పిన తిరుపతి శాసనములో వంకాయలపాడును దానొసంగినట్లుకూడఁ జెప్పియున్నది. కావున నీమె ప్రతాప యెల్లరుసునకు భార్యయనుట నిశ్చయము. రామయామాత్య భాస్కరుఁడు ఆపస్తంబసూత్రుఁడు. ప్రతాప యెల్లరుసు ఆశ్వలాయన సూత్రుఁడు. ఈరెండుసూత్రములవారికిని సంబంధములు చేసికొను నాచారముకలదు. కావున చిన్నమ్మి రామమంత్రి కుమార్తె యనియే నిర్ణయింతము.

బయకార రామప్పయ శాసనములు క్రీ. శ. 1538_1556 నడుమఁ గాన్పించుచున్నవి. నారన సూరనకవి చనిపోయిన యెంత

† తి. దే. శా. వం. 5 నంఖ్య 118=8-7-1547 A.D.
§ తి. దే. రిపోర్టు పుట 236.
‡ A.R. 422 of 1915.

కాలమునకాతని తనయుఁడైన నారన ఈకావ్యమును దెచ్చి రామ ప్రయ్యకిచ్చెనో తెలిసికొనుట కాధారములులేవు. పూర్వకవి స్తుతిలో కవిత్రియమును భీమననుమాత్రమే స్మరించియున్నాఁడు. వీదియెట్లు న్నను సూరనకవి పదునారవశతాబ్ది పూర్వార్ధమున నున్నవాఁడని చెప్పుట కభ్యంతరములేదు. వనమాలీ విలాసమింతకుఁ పూర్వము రచి యించినదాట నీతఁడు 1525 మొదలు కావ్యరచన మొనరించి యుండును.

కవినివాసగ్రామమేదియో తెలియరాలేదు. ఇతఁడు గద్యయందు దాను "ఇందేశ్వర వరప్రసాద లబ్ధకవితాసాంద్రుఁడ" ననివ్రాసికొనియు న్నాఁడు. కడపమండలమునఁ గడపఁతాలూకాలోఁ జింతలపుట్టూరను గ్రామమున నిందేశ్వరాలయమున్నది. క్రీ.శ. పంద్రెండవశతాబ్దినాటి శాసనములీయూరఁగలవు. కవినివాసమీగ్రామమని నిశ్చయింపవచ్చును. కృతిపతినివాసము కడపమండలములోని జమ్మలమడకతాలూకా ముడి యము అగ్రహారము. దీనికిఁ బెద్దముడియమనియు బ్రాహ్మణ ముడియము అగ్రహారమనియువాడుకపేరులు. ఈగ్రామమునుబట్టియే కృతిపతియైన భాస్కరునిగృహనామము ముడియమువారని వచ్చినది. కళాధరోపాఖ్యానమునురచించిన ముడియము వేంకటరమణకవి యీవం శీయుఁడే కావచ్చును. అతఁడు తననివాసము ముడియమగ్రహారమని యుఁ దానాయగ్రహారికుఁడ నేననియు వ్రాసికొని యున్నాఁడు. అతఁడు క్రీ. శ. 1600 ప్రాంతమువాఁడు.

ఇతనికవిత్వము ప్రౌఢమై సరసహృదయానురంజకముగనున్నది. శైలిచూపుటకై రెండుగ్రంథములనుండియుఁ గొన్నిపద్యముల నిట నుదాహరించుచున్నాఁడను.

ఉ. అప్పుడు కృష్ణుఁ డిందు కిరణావళిసోకున మేనఁ దాపముల్
కుప్పలుగూరిరాకఁ గని కుందుచుఁ గేళివనాంతరంబునం
దొప్పువిలాస కృత్రిమనగోపరివీథుల కేఁగి వెన్నెలం
జిప్పిలిజాలువారు మణిసీమములం గలచంద్రశాలికన్. 1 అ

ఉ. చూపిన నయ్యవంతిన్నృపసూతి సురాసురకిన్నరావళిన్
భూపకుమారవర్యుల నపూర్వవయోగుణరూపధన్యులన్
చూపుల తీపులం గొసరఁ జూచి యొకానొకనిన్ నిజోల్లస
ద్రూపవిలాసలబ్ధి కనురూపముగాఁ గొనదయ్యె నాత్మలోన్. 2 ఆ

ఉ. ఆయెలదీఁగబోఁడి మెఱుఁగారెడి నున్ననియూరు యుగ్మముం
జేయుచునున్న యట్టిసరసీరుహగర్భుని చిత్తమే క్రియం
దోయజనాథ నిశ్చలతఁ దూఁకొనఁ జాలెనొ కాని యామటం
బోయిన జీరువాఱు మిముబోఁటులచిత్తము లేమిచెప్పుదున్. 3 ఆ

ఉ. నాదగుమే లెఱింగియు మనంబున నొల్లమి చేసెదేని దా
మోదర! మత్ప్రతిజ్ఞ విను ముగ్రచిదగ్నికి దేహమాహుతిం
గా దరికొల్పి నిన్నె పతిగాఁగ వరించెద మీఁద నైనన
వ్వేదవతీవధూటిగతి వేమఱు మాటలతోటి దేటికిన్. 4 ఆ

ఉదయనోదయము :—

ఉ. భారపుఁబయ్యెదం జిగురుఁబయ్యెద మాటి మృణాళవల్లరీ
హారములన్ ఘటించి ధవళాయతలోచన యొత్తి రాజిబృం
దారకభర్తపాదనలినంబుల మెల్లన యెత్తి పట్టి వి
స్ఫారనవప్రవాళములఁ బాణిపుటంబుల కెత్తుసేయుచున్. 1 ఆ

ఉ. ఆభుజగోత్తముండు సహజాకృతిఁ గైకొని నిల్చి నమ్రుఁడై
యోభువనైకపుణ్య! కరుణోల్లసితేక్షణ! నన్ను నిత్తరిం
బ్రాభవ మొప్ప నీయెఱుకు బారికిఁ దప్పఁగఁ ద్రోయునీకృపా
వైభవ మేమిచెప్ప! మఱువందగునయ్య! మహోపకారముల్. 2 ఆ

ఉ. మానియనుజ్ఞ చే ముదితమానసుఁడై పఱతెంచి పాదప
ద్మానతుఁడైనవాని విపులాంసమహాభుజు నాత్మబింబమున్
బోనితనూజు నెత్తి పరిపూర్తిగఁ గౌఁగిటఁ జేర్చి తోఁచె నా
మానవవల్లభుం డతనిమస్తకమున్ బ్రమదాశ్రుధారలన్. 3 ఆ

ఉ. మానవతీలలామ! విను మద్వచనస్థితిఁ బంచచూడయై
మానితరక్తగంధకుసుమంబులు గైకొని నగ్నవృత్త్యను

ష్ఠానవిధిం భవజ్జనని చాలి నిశావ్రత మాచరించినన్
గాని చనంగ రాదు మధుకైటభవైరిపురంబుఁ జేరఁగా
బోనువె వా దివంబునకు భోరనసుందరి బొందితోడఁ తన్. 4 అ

ఉ. చీరలెడల్చి కేళి కెడసేయక పైకొని రవ్వధూవరుల్
పేరుగ నిట్టివారి కెసపెట్టి మనంబుల మానవిత్తముల్
జూరఁగొనంగ లేచినప్రసూనశరుం డనుకొల్లకాఁడు దు
ర్వారుఁ డమూల్యమైనవలువల్ మునుమున్న హరింపకుండునే. 5 అ

కృతిపతి మాధ్వమతాభిమానియైన ట్లీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

క. అతులితమధ్వాచార్యో
దితమతసిద్ధాంతపటుమతి వ్యాసమహా
యతిరాయగురుకృపాసం
తతవర్ధితవిష్ణుభక్తితాత్పర్యునకున్.



## 145 పలకలూరి గోపన

కాకునూరి యప్పకవికృతమగు నప్పకవీయముం దీక్రింది పద్యము పలకలూరి గోపనదిగా నుదాహృత మైనది. కేవలము కొన్ని చాటుధారలను రచించినంతమాత్రమున నాతనిపద్యమును లక్ష్యముగా నప్పకవి యంగీకరించియుండఁడు. ఇతఁడు గ్రంథకర్తయై యుండును. ఈతనికావ్యమో కావ్యములో కాలగర్భమునఁ బడిపోయి యుండును.

ఆ. గోలకొండమలక గోవుల భక్షించుఁ
గొండవీటివిప్రకులము నెల్ల
బాచమరుసు చేరిభక్షించుచున్నాఁడు
మలక మేలో బాచమరుసు మేలో!

కొండవీటిసంబంధమునుబట్టి యీ బాచమరుసు రామయామాత్య భాస్కరుఁడని నిశ్చయింపవలసియున్నది. బాచమరుసు దానములనొసంగి

ప్రఖ్యాతిఁ గాంచినవాఁడు. ఈతనినిగూర్చి నారన సూరన చారిత్రము వ్రాసియుంటిని. అట్టియుత్తమపురుషుఁడు బ్రాహ్మణుల కపకారమొనర్చునా యనిసంశయము కలుగవచ్చును. కానియంతమాత్రముచే నీతఁడు వేఱొకబాచమరుసని నిర్ణయింపఁజాలము. ఏవేని ప్రత్యేక కారణములవలన నీసోపనవంటివారి కాతనివలన నపకారము జరిగి యుండవచ్చును. అందుపై నీతఁడీపద్యమును జెప్పియుండవచ్చును.

పలకలూరను గ్రామమునుబట్టి యీకవి యింటిపేరు వచ్చి యుండును. పల్లకలూరు గుంటూరుమండలములోనిది.

రామయామాత్య భాస్కరునిశాసనములు క్రీ. శ. 1580-50 నడుమ గన్పట్టుచున్నవి. కావున నీసోపనయు నాకాలమువాఁడు. ఇతఁడు బ్రాహ్మణుఁడు. పలకలూరీతని నివాసస్థానమై యుండును. ఇంతకంటె నీతనినిగూర్చి నధికమేమియుఁ దెలియరాలేదు.



## 146 పోతరాజు వీరయ్య

ఆంధ్రసాహిత్య పరిషత్తునందున్న యుదాహరణ గ్రంథములో "పోతరాజు వీరయ్య" రచించిన త్రిపురవిజయములోనివని యుదాహరింపఁబడిన యీక్రిందినాల్గు సీసపద్యములను ప్రబంధరత్నావళినుండి గైకొని యిట వ్రాయుచున్నాఁడను. ఈకవినిగూర్చి యేమియుఁ దెలియలేదు. గ్రంథనామమునుబట్టి యీశ్వరుఁడు త్రిపురాసురసంహార మొనర్చినకథ యిందుఁ జెప్పఁబడినట్లూహింపఁదగియున్నది.

సీ. కపిలజటాజూట గంగాసముత్తుంగ
వీచీఘటలు మిన్నువీఁక దాఁకఁ
బ్రబలబాహార్గళ పరికంపితస్ఫార
ఢక్కాధ్వనినిదిశల్ పిక్కటిల్ల
జ్వాలాంకరాళభీషణశారదస్థూల
శూలయుద్ధప్రభల్ సూర్యుఁ బొదువఁ

బ్రికటబంధురదీర్ఘబటువజ్రనిష్ఠుర
పదఘట్టనము లుర్వి యదర నొదవ

గీ. విమలశార్దూలచర్మాంచలములు దూల
మహితమండనఫణిఫణామణులు గ్రాల
నసమరౌద్రిసావేశ మావహింప
నారభటిభూరితాండవం బాచరించె.

సీ. తమ్ముల బెదరించు తళుకువెన్నెలపావ
గన్నె గేదఁగిఱేకు గారవింపఁ
బదినూఱుపడగలఁ బఱపైనపదకంబు
సవడిము త్రైపుబన్నసరముఁ బ్రోవ
మిసమిస మనమించు భసితాంగరాగంబు
పరఁగుచందనచర్చఁ బరిఢవింప
మెఱయు మువ్వన్నెల కఱలపుట్టము కొంగు
చెఱఁగుల నునుపట్టుచేలఁ బెనుప

గీ. మించి తలమీఁద నురముపై మేనఁ గట్టి
యీడుదోడుగ నుమతోడఁ గూడిజగము
లెల్ల రక్షించు నిను భజియింతు మెప్పుడు
భయదదురితలతాదాత్ర! ఫాలనేత్ర!

సీ. తల్లిదండ్రులపొందు దప్పి యొండెడ నార్వు
రువిదల యెద్దువ నెదిగినతఁడు
కడువడిఁ బలుగొండఁ గాఁడి పాఱినమేటి
ఘనసాయకము కేలఁ గ్రాలునతఁడు
కమియారఁగాఁ బాఁపకవణంబుఁ దిని యాడు
తెక్కలతురగంబు నెక్కినతఁడు
భోగిపాన్పున నిద్ర భోగించు దేవునిఁ
దఱిమినరక్కసు నుఱిచినతఁడు

గీ. సవడిమోములఁ జతురత సమకొనంగ
జోడుమాటలు సరివడ నాడునతఁడు
దంతిముఖు కూర్మితమ్ముఁడై తనరునతఁడు
కదలె బలముల నడిపింపఁ గాోంచవైరి.

సీ. శూలికన్నులఁ గెంపుచూపినరౌద్రంబు పాదలముందరిదెసఁబొడమినతని
భువనభయంకరస్ఫూర్తి పెంపెసలార । శరభావతారతఁ బరఁగినతని
జన్నంపుసిరికొనసాఁగఁజూచినతాతఁ । జేకొని తలవంపు చేసినతనిఁ
దళదళమనిపించుఁ దులకించుకైదువుల్ । కరములుపదికెంటఁగలిగినతని

గీ. సురలు నసురులుఁ బలుమఱుఁ జూచిబెదర
బిరుదుపెండెంబు డాకాలఁ బెట్టినతని
భద్రకాళి మహాశక్తిఁ బరమభక్తిఁ
బాయకుండెడు శ్రీవీరభద్రుఁ దలఁతు.

ఈపద్యముల నుదాహరించిన సంధాతలు క్రీ.శ. 1560 ప్రాంతమువారగుటచే నీకవి యంతకుఁ బూర్వుఁ డగుట నిశ్చయము. అంతకంటె నీకవినిగూర్చినవిషయము లేమియుఁ దెలియరాలేదు.

---

## 147 పచ్చకప్పురపు తిరువెంగళకవి

ఈకవి భట్టురులజుఁడు; ఇతనితండ్రి తిప్పరాజు; తాత తిమ్మరాజు; పినతాత అయ్యలరాజు. ఈకవి చొక్కనాథచరిత్ర మనుద్విపద కావ్యమును రచించెను.

ఇతనితాత యైన తిమ్మరాజును, ఆతనితమ్ముఁడైన అయ్యలరాజును ప్రౌఢదేవరాయలను మెప్పించి యాతనిచేత 'పచ్చకప్పురపురా' జని బిరుదువహించి నట్లీక్రింది ద్విపదలలోఁ జెప్పుకొనియున్నాఁడు.

నిటలాక్షుపదభక్తి నియతిఁ బెంపొందు
భటవంశమున మెచ్చు పచ్చకప్పురము
తిప్పరాజనుతుండు తిరువెంగళుండు

చెప్పంగ నేర్చు ప్రసిద్ధంబు గాఁగ
నని విన్నవించిన నా చిన్నరామ
మనుజేంద్రుఁ డధికసమ్మతముతో నపుడు
ననుఁ బిలిపించి మన్నన గారవించి
వినుతించి కర్పూరవిడియంబు లిచ్చి
యనఘుండు మీతాత యగు తిమ్మరాజు
తనతమ్ముఁ డయ్యలుఁ దాను నిమ్మహిని
బొగ్గిథుఁడై చదువులఁ బరగఁ మెప్పించి
ప్రౌఢరాయలచేతఁ బచ్చకప్పురము
రాజనంగాఁ దిమ్మరాజుకుఁ దిప్ప
రాజుదయించె విరాజితమ్ముగను
రాజుల మెప్పించె రసికుఁడాతని త
నూజుఁ డవార్యసన్నుత కవీంద్రుఁడవు.

ఈకవి రచించిన చొక్కనాథచరిత్ర తొమ్మిది యాశ్వాసములు కలది. ఇందు దక్షిణమధురాపట్టణమున వేంచేసియున్న చొక్కనాథస్వామి యఱువదినాలుగులీలలు వర్ణితములైనవి. సంస్కృతమందలి హాలాస్య మాహాత్మ్యమే యీగ్రంథమునకు మూలము. మధురలోనున్న యీదేవునకు హాలాస్యనాథుఁడనియు, చొక్కనాథుఁ డనియు సుందరేశ్వరుఁ డనియు నామములు.

ఈకవి యీగ్రంథమును ఉపసూ (నూ?) రునం దున్న కమ్మప్రభు వగు గోళ్ళ పెదరామభూపాలున కంకితమొనరించెను. ఈతనిసోదరుఁడు చినరామప్ప. ఇతఁడుకూడ మిగుల పరాక్రమశాలి. ఇతఁడే కవిని నీకావ్యమును రచించి తనయన్న కంకితము సేయుమని ప్రోత్సహించిన వాఁడు. వీరిరువురును బసవభూపాలుని తనయులు. పిప్పలగోత్రులు. ఆవిషయ మీక్రిందిద్విపదలలోఁ గాన నగును.

"ప్రావీణ్యమతివి శోభనకవి వీవ
కావున నీచొక్కకావ్యంబు మాకు

ద్విపదభావంబునఁ దెలివొందిమిగుల
నుదమగా సత్కావ్య లుల్లంబు లలర
మధురవాక్యంబుల మదిఁ గొనియాడ
మధురావు రేను నిర్మలపుణ్యచరిత
చౌషష్టిలీలావిలాసంబు లాంధ్ర
భావను బెదరామపార్థివుపేర
నుచరిత్ర వైభవనుతాత్రముపేర
రచియించి విఖ్యాతి రాఁజేయు మర్వి
నని యానతిచ్చిన నామహారాజు
ననుపమ మధురవాక్యములకు మెచ్చి

కృతిపతియైన పెదరామభూపాలుఁడు, అచ్యుతదేవరాయలవద్ద దండనాయకుఁడుగానున్నట్లీ క్రిందిద్విపదలలోఁ జెప్పఁబడినది.

చెలఁగుచు నుపసూరిసింహంబు పేరఁ
బురుషోత్తమధ్యాన పూర్ణాత్ము పేరఁ
దగు గోళ్లబసవేంద్రతనయుని పేర
సుగుణాఢ్య వరసతీసోదరు పేర
ఘనతస్వామిద్రోహగండని పేరఁ
జినరామవిభునికి జ్యేష్ఠునిపేర
దీపించు నచ్యుతదేవరాయ ప్ర
తాప దక్షిణబాహుదండాంకు పేరఁ
జతురత నీకావ్యసారంబునకును
బతి యైనపెదరామ పార్థివు పేర

♦ ♦

ధరమించునన్న (?) నందవిప్రరాధ్యక్ష
ప్రియబంధు వనచైత్ర పిప్పలగోత్ర
దయసత్యదాక్షిణ్య సత్యస్వరూప
తగమించు వ్యాసతీర్థప్రియశిష్య

ఆయతోన్నత శౌర్యుఁ డచ్యుతదేవ
రాయప్రతాపకార్యధురంధరుండ
అంచిత కొండమనాయంకర గండ
మించివర్తించు స్వామిద్రోహరగండ
చేకొన్న నుపనూరి సింహాద్భుజాంక
వాకిటి చిన్నభూవరసహితుండ
బసవభూవరతపఃఫలసత్కుమార
వసుధఁ గల్గిన కమ్మవంశవర్ధనుఁడ !
బాగొప్పఁ దిప్పమాంబా దేవిగర్భ
సాగరసంభవ సంపూర్ణచంద్ర
చిరకీర్తియుతుఁ డైనచిన్నరామప్ప
పురుషరత్నంబనఁ బొగడంగ మించి
లలితకీర్త్యభిరామ లావణ్యసోమ
నరనాథ శ్రీచొక్కనాథ సత్కృపను
ధరయేలు మాచంద్రతారార్కముగను.

కవికిఁ దాతయైన తిమ్మరాజు ప్రౌఢదేవరాయనిచే బిరుదము నందినవాఁ డగుటచేతను, నారాయులు క్రీ. శ. 1422 మొదలు 1445 వఱకును రాజ్యముచేసినవాఁ డగుటచేతను, తిమ్మరాజు మనుమఁ డైన తిరువేంగళకవి, 1500 సంవత్సరప్రాంతమున నున్నవాఁడని చెప్పవలసివచ్చును. కాని దీనికొక యాటంకము గన్పట్టుచున్నది. కృతిపతి అచ్యుతదేవరాయల దండాధిపతి. అచ్యుతదేవరాయలు క్రీ. శ. 1530 మొదలు రాజ్యమునకు వచ్చినవాఁడు. దీనినిబట్టిచూడగా తాతకును మనుమనికిని మధ్యనూరుసంవత్సరములు అంతరాయమువచ్చుచున్నది. ఈభేదమును సమన్వయించుటకై 1440 ప్రాంతమునఁ దిమ్మరాజు ప్రౌఢరాయలచే బిరుదమునందియుండుననియు నప్పటికాతన కిరువది సంవత్సరముల వయసుండుననియు 1460 ప్రాంతమున నాతనికిఁ దిప్పరాజు జన్మించియుండుననియుఁ దిప్పరాజునకు నలువది

యవయేట ననఁగా 1500 సంవత్సర ప్రాంతమున వెంగళకవి జన్మించియుండుననియు, క్రీ. శ. 1535 వ సంవత్సర ప్రాంతమున నీకృతిని రచించియుండుననియుఁ దలంపవలసియున్నది. ఈయూహలో నస్వాభావికమేమియును లేదు. గోళ్ల పెదరామప్ప శాసనముకూడ నీకాలమును ధ్రువపర్చుచున్నది. ప్రౌఢదేవరాయల కుమారుఁడగు మల్లికార్జున రాయలనుగూడఁ బ్రౌఢదేవరాయలని వ్రాయుచున్నారు. అతఁడు క్రీ. శ. 1465 వఱకు విజయనగర సింహాసనమందున్నాఁడు. తిమ్మరాజునకు బిరుదము నొసంగినది యీదేవరాయలై నఁ గావచ్చును. అట్లయినచోఁ బైనిరూపిన వ్యత్యాసమున కవకాశముండదు.

కృతిపతియైన గోళ్ల పెదరామప్పయ్య నాయుఁడు అచ్యుతరాయలకుఁ బుణ్యమునకుగాను సంతమంగళమను గ్రామమును తిరుల్లవియందునాయనారు దేవునకొసంగి వ్రాయించిన శాసనము రామనాథపురమండలములోని తిరుక్కోయిలూరు తాలూకాయందలి తిరువత్తూరు గ్రామమున నున్నది §. ఆశాసనకాలము శా. శ. 1460 విళంబి సంవత్సర దక్షిణాయన బ౧౨. (క్రీ.శ. 1538).

ఈరామప్పయ్యనాయఁ డచ్యుతరామరాయల ప్రతినిధిగా దక్షిణమండలములయందుఁ బరిపాలనాభారమును వహించియున్నట్లు కొన్ని శాసనములవలనఁ గన్పట్టుచున్నది †. ఈరామప్పయ్య సదాశివరాయల కాలములోఁగూడ నున్నట్లు తిరునల్వేలిజిల్లా అంబాసముద్రము తాలూకా బ్రహ్మదేశమను గ్రామమును కైలాసనాథ నాయినారను దేవునకు సమర్పించి శా.శ.1472 (క్రీ.శ.1550) సాధారణ సం॥ కన్యామాస, బహుళనవమినాఁడు వ్రాయించిన శాసనమువలనఁ దెలియుచున్నది £.

ఈగోళ్లవారు పరాక్రమవంతులును బరిపాలనా దక్షులునై యచ్యుతరాయల కాలమున విశేష ప్రసిద్ధిని గాంచియుండినట్లు స్పష్ట

§ A. R. B. 179 of 1935–36.
† ద. హిం. శా. సం. 8 సంఖ్య 571; A.R. 30 & 33 of 1929.
£ A. R. 373 of 1916.

మగుచున్నది. వీరి ప్రథమ నివాసమేదియో తెలియరాలేదు. పై పద్యములలో నుదాహృతములైన యుపనూరు, నన్ననందలి గ్రామము లెచ్చటివో తెలియరాలేదు. బళ్లారి మండలమందలి "నందవాలి"యే యీనన్ననందలి యేమోయని యనుకొనుచున్నాఁడను. కృతిపతి, వ్యాసతీర్థులవారి శిష్యుఁడని పై ద్విపదలలోనున్నది. వ్యాసతీర్థులు మధ్వ మఠాధిపతి. శ్రీకృష్ణదేవరాయలీ వ్యాసతీర్థునకు దానమొసంగి గౌర వించినట్లొకానొక శాసనమునందున్నది.

గోళ్ల రామప్పయ్యకాలము క్రీ. శ. 1500–1560 అని నిర్ణయింపవచ్చును. కవియు నాకాలమువాఁడే యగుట స్పష్టము. పై ద్విపదలలో "వాకటి చిన్నభూవర సహితుండ" యను వాక్యమున కర్థమేమో తెలియలేదు. కృష్ణరాయల కాలములో వాకటివారు దుర్గపాలకులుగానుండి ప్రభువులచే మన్ననలందినట్లు గన్పట్టుచున్నది. ఈచిన్నభూవరుఁడట్టివాఁడై గోళ్లవారికి స్నేహితుఁడేమో!

గోళ్ల పెదరామభూపాలుఁడు "ఉపనూరిసింహ" మైనట్లు కవి వర్ణించియున్నాఁడు. ఉపనూరెచటిదో తెలియలేదు.

వెలుఁగోటివారి వంశావళిలో మాదయలింగ భూపతి "ఉపనూరి సింహము"నకు సహాయ్యమొనర్చిన ట్లీక్రింది పద్యపాదమునందున్నది.

"ఉర్విలోఁ బొగడొందు నుపనూరి సింహంబుఁ

జెనకినరిపుకోటిఁజెండినాఁడు" (51పుట). ఈయుపనూరిసింహము గోళ్ల రామప్పయ్యకాఁడు. మాదయలింగభూపతి పదునైదవశతాబ్ది పూర్వార్ధమువాఁడు. గోళ్ల రామప్పయ్య పదునాఱవశతాబ్ది పూర్వార్ధ మువాఁడు. ఉపనూరు రాయలసీమయందుండి యుండును.



## 148 తేళ్లపూఁడి కనవరాజు

ఇతఁడు కళావతీ శతకమును రచియించినట్లు రామాపెగ్గడ జగ్గనయు, ఆంధ్రసాహిత్య పరిషత్తునందున్న యుదాహరణ గ్రంథ సంధాతయు నుదాహరించిన పద్యములవలనఁ దెలియుచున్నది. ఇంత కంటె నీకవి వృత్తాంత మేమియుఁ దెలియ లేదు. ప్రబంధ రత్నావళి నుండి గైకొని యాపద్యములనిటఁ బొందుపరచుచున్నాఁడను.

చ. గురుకుచకుంభము ల్గదలఁ గొప్పుముడి వీడఁగ రాలఁ గొప్పవిరుల్
కరమణి కంకణక్వణన కాంచనగ (?) ధ్వనులుల్లసిల్లఁగా
భరతపుఁ బట్టుకై వడిని బాదికిఁ జేరెడి వెల్చెలాగునన్ (?)
బరిపరి రీతులం జెలఁగు భంగులు మెత్తుఁగదే కళావతీ!

చ. ప్రకటిత లీలఁ గీలెడలి పాపటము న్దెప్పఁ జేరు మోముపైఁ
దకపికలాడఁ గ్రిక్కిదలు దంతపుఁ దమ్ములకాంతి మొత్తమై
వికచకపోలభాగముల వెన్నెల గాయుచునుండ నీవునన్
.....................లాగులు మెత్తుఁగదే కళావతీ!

ఈక్రిందిపద్యముకూడ కళావతీ శతకములోనిదేయని జగ్గన్న కవి యుదాహరించినట్లు ప్రబంధ రత్నావళిలో నుదాహృతమైనది.

క. ఆకంజానన యుపరతి
కాకాశము వడఁకెఁ దారలటునిటు వడియెన్
బోకైన గిరులు గదలెను
భీకరముగుతమము చంద్రబింబముఁ గప్పెన్.

'కళావతీ'యనుమకుట మీపద్యమునందు లేకపోవుటచే నీగ్రంథ మొక మకుటముతోఁ గూడిన శతకముగాక భిన్నవృత్తములతో శృంగార విషయవర్ణన మొనర్చిన యొక చిన్న పుస్తకమని యూహింపఁ దగియున్నది.

సేయుమని ప్రోత్సహించిన ట్లీక్రిందిసీసపద్యములోఁ జెప్పియున్నాఁడు.

సీ. తత్క్షణంబున సర్వధర్మ స్వభావుండు
సమయ విశేష వాచాప్రవీణుఁ
డు త్తమ గుణశాలి యోగైక విజ్ఞాని
యోగమత త్త్వ రహస్య వేది
శివపాద పంకజ సేవానురక్తుండు
చిన్మయాత్ముఁడు సదాశివగురుండు
వేదాచలస్థాన విహారణోన్నిద్రుండు
కరుణాకటాక్ష సంకలితుఁడగుచు

తే. రమ్ము శివరామ! నీకు యశమ్ము గలుగు
నిమ్మహాకృతి శాశ్వతా స్త్రీశుపేర
నంకితము సేయుమన్న దేహంబు వొంగి
యటులఁ జేసెద లెస్సాయె నని ప్రియమున.

బదరికా వనసీమయందు వేదవిద్యాసంపన్నుఁడగు పూర్ణచిత్తుఁడను బ్రాహ్మణుఁడు భద్రదంతి యను భార్యఁగూడియుండి సంతానార్థియై యీశ్వరునింగూర్చి తపమొనర్చి యాయన వరప్రసాదమున సానందుఁడను గుమారునింగనియె. ఆతఁడొకనాఁడు ధర్మప్రసంగుఁడను మునివలన భూలోకమునఁ బుణ్యపాపము లొనర్చువారి కొదవు స్వర్గనరకవాస ఫలంబులను విని స్వర్గవాసులనుగూర్చి సంతసించి, నరకవాసులనుగూర్చి దుఃఖించి వారలఁజూచుటకై నరకమునకేఁగి యముని చేఁ బూజితుండై యాతనివలన సకలధర్మంబుల నెఱింగి నరకవాసులం దర్శించి వారు పడుచున్న యాతనలకుఁ జాలిఁజెంది యుచ్చుట నుచ్చైస్స్వరంబున శివనామ స్మరణ సేయుచు పంచాక్షరీ మహామంత్రజపంబు గావించి వారినందఱ నానరక బాధలనుండి తప్పించి యీశ్వర సాన్నిధ్యముఁ జేర్చినకథ కొన్ని యుపకథలతోఁ జేర్చి యిందుఁజెప్పబడినది. ఇందలి యమయాతనలను చదివినవారి హృదయములు పాపకార్యముల నొనర్చుటకు జంకక మానవు. కొన్ని వ్యాకరణదోషము

లచ్చటచ్చటనున్నను నీతని కవిత్వమనర్గళధారతో మృదువుగానున్నది. శైలిచూపుటకై నాలుగు పద్యముల నీక్రింద వ్రాయుచున్నాఁడను.

ఉ. చక్కని ముద్దుబాలకని జక్కిలిగింతలు వెట్టి యేడ్పరాఁ
జెక్కిలి గొట్టి యెత్తికొని చక్కనిమక్కువ మాటిమాటికిం
బక్కన నవ్వఁజేసి పయిపక్కఁ బడంగ వినోదవైఖరిం
జక్కగ ముద్దులాడవలదా కలదా యిటువంటి సౌఖ్యమున్. 1 అ

శా. జ్ఞాతిద్రోహము చిత్తమం దిడి సభాస్థానంబులం జేరి దు
ర్జాతుండై వసుధాధినాథులకు లంచాలిచ్చి సంసారసం
ఘాతంబుం జెడిపోవఁ జేసినమహాకష్టుండు వీఁ డగ్రసం
భూతక్షేత్రవినాశహేతుగణసంపూర్ణుండు వాఁ డర్కజా. 2 అ

శా. ఓసూర్యాత్మజ! జంతుసంఘములు-కుయ్యో యంచుఁ గుయ్యంగ నీ
దాసశ్రేష్ఠులు నిల్పలేక బహుబాధ ల్వెట్టఁగాఁ జూచియుం
దోసం బంచుఁ దలంచి వద్దనవు నీతో మాటలాడంగ రా
దీసామ్రాజ్యము నీకె గాక కలదే యేదేవతాశ్రేణికిన్. 3 అ

చ. విను మును జారకాంతకు నవీనసుమంబులు దెచ్చుచోటఁ గ్రి
స్నన నొకపువ్వు దప్పివడినం గని లేమకుఁగా శివార్పితం
బనిన మహత్త్వ మీశ్వరకృపాతిశయంబున శ్వేతనాముఁడే
పున మహనీయవైభవముఁ బొందఁడె నిర్జరబృంద మెన్నగన్. 4అ

నెల్లూరు మండలమున గూడూరు తాలూకాలో కోట యను గ్రామమున్నది. బళ్లారి మండలమున నొకటియున్నది. ఇంకను గోట గ్రామములుచాలగ నున్నవి. కోటగ్రామమునకు కరణిక మీకవికివంశా నుగతముగా వచ్చుచున్న ట్లీక్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది.

"క. ఆకాశికగోత్రాబ్ధిసు
ధాకరుఁ డఖిలైకదానధర్మకళాసు
శ్లోకుఁడు చెంగనయనం
గాకీర్తివహించెఁ గోటకరణం బగుచున్.

## 149 కోట శివరామకవి

ఇతఁడు శూద్రుఁడు; కౌశికగోత్రుఁడు; బాపనయ్య అలమేలు మంగలపుత్త్రుఁడు; అన్నాచ్చి కామాక్షమ్మలకుఁ బౌత్రుఁడు; పొట్టినాయఁడు సూరమాంబలకుఁ బ్రపౌత్త్రుఁడు; చెంగన్న కాళమలకుఁ బ్రపౌత్త్రుఁడు.

ఇతఁడు సానందోపాఖ్యాన మను నైదాశ్వాసముల పద్యకావ్యమును రచించి కాళహస్తీశ్వరున కంకితము చేసెను. ఇతని పూర్వులు వంశపరంపరగా కోటయను గ్రామమునకుఁ గరిణీకమును జేసినట్లుగాను గణకవిద్యయందుఁ బ్రవీణులైనట్లును వర్ణించియున్నాఁడు. ఈకవి కాళహస్తీశ్వర భక్తుఁడనని చెప్పుకొనుటచేతను; ధూర్జటికవికి శిష్యుఁడనని నుడివియుండుటవలనను, కాళహస్తిని వర్ణించియుండుట మూలమునను, నీతని నివాసము కాళహస్తియై యుండునని యూహించి కాఁబోలు బ్ర. శ్రీ వీరేశలింగము పంతులుగా రీతఁడు కాళహస్తి నివాసుఁడని వ్రాసియున్నారు. కాళహస్తి సమీపమున నీతనిపూర్వులు కరిణిక మొనరించిన కోట యుండియుండును. అది యీతని నివాస గ్రామమై యుండును. కవి తనగురువైన ధూర్జటి నీక్రిందిపద్యములలో స్తుతించుచు నాతఁడే సానందోపాఖ్యానమును రచింపుమని తనకాన తిచ్చినట్లు చెప్పుకొని యున్నాఁడు.

సీ. ఏమహాత్ముఁడు దక్షిణామూర్తి గతి శిష్య
 తతికి బోధించు నద్వైతబోధ
 మేరాజమాన్యుండు సారచిత్రకవిత్వ
 గరిమ ప్రబంధ సంఘములు చేసె
 నే రమ్యగుణశాలి శ్రీరాజయోగ సం
 యోగ విజ్ఞానైకయుక్తి వెలసె
 నే సంతతానందుఁ డీశ్వర చరణాబ్జ
 సేవామహాద్భుత సిద్ధిఁగాంచె

తే. నట్టియభినవధూర్జటి యస్మదీయ
దేశికస్వామి కరుణా విధేయుఁడగుచు
వచ్చి నేఁజేయు పూజల కిచ్చ మెచ్చి
పలికె నిట్లని మధురవాక్పటిమ మెఱయ.

క. కృతిసేయఁ దలఁచితివిగా
సతతము శివభక్తి సారసంగ్రహలీలా
ద్భుత లోకోత్తర మగునొక
యితిహాసము గలదు దానినెఱిఁగింతుఁ దగన్.

క. సానందోపాఖ్యానముఁ
బూని వచింపంగఁ గల్గు పురుషార్థముపు
ణ్యానూనకీర్తి శుభముల
మానితముగ వెలసె దీవు మహిలో ననినన్.

ఈసీసపద్యములో ధూర్జటియని మాత్రమే చెప్పియుండెను. కాని యాతఁడు రచించినగ్రంథములను బేర్కొనియుండలేదు. ధూర్జటి నామధారులు పెక్కురు గలరు. (ఆం. క. త. 7వ సం. 253). అయినను, యిందలి వర్ణనమునుబట్టి కాళహస్తి మాహాత్మ్యమును, కాళహస్తీశ్వర శతకమును రచించి, కృష్ణరాయలచే బహూకరింపఁబడిన ధూర్జటియే స్ఫురించుచున్నాఁడు. బ్ర. శ్రీ వీరేశలింగము పంతులుగారు నట్లే భావించి యీశివరామకవిని పదునాఱవ శతాబ్దిలోనివానినిగా నెంచియున్నారు. "అభినవధూర్జటి" యనఁగా నవరశివుఁడని యనుకొనవచ్చును. ఈయర్థమునే గ్రంథాంత గద్యలో "సదాశివ స్వరూప సద్గురు చరణారుణ రాజీవ సేవాసమాసాదితాద్వైతానుభవ" అని తెలిపియున్నాఁడు. మఱియు నీకవి కాళికాదేవి భక్తుఁడైనట్లు గద్యయందలి "ఇది శ్రీమత్కాళికాంబా వరప్రసాదలబ్ధ సాహిత్య వైభవ" యను వాక్యమువలనఁ దెలియుచున్నది.

ఈశివరామకవికి సదాశివ గురుఁడను నింకొక గురువున్నాఁడు. ఆయన యీసానందోపాఖ్యానమును గాళహస్తీశ్వరున కంకితము

సీ. గీ. కోటసీమకుఁ గరణమై గురువిలాస
పరమసద్గుణమణిగణాభరణబిందు
భరణశరణాగతత్రాణకరుణయుగుచుఁ
జెలఁగుకామాక్షమాంబను జెట్టవట్టె"

ఈకవి కౌశికగోత్రుఁడ నని చెప్పుకొనినను పైనివ్రాసిన చెంగన్నకుమారుఁడు పొట్టినాయఁడని యీక్రిందిపద్యములోఁ జెప్పుటచేఁ గవి శూద్రుఁ డనియనుకొనుట కాధారమైనది.

తే. ఆతఁడు కాళమవలనఁ గృతార్థుఁడైన
పొట్టినాయనిఁబడసె నప్పుణ్యశాలి
రూపరేఖాగుణశ్రీల రూఢిఁగన్న
పరమసాధ్విని సూరమాంబను వరించె.

ఈకవి తనవంశమును దాదాపుగ నిరువదిపద్యములలో వర్ణించి యున్నాఁడు. కాని యందుఁజారిత్రాంశము లేమియు లేవు

ఇతఁడు బమ్మెరపోతననునుకరించి చాలపద్యములను వ్రాసియుండెను. మచ్చునకొక్క పద్యమునుదాహరించెదను.

సీ. శివు నపేక్షించిన చిత్తంబు చిత్తంబు
భవుకథ లాలించుచెవులు చెవులు
కరకంఠుఁ బూజించుకరములు కరములు
శ్రీశంభువర్ణించుజిహ్వ జిహ్వ
గౌరీశుఁ బొడగను కన్నులు కన్నులు
మదనవైరికి మొక్కు నుదురు నుదురు
హరుమందిరము మెట్టునడుగులు నడుగులు
సర్వేశు జపియించు జపము జపము.
తే. భర్గుఁ గొనియాడ నేర్చిన భక్తి భక్తి
చిన్మయాత్ముని సేవించు సేవ సేవ
నీలకంఠధనుఁ దలపోయు నేర్పు నేర్పు
శర్వమహిమంబు లెన్నినచదువు చదువు.

గంగానదీప్రవాహమువలె నీతనికవిత నిరాఘాటమై ప్రవహించు చుండును.

ఈకవిగురువు మొదటిధూర్జటిగాక కుమారధూర్జటియో మఱియొకధూర్జటియో యైనయెడల నీకవికాలము కొంత క్రిందకు దిగును.

—*—
* *

## 150 చిత్రకవి పెద్దనకవి

ఇతఁడు ప్రథమశాఖాబ్రాహ్మణుఁడు; కాత్యాయనసూత్రుఁడు; భారద్వాజగోత్రుఁడు; కందాళయన్నగారి శిష్యుఁడు. నల్లగట్టయెలన్నకు దౌహిత్రుఁడు.

ఇతని నాఱువేల నియోగిబ్రాహ్మణుఁడని శ్రీ వీరేశలింగము పంతులుగారు వ్రాసియున్నారు. ఇతఁడును, నీతని పుత్ర పౌత్రులును రచించిన గ్రంథములనుబట్టి వీరేశాఖాబ్రాహ్మణు లైనదియుఁ దెలియరాదు. కాని యీతనివంశకర్తను మంచిరాజని చెప్పుటచే వీరు ప్రథమశాఖానియోగిబ్రాహ్మణులని నిశ్చయింపవచ్చును.

ఈకవి, హనుమంతునిపై నొక శతకమును లక్షణసారసంగ్రహమనులక్షణగ్రంథమును రచించియున్నాఁడు. ఆశతక మిప్పు డెచ్చటను గన్పట్టుటలేదు. ఇతఁడు శతకకవుల చరిత్రమునం దుదాహృతుఁడు కాలేదు. ఆశతకమకుటమును దెలియరాలేదు. హనుమంతుఁడు గలలోఁ గవికిఁబ్రత్యక్షమై లక్షణగ్రంథమును రచించి దన కంకిత మిమ్మని చెప్పినట్లీక్రిందిపద్యములలోఁ జెప్పుకొనియున్నాఁడు.

క. మున్నొకశతకము మాకుం
జిన్నపుడె సమర్పణంబు చేసితి విఁకనున్
సన్నుతలక్షణకృతి య
స్మన్నామాంకితము సేయుమా యిపు డనినన్.

క. నీపేర నంకితంబుగ
దీపితమతి ఛందమొకటి తెనుఁగునఁ గడుసం

క్షేపమునఁ జేతు నీకృప
ప్రాపున నని విన్నవించి యట మేల్కాంటున్.

ఇతఁడు తననుగూర్చి లక్షణసారసంగ్రహాకృత్యాది నీక్రిందిపద్యము నువ్రాసికొని యున్నాఁడు.

సీ. శ్రీహనుమద్వర స్థిరసత్కవిత్వ ద
త్తుండ భారద్వాజ గోత్రజుండ
శుభకర శుక్లయ జుశ్శాఖికా ప్రభా
సురుఁడఁ గాత్యాయన సూత్రయుతుఁడ
మహిని బార్శంచాల మంచి రాజేంద్రుని
కాచధీమణిచెన్నఘనుని పౌత్రుఁ
డను సర్వధీరునందనుఁడఁ గాశ్యపగోత్ర
కలితుఁడై తగు నల్లగట్లయెల
యార్యదౌహిత్రుఁడను లక్కమాంబికాత్మ
గర్భజలధి చంద్రుఁడఁ జిత్రకావ్య ధనుఁడ
ధారుణీశ మాన్యుఁడను గందాళయణ్ణ
గారి శిష్యుఁడఁ బెద్దనకవి వరుండ.

ఈకవి యింటిపేరు పార్శంచాలవారు. ఈకవి వంశమునకు మూలపురుషుఁడు మంచిరాజు. ఇతనిపుత్త్రుఁడు కాచన. ఇతని తనూజుఁడు చెన్నయ. ఇతని కుమారుఁడు సర్వయ. ఇతనిభార్య లక్కమాంబ. ఈదంపతులు కవికిఁ దలిదండ్రులు. ఈకవి పూర్వులెవరును గవులుకారు. ఇతఁడు చిత్రకావ్య ధనుఁడగుటచే నీతనికే చిత్రకవి యని పేరువచ్చినదనియు నతని తరువాతివారికిఁ జిత్రకవి యింటిపేరైనదనియుఁ దలంపవలసియున్నది. పార్శంచాలయను గ్రామము కర్నూలు మండలమున నందుకొట్కూరు తాలూకాలోనున్నది. అదియిప్పుడు పౌరుమంచాలగా మారినది.

కవికాలమును నిర్ణయించుట కొకయాధారము పైపద్యములో నున్నది. కవికిఁగురువైన కందాళ యన్నగారు కందాళయప్ప పండి

తుని కుమారుఁడు. పాండురంగ విజయకృతిపతియైన విరూరి వేదాద్రికి గురువైన కందాళయప్ప పండితుఁడీయణ్ణ పండితుని తనయుఁడు. అణ్ణపండితుని శాసనములు రెండు తిరుపతి దేవస్థానమునందున్నవి. అవి వరుసగా క్రీ. శ. 3-10-1483, 21-12-1486 నాఁటివి. ఈయణ్ణపండితుని శిష్యుఁడైన పెద్దనకవి క్రీ. శ. 1510-1570 నడుమనుండెనని నిశ్చయింపవచ్చును. 1550 ప్రాంతమున నీతఁడు లక్షణసార సంగ్రహమును రచియించియుండును. ఈతనికుమారుఁడైన యనంతకవి క్రీ. శ. 1540-45 ప్రాంతమున జన్మించి, 1580 ప్రాంతమున రామరాజ భూషణునిచే రచితమైన హరిశ్చంద్ర నలోపాఖ్యానమునకు వ్యాఖ్యానమును తన యేఁబదేండ్ల వయసున 1600 సంవత్సరప్రాంతమున వ్రాసియుండును.

లింగమగుంట తిమ్మకవి యీపెద్దనార్యుని నుతించి యుండుటచే లక్షణసార సంగ్రహకాలము 1550 దాఁటి యీవలకురాదు. ఇంకను నొక్కింత వెనుకకుఁ బోయినఁబోవచ్చును.

షష్ఠ్యంతపద్యములలో:—

క. అతులితగుణవంతున కా
నతజన తరుతతివసంతునకు మాణవక
వ్రతజితకంతునకు ధరా
నుత వెలలూరీపురీ హనూమంతునకున్.

వెలలూరు కడపమండలమున గండికోట తాలూకాలోనున్నది. ఆగ్రామమున నాంజనేయస్వామి యాలయము కలదు §. వెల్లలూరి రామయ్య యను వర్తకునియొద్ద శ్రీరామటంకములును, హనుమంత వరహాలును, వేంకటేశ్వర మాడలును గలవని న్యూయల్ పండితుఁడు వ్రాసియున్నాఁడు ‡.

§ లక్షణసారసంగ్రహ పీఠిక. వి. వెంకటరావు పంతులు, M. A గారు పుట. 4; న్యూయెల్, 2వ సంపుటము, పుట 260.

‡ న్యూయల్ 1వ సంపుటము పుట 132.

వెల్లలూరు హనుమంతుని భక్తుఁడై యాదేవునిపై నొకశతకము నురచించి, లక్షణసారసంగ్రహము నాతనికే కృతియొసంగుటచే నీకవి వెల్లలూరు నివాసుఁడని నిశ్చయింపవచ్చును. ఈతని కుమారుఁడును పౌత్రుఁడునుగూడ నీహనుమద్భక్తులే వారిచరిత్రముల నిందు వేఱుగ వ్రాయనున్నాఁడను.

ఇతఁడు ప్రాసములు పదునెనిమిది విధములనియు, యతు లిరువదేడు విధములనియుఁ జెప్పియున్నాఁడు.

క. పదునెనిమిది ప్రాశంబులు
విదితముగా నేర్పరింతు విను లాక్షణికుల్
మొదల నొనర్చిన క్రమమున
విదళితదైత్యేయకాయ వినయోపాయా! 1-63

"సప్తవింశతి యతుల్సత్కవుల్పనిగొన్న
కరణి వళ్లనియుఁ గానరాఁగ
గీతి తారావళిగఁజేతుఁ గృతుల లాక్ష
ణికులు మెచ్చంగ నీకు నేర్పుమెఱసి...... 1-67

ఈగ్రంథము మూఁడాశ్వాసములు కలది. ఈకవి లక్షణములకు లక్ష్యములను దానే రచియించి యుండెను. కాని యితరుల గ్రంథములనుండి లక్ష్యములను గైకొనలేదు.

ఈతని కవిత్వము చక్కని ధారకలిగి హృదయంగమముగా నుండును. లక్షణ గ్రంథమునందలి పద్యములను శైలి చూపుటకై యుదాహరింపఁ దగకపోయినను మూఁడు పద్యముల నుదాహరించెదను.

చ. కళలఁ బ్రవీణుఁడై మిగులఁ గావ్యములందుఁ బ్రియంబుగల్గి కో
ర్కులు సకలార్థికోటులకుఁ గూర్చి యొసంగుచు దానశూరుఁడై
పొలిచి సుకీర్తియై వినయభూషణుఁడై మహిమానుభావుఁడై
నిలిచినవాని నాయకుఁడని న్వచియింతురు సత్కవీశ్వరుల్.

ఉ. మానను రోగముల్వేతలు మానును లేములుమాను మీకు నో
మానవులార! యూరక భ్రమం గొననేటికి నన్యదేవతా
ధీనులుగాక యెప్పుడు నతిస్థిరభక్తి దలిర్పఁగొల్వుఁడీ
మానినుత ప్రసిద్ధమతిమంతుని మాహనుమంతుని న్మదిన్.

గీ. పృథివి జీవుఁడీశుఁడను నభేదవాది
వలెనె వాదించి కుకవి దుర్వాది సభల
దాను రేఫకు ఱాకు భేదమె యనునది
కృతులు చేపట్టుకవి సమ్మతముకాదు.

---

## 151 పోతరాజు

ఆంధ్రసాహిత్య పరిషత్తునందున్న యుదాహరణ గ్రంథములో పోతరాజు బేతాళ పంచవింశతి యందలివని యుదాహరింపబడిన యీక్రింది పద్యములను బ్రబంధరత్నావళినుండి గైకొంటిని. ఈకవి చారిత్ర మించుకంతయుఁ దెలియలేదు.

చ. అరయఁగఁ బూర్వదిగ్వనితయందనురక్తుఁడు ముంద రిపు భా
స్కరుఁడిటవచ్చి నాదెసఁ బ్రశాంతముతో ననురక్తుఁడయ్యె ను
స్థిరమిది యంచు నయ్యపరదిక్సతి రాగముఁ బొందె నాఁగ వి
స్తరముగ నిండఁబర్వె నెఱసంజ నభంబునఁ బశ్చిమంబునన్...

క. ఇంటింటం జింతామణు
లింటింటం బరుసవేదు లింటింట నిధుల్
జంటగొనియుండు ధనపతి
యింటిక్రియన్ బురములోనియిండ్లు నెల్లన్.

ఉ. ఇంద్రులనున్న నగ్నిభయ మెందునుఁ గల్గదటంచు మున్ సురా
నందనమైన ఖాండవవనం బమరావతి వాసి వచ్చి పొ
ల్పొందఁగ మర్త్యలోకమున నుత్సవలీల వహించెనొక్కొ నా
నందవనంబు లొప్పెఁ బురినాలుగు దిక్కుల నున్నతస్థితిన్.

క. సురధరము పెక్కురూపులు
ధరియించి పురంబులోనఁ దనరెననంగా
స్ఫురిత నవరత్న కాంచన
భరితములై వివిధదేవభవనము లొప్పున్.

క. ధర మిన్ను దటిఁగి వైచిన
కరణిఁ దటాకంబు లెల్లకాలమునందున్
బరిపూర్ణములై యుండును
బురికి నవగ్రహాభయంబు పొరయకయుండన్.

క. రవిఁబొంది రాహుచేఁ బరి
భవముఁ బడనోడి తద్గభస్తులు పురిను
వక్కముసఁ జొచ్చిన విధమున
నవిరళరుచి వెలిఁగె దివియలయ్యె యిండ్లన్

ఉ. వ్యాళవిభూషణాళియు దిగంబరమున్ గదయున్ద్రిశూలమున్
వ్రేలెడు కెంజడల్ గగనవీథికిఁ జాఁగిన యుగ్రరూప మా
భీలచతుర్భుజంబులు నభేద్యకరాసియుఁ జంద్రఖండమున్
ఫాలవిలోచనంబు గలభైరవుఁ గాంచె విభుండు ముందరన్.

క. పురివిభవముఁ జూడఁగన
త్కరమున (?) జలదేవి పెక్కుకన్నులు వెలయన్
ధరియించినట్లు వికసిత
సరసిరుహాకరము లొప్పు సౌరభలీలన్.

సీ. ప్రజ్వరిల్లుచునున్న పసిఁడి శాఖలతోడ
వెలసినవనముల చెలువుదానిఁ
గరిమకరిగ్రాహ కచ్ఛపంబులతోడఁ
బరిపూర్ణ జలముల పరిఘ దాని,
మరకత వైడూర్య మాణిక్యములతోడ
హాటకమయ మైనకోటదానిఁ

గమనీయ కాంచన కలశాంగకములతోడ
  నమరిన దేవాలయములదాని
గీ. గనకఖచిత మైనగంబంపు కట్లతో
  వెండిమాడువిండ్లు వెలయుదాని
  జనమహోత్సవ మనఁ దనరినయుజ్జయి
  నీపురంబు సొచ్చె నృపవరుండు.

కవి క్రీ. శ. 1560 కిఁ బూర్వుఁడనుటకంటె నిఁక నేమియుఁ దెలియరాలేదు. అజ్ఞాతమునందున్న యీగ్రంథము నెవ్వరైన సంపాదింతురని 10 పద్యముల నుదాహరించితిని.



## 152 సిద్ధరాజు తిమ్మరాజు

ఈతఁడు చంద్రవంశపు క్షత్రియుఁడు; హరితసగోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; యజుశ్శాఖీయుఁడు. ఔబలరాజునకును గోనమాంబకును దనయుఁడు; ఇతని యన్న రంగరాజు. ఈకవి కృష్ణదేవరాయల యల్లుఁడైన, యళియరామరాజునకును, వసుచరిత్రకృతినందిన తిరుమల రాయలకును మేనల్లుఁడు.

ఇతఁడు పరమయోగివిలాసమను నైదాశ్వాసముల పద్యకావ్యమును రచియించి, మంగళగిరి శ్రీనృసింహున కంకితముచేసెను. కవి తననుగూర్చియుఁ దన రచనమును గూర్చియు నీక్రిందిపద్యములలోఁ జెప్పుకొనియున్నాఁడు.

సీ. ఏరాజుముత్తాత భూరిసామ్రాజ్య ల
  క్ష్మీధురీణభుజుండు సిద్ధనృపతి
  యేనరాధిపుతాత నానార్థిసంతాన
  సంతానశాఖి యనంతశౌరి
  యేగుణాఢ్యునితండ్రి భోగవైభవనూత్న
  నుత్రామఁ డౌభళక్షోణిభర్త

యావిభుం డళిరామభూవరు తిరుమల
ప్రభు వేంకటేంద్రుల భాగినేయుఁ
డట్టి తిమ్మనృపుం డాజిహతతురుష్క
రక్తశోణనదీకృత ప్రబలసలిల
వితతకృష్ణానదీయశోర్జితుఁడు కోన
మాంబపుత్త్రుండు రంగరాజానుజుండు.

మ. సకలశ్రీయుత కొండవీటి నగరీ సామ్రాజ్య ధౌరేయతా
ధికతన్ మీఱుచు నొకనాఁ డచలభక్తిస్ఫూర్తి శ్రీవైష్ణవ
ప్రకరంబున్ భజియించుచున్ హరికథా ప్రస్తావనన్ దివ్యయో
గికథల్ వించుఁ దదర్థకావ్యరచనా కేళీ సమాసక్తుఁడై.

గీ. తానొనర్చు కావ్యమునకుఁ దగినయట్టి
నాయకుఁడు మంగళాచల నాయకుఁడని
నిశ్చయముఁజేసి దృఢముగ నెమ్మనమున
నధికతరమైన సద్భక్తి యావహిల్ల.

ఉ. ఉన్నతిమీఱగాఁ బరమ యోగివిలాసము పేరికావ్యము
ద్యన్నవభావబంధుర రసాన్వయ సన్నుత శబ్దశుద్ధి సం
పన్నత నిట్లు సిద్ధనరపాలుని యాత్మభవ తిమ్మభూవరుం
డెన్నికఁ జేయఁబూని మది నెంతయు సంతసమందె ధన్యతన్.

ఈతఁడు రచించిన పరమయోగి విలాసమునందు విష్ణుభక్తులైన పన్నిద్దరాళ్వారు చరిత్రములను వైష్ణవ మతోద్ధారకుఁడగు రామానుజాచార్యుని చారిత్రమును వర్ణితములైనవి. కవి వైష్ణవభక్తుఁడు, కృత్యాదియందు మంగళగిరి నృసింహుని, లక్ష్మిని విష్వక్సేనుని, గరుత్మంతుని, ఆదిశేషుని మాత్రమే స్తుతించెను. పూర్వకవిస్తుతి, కుకవినింద, గురుస్తుతి ఇత్యాదులు లేవు. తాళ్లపాక తిరువెంగళనాథుఁడు పరమయోగివిలాసమును క్రీ. శ. 1546 ప్రాంతమున ద్విపదకావ్యముగా రచియించియుండెను. తిమ్మరాజును దిరువెంగళనాథుఁడును, ఇంచుమించుగా సమకాలికులు. వీరిరువురును ఈయాళ్వారుల చరిత్రము

లను దెలుపు ద్రావిడ గ్రంథము లాధారములయి యుండును. తిమ్మరాజు కవిత్వము మృదువై ద్రాక్షాపాకమునఁ జక్కని శైలిలో మనోహరముగానున్నది. అప్పకవి యీతని గ్రంథమునుండి లక్ష్యములను గైకొనియున్నాఁడు.

మచ్చుపద్యములు:—

శా. యోగీంద్రాగ్రణియైన భార్గవుని సంయోగంబునం జేసి స
ద్యోగర్భంబున నంత నచ్చరకుఁబుత్త్రుం డుద్భవించెన్ దప
శ్శ్రీగణ్యుండు సుదర్శనాంశజుఁడు లక్ష్మీవల్లభధ్యానము
ద్రాగర్భీకృత మానసుండు పితృతారన్ బౌషమాసంబునన్. 1 ఆ

ఉ. ఎంతయు మేననామములు నేర్పడఁగా ధరియించినట్టివాఁ
డింతకుమున్ను వచ్చెనతఁ డెవ్వఁడొ మేదరి బాగుతో నతం
డెంతమహాత్ముఁడో యెఱుఁగ కేనవమానముచేసి యాతఁ డ
త్యంతము దవ్వుగా నరుగునంతకు నధ్యయనంబు మాన్పితిన్. 2 ఆ

మ. మనలో నెవ్వరు నివ్విధూటి వినసమ్యగ్రూప లావణ్యశో
భను నెవ్వానిఁ బ్రశంససేయరుగదా! వంచాస్త్రుఁ డత్యంత దు
ర్జనుఁడెల్లప్పుడుఁ బొంచి యావనవయః ప్రారంభ శుంభద్వధూ
జనులన్ హేతువొకింత గల్గిన నవశ్యంబుం గలంచుం గడున్. 3 ఆ

చ. తగవులు నిల్పఁ బాల్పడిన దైవమ పక్కట! నీవు మ్రుచ్చువై
మగువల మాత్రకుం బయిసి మాలిన నేరికిఁ జెప్పికొందు మి
జ్జగమున రాజు గొట్టమొగసాలకు మొట్టపవిత్రకీర్తియున్
బాగడిక గన్ననీవ తలపోసి యెఱుంగుట కాక యచ్యుతా! 4 ఆ

ఉ. వేడుకకేగుదెంచితిరొ వెట్టులొ మీరవుఁగాము లేమియుం
జూడక యేల యిట్లుడుకు జుట్టెద రిందును లాభమెద్ది మీ
యాడినవోళ్లు లేమియగు నవ్వల నా మ్మొకచోట నుండనే
జాడయొకింత దెల్పెదను సత్వరవాక్యము చెల్ల దేరికిన్. 5 ఆ

ఆర్వేటి బుక్కరాయల పౌత్త్రుఁడైన సింగరాజను కీకవి దౌహిత్రుఁడు. ఆసింగరాజునకుఁ గోనరాజు, తిమ్మరాజు, అళియరామ

రాజు, తిరుమలదేవరాయలు, వెంకటాద్రి యను నైనుగురును దన
యులు. వీరైదురకును సోదరియైన కోనమాంబ యీకవితల్లి.

కొండవీటిసీమ, కర్ణాటప్రభువులగు సంగమవంశజుల పరిపాల
నములోఁ గొంతకాలమును దరువాత క్రీ.శ. 1460 మొదలు 1515
వఱకును గజపతులక్రిందను బిమ్మటఁ గృష్ణరాయలకాలములో సాళువ
తిమ్మరుసు మంత్రిపక్షమున నాదెండ్ల గోపమంత్రి యధికారముక్రిందను
నుండెడిది. అనంతరమీసీమను రాయసం కొండమరుసయ్యయు నచ్యు
తరాయలకాలములో రామరాయ భాస్కరమంత్రియుఁ బరిపాలించిరి.
సదాశివరాయని రాజ్యకాలములో నళియరామరాయల యాజ్ఞానుసా
రముగఁ దిరుమలరాయలును నాపిమ్మట వారిమేనల్లుఁడగు నీసిద్ధరాజు
తిమ్మరాజును గొండవీడు సీమకుఁ బరిపాలకులైరి. తాను కొండవీ
డును బరిపాలించుచుండగనే యీకావ్యమును రచించితినని కృత్యాది
యందలి మత్తేభవృత్తములోఁ గవి చెప్పియున్నాఁడు.

కవిముత్తాతను బట్టియో, అంతకుబూర్వుఁడైన సిద్ధరాజును
బట్టియో యీవంశమునకు సిద్ధరాజువారని పేరువచ్చినది. కాని యంత
కుఁపూర్వము వీరిగృహనామమేదియో తెలియరాలేదు. ఈకవి నివా
సము కావ్యరచనా కాలమునాఁటికిఁ గొండవీడనుట నిశ్చయము. అంత
కుఁబూర్వమెచ్చటనో తెలియదు. ఈకవి కాలనిర్ణయమునకై శ్రమ
పడనక్కరలేకపోయినది. ఇతని శాసనములు పెక్కులున్నవి. §
ఈకవికి మంగళగిరి శ్రీనృసింహస్వామి యిష్టదైవము. ఈకావ్యము
నాస్వామికే కృతినిచ్చియుండెను. ఆస్వామికితఁడు ధర్మములనొసంగి
యొకశాసనము వ్రాయించెను. ‡ ఆశాసనకాలము శా.శ. 1480

§ నె. శా. సం. పుటలు 304; 853;
A.R. 52 of 1917 శా. శ. 1482; 163 of 1917 శా. శ. 1482, 330 of 1935 శా. శ. 1470; 69 of 1917 శక 1466; 454 of 1915; 330 of 1915 శా. శ. 1470 A. R. 684 of 1920; ద. హిం. శా. సం. 4 సంఖ్య 698 శా. శ. 1486; సంఖ్య 810 శా.శ. 1481.

‡ ద. హిం. శా. సం. 4 సంఖ్య 709.

కాళయుక్తి సంవత్సర ఫాల్గుణ శు ౧౨ (క్రీ. శ. 1548) అదియే కావ్యరచనాకాలమని నిర్ణయింపవచ్చును.

ఈతని తుదిశాసనము శా. శ. 1486 రక్తాక్షి సంవత్సరాషాఢ శు ౧౧ (క్రీ. శ. 1564) ఆనాఁడు మ. మం. రామరాజు తిరుమలదేవయ్య మహారాజులుంగారు కొండవీటి సీమలో అప్పాపండితునకు భూదానమొసంగి ఆదానమును బరిపాలించవలసినదని తిమ్మరాజునకాజ్ఞయీయఁగా నాతఁడాదానమును పాలించెను. ఈతనికుమారుఁడైన రంగపరాజు చదలువాడ శ్రీరఘునాయకస్వామికిఁ గొండవీటి రాజ్యమునందలి అద్దంకి అమ్మనబ్రోలు సీమలోని చదలువాడ, మల్లవరము, అలవలపాడు మొదలయిన గ్రామములనుండి వచ్చెడి సుంకములు ధర్మమొసంగి శా.శ. 1488, క్రోధనసంవత్సర ఆషాఢ శు ౧౧ గురువారమునాఁడు శాసనము వ్రాయించెను. § అందుఁ దిరుమలరాజయ్య దేవమహారాజులుగా రీసీమపైఁ బరిపాలనాధికారము నాతని కొసంగినట్లు వ్రాయఁబడియున్నది. తిమ్మరాజకవికి మఱియొకకుమారుఁడైన వేంకటరాజు తాళ్లపాక పెదతిరుమలయ్యంగారి కుమారుఁడు కోనేటి తిరువెంగళనాథయ్యగారికి భూదానమొసంగి, క్రోధన సంవత్సర చైత్ర బ 30 నాఁడు వ్రాయించిన శాసనము గుంటూరుమండలమున తెనాలి తాలూకాలోని యీమని గ్రామమునందున్నది. ‡ దీనినిబట్టి తిమ్మరాజుకవి రక్తాక్షి సంవత్సర ఆషాఢ శు ౧౧ క్రోధన సంవత్సర చైత్ర బ 30 నడుమఁ జనిపోయెననియుఁ దరువాత నాసీమలపైఁ బరిపాలనాధికార మాతని కుమారులకుఁ దిరుమలరాయలకుఁ బ్రసాదించెననియు నళియరామరాయలు జీవించియుండగనే తిమ్మరాజు చనిపోయెననియు స్పష్టమగుచున్నది. మొత్తముమీఁద నీతిమ్మరాజు కొండవీటి రాజ్యాధికారము నిరువది సంవత్సరములు వహించెను. చనిపోవునాఁటి కీతని బరిపాలనాధికారము వహింపనర్హ తగల వయసులో నిరువురుకొమరులుండుటచే నీతఁడు ధాదాపు డెబ్బది వత్సరములు జీవించి

§ వె. శా. నం. పుట 846.

‡ A. R. 584 of 1920; 686 of 1920

యుండెననియు, అళియరామరాయలతో సమవయస్కుఁడనియు నీతని కాలము క్రీ.శ. 1500–1564 అనియు నిశ్చయింపవచ్చును.

ఈతిమ్మరాజునకు జగరాజను నొకనొక తనయుఁడున్నట్లును అతఁడు శా.శ. 1483 లో నొక శాసనము వ్రాయించినట్లును గన్పట్టుచున్నది. † శాసన పూర్తిపాఠము లభించినఁగాని యీవిషయమును గూర్చి చర్చింప నవకాశము లేదు.

—♦♦—

## 153 ఫణిభవు మాధవుఁడు

ఈకవినామ మిందుఁ జేర్చుట కాధారము రామాప్రెగ్గడ జగ్గకవి ప్రబంధ రత్నాకరములోనుండి యేర్చి ప్రకటించిన శ్రీ ప్రభాకర శాస్త్రులుగారి ప్రబంధరత్నావళియే. ఈకవి రచియించిన గ్రంథము ప్రద్యుమ్నవిజయము. అందలివే యీక్రిందిపద్యములు. ఈకవినిగూర్చి యింకనేమియుఁ దెలియదు.

గీ. అత్రిమునికంటి పసిబిడ్డఁ డాకసమున
నుడుగణము లాడకాడకు నొడ్డగిలిన
బాలభానుండు నలుగడఁ బర్వమీటు
వెండిగుం డన నుదయించె వేగుఁజుక్క.

గీ. గాఢతరకాంతికై మ్రింగు కాంక్ష నంత
రిక్షకాపాలికుఁడు సంతరించినట్టి
గొప్పయగు శుద్ధపారదఘుటిక యనఁగఁ
జొక్కమగుకాంతి వేగురుఁ జుక్క దనరె.

గీ. మిక్కుటపుఁగాంతి వేగుఁజుక్క వొడిచె
బారెఁడెక్కిన యపుడు గన్పట్టియుండె
నినుఁడు నరుదెంచి ననురాగమెసఁగఁ బ్రాచి
మురువుగాఁ దాల్చు నాసికాభరణ మనఁగ.

† A.R. 541 of 1915; A.R. Part II of 1916–17.

చ. నవకపుఁదెల్లముగ్గు జతనంబునఁ గూర్చి వియద్గృహంబునన్
దివురుచు రంగవల్లికలు దేవగణంబులు చూచి మెచ్చఁగా
సవరఁగఁ దీర్చి కాలమను జక్కులముద్దుడు వేడ్కతో దివా
యవనికఁ జాయఁ ద్రొట్టెనన నంచితలీల వెలింగెఁ దామరల్.

ఉ. దలదవదాత కంజదళధౌతకసత్కలధౌతమల్లికా
వలుల విలాసలీల శరవర్గమృణాళమనోజ్ఞ హారవ
ల్లుల రవణంబునన్ సకలలోకనుతోజ్జ్వల కందబృందకం
దలముల చాయఁ జంద్రికిరణంబులకుం దెల్లుపెక్కె నంతటన్.

చ. ఎడపక దివ్యవస్తువు లనేకములుండుటఁ జేసి యేమిటం
గొడమ యిడంగరాని నిజగర్వభరంబున దేవతాపురిం
దొడరుట కప్పురంబు బిరుదుల్ గగనంబున కెత్తెనో యనన్
బొడవున నాడుచుండు నృపపుంగవ! మారుత వైజయంతికల్.

గీ. తొలుత ముంగిళ్లఁ గర్పూరధూళి దుడిచి
సహజ చందన జలములఁ జాపిచల్లి
చారుగృహములఁ గమ్మకస్తూరి నలికి
ముగ్గులిడుదురు పురసతుల్ ముత్తియములు.

సీ. గబ్బిబేడిసమీలు కన్నులకెనవచ్చుఁ
బల్లుదూలు నవి మిట్టిపడకయున్న,
దొగల నెచ్చెలికాఁడు మొగమున కెనవచ్చు
నక్కలంక యింత మేనఁ గందుండకున్నఁ,
గ్రొవ్వున జక్కవల్ కుచములకెనవచ్చుఁ
బ్రొద్దుపోయినఁ బాసిపోకయున్న
మెఱుఁగులు మైత్రని మేనుల కెనవచ్చుఁ
దళతళఁ బొడకట్టి తలఁగకున్న

గీ. ననుచు సరసులు వర్ణింప నవయువాతి
విభ్రమవిలాసవిస్ఫూర్తి వినుతికెక్కె!

గణనమీఁటిన మానినీ మణులుగలరు

..............................

ఉ. చెరచెఁత గుబ్బచన్నుఁగవ శీఘ్రతరంబుగ నంతనంత వ
ర్ధించిన యౌవనోపగమజృంభణ మెక్కిన నంతకంత శో
భించెను దాని నెన్నడుము జీవితనాథుఁడు వానివిల్లునున్
జెంచులరాజులున్ సవతి చేడియ పిండును బక్కణంబులన్.

ఉ. పొంకపు గుబ్బలం బునుఁగుఁ బూఁతయుఁ దుమ్మెదకప్పుమేనులున్
జంకెనచూపులున్ జఘనసైకతసీమలఁ బారుటాకులున్
మంకెనచాయమేనులును ఘూనితహస్తధనుశ్శరంబులున్
కొంకకభిల్లకామినులకున్ దగియుండుఁ బసిండి గుబ్బలిన్.

ఉ. పోలఁగ నందులంగలుగు పుష్పసుగంధుల రూపవైభవ
శ్రీలరయంగఁ గోరియటచేరిన ఖేచరయక్షదైవత
స్త్రీలని సంశయింపఁగఁ బురీజనులద్భుత దర్శనప్రియా
చాలనదూరతన్ నెఱయు సౌధహిరణ్మయ సాలభంజికల్.

క. మెత్తనిబంగరురవరవ
లొత్తెడు కరమూలరోచులొలయంగను దా
రెత్తులు గట్టెడు మిషమునఁ
జిత్తిణితన మొల్ల బయలుసేయుదు రచటన్.

గీ. పట్టువడకది చపలతఁ బాఱెమనసు
సూరిజననుత! రూపఁటి నుడిసెగాలి
యరడఁగొనె నారి గట్టిదై యౌవనంబు
లప్పురము గుట్టముల వేగ మరసిచూడ.

కవి క్రీ. శ. 1560 కిఁ బూర్వుఁడు. గుంటూరు మండలమున పణిదము అను గ్రామమున్నది. దానినిబట్టి యీకవి గృహనామమేర్పడియె నేమో! గ్రంథవిస్తరమైనను నముద్రితగ్రంథమగుటచే బైపద్యముల నుదాహరించితిని. కవిత్వము రసవంతమైనది.

---

## 154 బైచరాజు వేంకటనాథకవి

ఈకవి పంచతంత్రమను నైదాశ్వాసముల పద్యకావ్యమును రచియించి, హరిహరనాథున కంకితము చేసెను. హరిహరనాథునకుఁ గృతినొసంగిన మువ్వురిలో తానొకఁడనని యీక్రిందిపద్యమునఁ జెప్పుకొనియున్నాఁడు.

క. ఏచనువుగలదు హరిహర
సాచివ్యము నొంద నన్యజనులకు మదినా
లోచింపఁ దిక్కయజ్వకు
నాచనసోమునకు మఱియు నాకుం దక్కన్.

ఈతని కావ్యమును హరిహరనాథునకుఁ గృతియొసంగుటచేతను, గ్రంథమధ్యమున "విక్రమసింహపురనికటవటకాంతారమున" నని నెల్లూరును దలపెట్టియుండుటచేతను, నీతఁడు నెల్లూరు మండలమువాఁడని నిశ్చయింపవచ్చును. బైచరాజువారు నియోగులలో నున్నారు. కాని యితఁడు క్షత్రియుఁడు; పర్వతరాజునకు నన్నమాంబికకుఁ బుత్త్రుఁడు; లింగరాజలింగాంబలకుఁ బౌత్త్రుఁడు; తిరుమలరాజతిప్పాంబికలకుఁ బ్రపౌత్త్రుఁడు. ఈకవితాతకుఁ దాతయైన బైచరాజునుబట్టి వీరికి బైచరాజువారను నింటిపేరుగల్గినట్లు గన్పట్టుచున్నది. బైచరాజును గవి యీక్రిందిపద్యములో వర్ణించి యున్నాఁడు.

ఉ. ధీరతరాజవంశ జలధిం బ్రభవించె మహావిరోధి సం
హారనిహారి సాళ్వబిరుదాంకుఁడు బైచనృపాలు ధద్ధరి
త్రీరమణీమనోహరని తీవ్రయశశ్శ్రుతికిన్ హరాద్రిసీ
హారవసుంధరాధరములయ్యె సమగ్రవిహార శైలముల్

ఈకవికిఁ దిరుమల శ్రీయతిపతి గురువైన ట్లీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

క. వాచావీచీ ధీకృత
లోచన కర్ణాగ్రయాయి లోకసుధాంధో

నైచికిఁ దలఁతు స్వద్వం
శాచార్యుం దిరుమలశ్రియఃపతి గురునిన్.

ఈకవి తన పూర్వులను భూనాథ, క్షోణిపాలాది శబ్దములతో వర్ణించినను, తాను వెంకట ధరావర ప్రభుఁడనని చెప్పుకొనినను కుటుంబరక్షణకై మూఢులగు భూపతులకుఁ గావ్యమునిచ్చుటకంటె భగవదర్పితము సేయుటయే మంచిదని యీక్రింది పద్యములోఁ జెప్పియుండుటవలన నీతఁడు రాజ్యములేని సామాన్యక్షత్రియుఁడని తోఁచుచున్నది. ఈతని పూర్వులైన బైచరాజు తిరుమలరాజులేదేని చిన్న సంస్థానమునకుఁ బ్రభువులుగనో, గొప్ప ప్రభువులుకడ దండనాయకులుగనోయుండి గౌరవముగ జీవితము గడపియుందురు.

గీ. అతికుటుంబరక్షణాపేక్షఁ బ్రాల్మాలి
కృతులు మూఢభూమిపతులకిచ్చి
చచ్చి నిరయమునకుఁ జనుకంటె హరిహరా
ర్పణముఁజేసి సుగతిఁ బడయరాదె.

ఇందేకాదు యాచన యెట్టివానికైనను, గష్టదాయకమని కథాసందర్భమున బోధించు నవకాశమును గైకొని రాజులు సామాన్యముగాఁ గవుల నాదరించు స్వభావము గలవారుగానుండరను నర్థమిచ్చు పద్యములను గొన్నిఁటిని రచియించి యున్నవాఁడు. ఈపంచతంత్రము సంస్కృత పంచతంత్రమున కాంధ్రీకరణము. సంస్కృతమున రాజులను నిరసించు శ్లోకము లీకథపట్టున లేవు. ఇట్టిపద్యములను నారాయణ కవి రచియించియుండలేదు. దీనినిబట్టిచూడ నీకవి రాజాశ్రయము నపేక్షించి, విఫల మనోరథుఁడైనవాఁడేమోయని తోఁచుచున్నది. గ్రంథవిస్తరభీతి మనమున నున్నను నాపద్యముల నిట నుదాహరించుచున్నాఁడను.

ఆ. వెల్లివిరిసెఁ బెంటివిద్యలు మగవిద్య
లడుగువట్టెఁ గ్రిందువడిరి బుధులు

హీనజాతిపురుషు లెచ్చిరి యాచింపఁ
జోవు టెట్లు నేఁటి భూమిపతుల

శా. ఏల ల్లందనతాన లేమయిన లేవే యంచు బోధించు నే
నూలంబెట్టగఁజాల మూఢనృపుఁడోహో న్నామహా సాహితీ
శూలంబు ల్సెవులాడ సొమ్మసిలు నొచ్చుం జచ్చుఁ దత్కాల్మషం
బేలాయంజలిచేసి మ్రొక్కెదఁ బదార్థేచ్ఛానిశాచారికిన్.

క. అనుచిత భాషణముఖశా
ననులమొ విటగాయకులమొ నటులమొ గాథ
స్తనసంభరనమ్ర వధూ
జనులమొ మమ్మేల రాజు సంభావించున్.

ఉ. కోరిన గద్యపద్యములఁ గూరిచి యిచ్చెద నంటినేని ని
స్సారములంచు విత్తమిడఁజాలక కేరడమాడు లోభి యా
నేరపు నేర్పుగాదు తనునిందలఁబెట్టు రసజ్ఞుఁడైన యు
ర్వీరమణుండు గల్గినఁ కవిత్వము సర్వఫలంబు లీదొకో.

చ. పలుకుల శబ్దసర్గ శతపత్రభవంబులు జాతవర్ణముల్
బలుకదుపుల్ నిరుక్తికలు ప్రజ్ఞలనర్థకము ల్విచారముల్
వలవని తీవినవ్వఁ బెఱవారి నెఱుంగక తిట్టి కూళ వే
పొలుపునఁ దప్పులొప్పులఁ బోదురొకో సుకవిప్రబంధముల్

చ. మెఱసి బహుప్రబంధతను మెచ్చుట మెచ్చుట యొచ్చమంటి పా
డఱిముఱి నెన్ను టెన్నుట నిరక్షరకుక్షు లధీరశిక్షితుల్
కఱటులు భూరుహాళ్లు పసుకల్పులు మత్కృతిఁ బ్రస్తుతించినం
గఱగఱఁబోవ నాడినను గల్గవు నామది మోద ఖేదముల్.

క. పరిహాసకులకు నటులకుఁ
దరుణులకును లంజెదారి తమ్ములకుం గా
పురుషులకు గాయకులకుం
బొరయింతురు రాజులీరు పో సరసులకున్.

ఉ. ఏపున సంచితార్థము పరేంగితభావమెఱింగి యీఁగి మే
లై పొగడొందనిచ్చి నెఱయన్నలఁచు న్నలదాత యిట్టిచో
దాపయిత్రుసభ్రోదశతం బొరయించి యనంతరంబు సం
తాపమునొందువాఁడధమదాత వృథాలపితంబు లేటికిన్.

ఉ. దాతలు దాతలండ్రిదియతథ్యము లోకమునందు లేఁడుపో
దాత యతండు గల్గినను దాతృత దాసకలార్థులందు నే
లా తులతూఁగకుండ నచలస్థితి నింతయెఱింగి యే నహో
దాత ఋణానుబంధము గదాయని చిత్తమునం దలంచెదన్.

దూబగుంట నారాయణకవికూడఁ బంచతంత్రమును రచించి యుండెను. నారాయణకవి పంచతంత్రమునకంటె నీతని పంచతంత్రమున వర్ణనాంశములును గథలును నెక్కువగాఁ గలవు. నారాయణకవి పంచతంత్రమున 1364 గద్యపద్యములున్నవి. వేంకటనాథకవి 2082 గద్యపద్యములను రచించెను. చతుర్థాశ్వాసముననే 474 పద్యములధికముగనున్నవి. వేంకటనాథకవి వర్ణనాంశముల నధికముగాఁ జేర్చి నారాయణకవి చెప్పని పెద్దగాథయొకటి నాల్గవయాశ్వాసమునఁ జెప్పియున్నాఁడు. బ్ర. శ్రీ వీరేశలింగము పంతులుగారు నారాయణకవి కవిత్వము వేంకటనాథకవి కవిత్వమంత రసపుష్టికలది కాదని యభిప్రాయపడినారు. మఱికొందఱు పండితులందులకు వ్యతిరేకాభిప్రాయమిచ్చియున్నారు. కవితయందలి తారతమ్యముల నరయుటలోఁ బండితులు వివిధాభిప్రాయములు గలిగియుందురని వేంకటనాథకవియే తన పంచతంత్రమున నీక్రిందిపద్యములో జెప్పియున్నాఁడు.

సీ. ఒకడలంకారంబునకు వేడుక వహించు
నొకఁడు వార్తాసమృద్ధికిఁ జెలంగు
నొకఁడు శబ్దస్ఫూర్తులకు మాయురే యను
నొకఁడర్థసృష్టికి నుత్సహించు
నొకఁడు రసాభోగతకుఁ మస్తముఁ గదల్చు
నొకఁ డుపమానచర్చికకు నలరు

నొకఁడు పదపౌఢిమకు నిచ్చలో మెచ్చు
నొకఁడు జాతిశ్లాఘకుబ్బుచుండు

తే. గామిచందానఁ దలపరి కరణి బధిరు
వలె దరిదు)నిగతి వాదిపగిదిఁ గనక
కారుచొప్పునఁ బంగువై ఖరిఁగుజాతి
జాడనిందజీముదలింపఁ జాలు టెట్లు?

విమర్శకుని యభిరుచిననుసరించి కవిత్వగుణము స్ఫురించుచుం డుననుట నిజమే. అయినను నారాయణకవి చారిత్రమున నుదాహ రింపఁబడిన పద్యములయందలి భావమును దెలుపు పద్యములనే వేంకట నాథకవి కవిత్వశైలి తెలియుటకై యీక్రిందవ్రాసితిని. కావున నుభ యకవుల తారతమ్యముల నెఱుంగఁగోరువారీయిరువురి పద్యములను జదివి తమ యిచ్చవచ్చిన యభిప్రాయమునకు రావచ్చును.

కవిత్వమతిగూఢము నతిపేలవముగాకుండ హృదయంగమముగా నుండవలయునని కవి యాక్రిందిపద్యములో సోదాహరణముగఁ జెప్పి యట్లేతన కావ్యమును రచియించి యున్నాఁడు.

చ. ఘనతర మూర్జరీ కుచయుగకి)య గూఢముగాక ద్రావిడీ
స్తనగతిఁ దేఁటగాక యరచాటగు నాంధ్రవధూటి చొక్కపుం
జనుఁగవఁ బోలి గూఢతయుఁ జాటుదనంబును గాకయుండఁజె
ప్పినయదెపో కవిత్వ మనిపించు నగించటుగాకయుండినన్.

ఈతని కవిత్వమునందు వ్యాకరణ విరుద్ధములైన ప్రయోగములు స్వల్పముగఁ గాన్పించుచున్నను నవి లెక్కింపఁదగినవికావు. అందును గురించి కవియే యిట్లు చెప్పుకొనియున్నాఁడు.

క. ఒప్పులు గలకృతిలో నొక
తప్పున్నను గడమగాదు దానికిఁ గళలం
జొప్పడు శశికిఁ గళంకము
కప్పేర్పడి యేమినిందఁ గావించె నొకో!

ఈకవి తన కావ్యరచనాకాలమును గ్రంథమునఁ జెప్పియుండ లేదు. కాని పూర్వకవిస్తుతి చేయుటలో నీక్రిందిపద్యమునఁ గ్రమాలంకారముగ శ్రీనాథుని స్తుతించియుంపుటచే నీతఁడు పదునైదవశతాబ్దికిఁ బూర్వుఁడు కాఁడనుట స్పష్టము. బ్రౌనుపండితుఁడీకవి క్రీ. శ. 1500 సంవత్సర ప్రాంతమువాఁడని వ్రాసియుండెను.

మ. హృదయు బ్రహ్మరథం బతిప్రియతమం బెక్కించుచుఁ జేతోమరు
త్పదనాస్థానికిఁ దెత్తు మానససభస్సంచారిగావింతు హృ
ద్విదితక్షీరసముద్రభేలనమున న్దేలింతు నుత్కృష్టవ
స్తుదులం బ్రాజ్ఞులఁ దిక్కయజ్వ నమరేశునోస్సము శ్రీనాథునిన్.

ఈకవి కాలమును నిర్ణయించుటకుఁ దిరుపతిలోనున్న శాసనము లొక్కింత తోడుపడుచున్నవి. బైచరాజు తిమ్మరాజు అనునాతఁడు తిరుపతి వేంకటేశ్వరస్వామికిని గోవిందరాజులకును ధర్మములనొసంగి మూఁడు శిలాశాసనములను వేయించియున్నాఁడు.

మొదటిది:— శాలివాహనశకము 1413 అగు విరోధికృతు సంవత్సర మిధునమాస బహుళపక్ష సప్తమీ సోమవారమునాఁటిది. (క్రీ.శ. 1491 సం. జూను 27) ఈశాసనములో బైచరాజు తిమ్మయదేవమహారాజు అనియున్నది. భాష అరవము.

రెండవది:— శా. శ. 1414 పరీధావి సంవత్సర వృశ్చికమాస బహుళపక్ష విదియనాఁటిది. (క్రీ.శ. 1492 సం. నవంబరు 6) ఇందులో అంతెంబరగండ ఉరగోల సురత్రాణుఁడును, మహామండలేశ్వర ఉత్తమగండ ఉభయరగండ గండరగండ గండభేరుండ బిరుదాంకితుఁడు నగు కొమ్మరాజు సిరుతిమ్మరాజ కార్యనిర్వాహకుఁడు నగుబైచరాజు తిమ్మరాజు అనియున్నది. భాష అరవము.

మూఁడవది:—కాలముదాహృతముకాలేదు. ఆంధ్రమున "అంత్తెంపరగండ వురగోలసురధాణ బైచరాజ తిమ్మరాజ శిలాశాసనము" అనియున్నది.

పంచతంత్ర కర్తయగు వేంకటనాథకవికి తాతయగు దండ్రి తిరుమలరాజయినట్లును నాతనితండ్రి బైచరాజయినట్లును, పంచతంత్రము నందున్నది. ఆతిరుమలరాజే దానశాసనకర్తయగు తిమ్మరాజని నిశ్చయింపవచ్చును. తిమ్మరాజు, తిరుమలరాజు నామము లొకవ్యక్తికె పలుతావులలోఁ గవులు వాడియున్నారు. కావునఁ బేరునందు భేదమున్నదని తలఁపనక్కరలేదు. పైశాసనములలోఁ జెప్పఁబడిన "ఉరగోల" నిజాము రాష్ట్రమునందలి వరంగల్లు అను పట్టణమే కాని వేఱు కాదు. వేంకటనాథకవి దానశాసనకర్తకు మునిమనుమఁడగుటచే క్రీ. శ. పదునాఱవ శతాబ్ది నుత్తరార్థమున నున్నవాఁడని నిశ్చయింపవచ్చును. వేంకటనాథకవి పంచతంత్రమునఁ దిరుమలరాజును వర్ణించిన పద్యము నీక్రింద వ్రాయుచున్నాఁడను.

క. అలబైచక్షితిపతికి
లబ్ధలభిత్ప్రతిమాన భోగపరతంత్రునకున్
గలిగె న్దిరుమలధరణీ
తలనాథుఁడు నిర్భర ప్రతాపోజ్జ్వలుఁడై.

డాక్టరు చిలుకూరి నారాయణరావు పంతులుగారు వేంకటనాథకవి మాతామహుని శాసనములనుబట్టి యీతఁడు క్రీ శ. 1550–1560 సం॥ల నడుమ పంచతంత్రమును రచియించెనని నిర్ణయించినారు. కావునఁ గవికాలము 1500–1570 అని నిశ్చయింతము.

ఈతఁడు తన గ్రంథమున సమయము వచ్చినప్పుడెల్ల వైద్యశాస్త్ర విషయములను తఱచుగాఁ జెప్పుచుండుటను బట్టియును, వైద్యులను:—

చ. ఫలిత చికిత్సరోగములఁ బాప శుభక్రియల న్మహౌఘము
లొ్ప్పలుపఱచేయు నీతిధనము ల్బహుభంగులఁ గూడబెట్టి గే
వలపరతంత్రులై మెఱయు వైద్యవిపశ్చిదమాత్యులుం ధరా
తలపతిఁ బాసిపోవుదు రతఁడు కృతజ్ఞుఁడు గాకయుండినన్.

అను పద్యమునఁ గొనియాడుటను బట్టియు, నీకవి యాయుర్వేదమునఁ బ్రజ్ఞకలవాఁడైనట్లు కన్పట్టుచున్నది.

ఈతనికవిత్వము మనోహరమై సహృదయాహ్లాదకరముగా నుండును. కవిత్వశైలి చూపుట కీతని గ్రంథమునుండి యాశ్వాసమున కొక్కొక పద్యము నుదాహరించుచున్నాఁడను.

చ. అనుచితవృత్తిఁ బురుషాంతరచింత వహింప నిన్ను నొ
క్కని గడపం బతివ్రతను గాని యొకప్పుడుఁ గాను బుంశ్చలిన్
వినుఁ డిదె లోకపాలకులు వేయును నేటికి సాధ్వి నేని సం
జనిత కృపన్మదాననముఁ జక్కఁగఁ జేయుఁడు కీర్తి కెక్కఁగన్. 1ఆ

చ. తిమిరనివారణక్రియకు దీపము వారిధి నిస్తరింపఁ బో
తము చలిఁ బాప వహ్ని రవితాపభరంబడగింప నాతప
త్రము కలుషంబులం జెఱుప ధర్మము బొల్పడియుండుఁ గాని య
క్కమలజుఁడున్సుఖోద్యముఁడు గాఁడు దురాత్మునిఁ జక్కఁ జేయఁగన్

చ. సముచిత భాషణంబులకుఁ జాతురి సాలకయున్న మానము
త్తమము పరాంగనాగమన తత్పరుఁడయ్యెడు దానికంటె మం
డమతము మేలు చాఁడికి నోడంబడియుండెడి వృత్తికన్నఁ జా
వు మిగుల లెస్స యస్యవసువుల్గొనుకంటెను భిక్షమొప్పగున్. ఆ2

సీ. ఘనరూపనిధి యనంగున కా? యనంగత్వ
ముచితమే బలికహివ్యాహవసతి
పాండునందనుల కా? బహుకాల వనవాస
మిభపురాధిపునకా యేటిచోరవ
యదుకులాధ్యక్షున కా? శాపమరణంబు
జాహ్నవీసుతునకా శస్త్రశయ్య
నలరాజు కా? మహానసపాక భజనంబు
నహుషునకా? ఘోరనాగమూర్తి

తే. మరిత్రిశంకునకా? వచ్చిమాలతనము
ద్రుపద నందనకా? రాచతొత్తుపాటు

మనుజుఁడెవ్వఁడు? కర్మస్వతంత్రుఁడరయ
నీశ్వరుఁడుకాక సమకూర్ప నిట్టిపనులు. ఆ 3

చ. కడపట భార్యనిల్కడకుఁగాఁ జెలికానికి నెగ్గుసేఁత యె
క్కుడు దురితంబు కాఁపురము గూలఁగఁ జూచుట యున్మహాఘమి
ప్పుడతుకపట్టున న్సఖుని పట్టున నింతి విశేష మింతకై
చెడుపనియేనియుం దగిలి చేయుక మానఁగరాదు గొబ్బునన్. ఆ 4

చ. ప్రకమనరేఖఁ బాదమునఁ బ్రామి యహూ యవిశేషరోషసం
వసుఁడగుచున్ ధరాస్థలినవారణ నెవ్వఁడు వేగిరించి సం
భృతతరకార్యము ల్సలుపుఁ బెద్దయు వేయును నేల సర్వదు
ర్దశలు గలంచువానిఁ దము దా గుణలుబ్ధులఁ బొందుసంపదల్. అ 5

## 155 సర్వదేవుఁడు

ఇతఁ డెవరో ఎప్పటివాఁడో ఎచ్చటివాఁడో ఏమియుఁ దెలియదు. ఈతనియాదిపురాణము లోనివని రెండుపద్యములును, విరాటము లోనిదని యొకపద్యమును ఆంధ్రసాహిత్యపరిషత్తునం దున్నయుదాహరణగ్రంథములో నున్నవి. "విరాటము" అనఁగా విరాటపర్వము అని యూహింపవచ్చును. ప్రబంధరత్నావళినుండి గైకొని యాపద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

ఆదిపురాణము:—

మ. సరసీజాతవిరాగకారి పురయోషావక్త్రహృద్యాతినుం
దరకాంతిన్ దఱిఁగించుఁబో యని మదిం దర్కించి దోషాకరున్
బర ముద్దండకరంబు లెత్తి చఱవం బోత్తైన యట్లొప్పు ను
ద్ధరసౌధాగ్రనిబద్ధకేతువు మహోద్యోలాభిరామంబుగన్.

క. హరినీలమణివిరాజిత
సురుచిరగోపురము దగిలి! చూచి తమిస్రా
కరుఁడు విధుంతుదమండల
పరిశంకం జేసి పురముపైఁ జననోడున్.

విరాటము :—

సీ. ఇక్షురసాబ్ధి నీ రెట్టిదో యని మది
నూహించి యువ్విళు లూరకుండ
విరసంపుఁదిమికిఁ బరిహారం బగురసా
యనము మీఁదికిఁ జిత్త మరుగకుండ
దివిరి దేహమ్ము వేధించుసిద్ధరసంబు (?)
కందువ యచ్చోటి కందకుండ
నాయువుఁ జిరతరస్థాయిగాఁ జేయు సు
ధారసంబున వేడ్క దగులకుండ

గీ. నఖిలజనులకుఁ బంకేరుహాసనుండు
నేర్చియన్నింటిరుచు లొడఁగూర్చి తెచ్చి
సంచితంబులుగా సంగ్రహించెననఁగ
భరితజలములై పురసరోవరము లొప్పు.

మల్హణ చరిత్రమును రచించిన పెదపాటి యెఱ్ఱనకవి, పూర్వకవులను నుతించిన పద్యములో నీసర్వదేవునిఁ జేర్చియున్నాఁడు. ఎఱ్ఱన కవి పదునాలవ శతాబ్దిఁ బ్రథమపాదమువాఁడు. కావున నీతఁడంతకుఁ బూర్వుఁడనుట నిశ్చయము;

---

# 156 పొన్నతోట యాబళకవి.

ఇతఁడు మార్కండేయ పురాణమును, వామన పురాణమును, రచించి రాణా జగదేవభూపతి కంకిత మొనర్చెను. కృతిపతి కవిని గూర్చి పలికినట్లు రచింపఁబడిన వామన పురాణమందలి యీక్రింది పద్యమువలనను గ్రంథాంత గద్యమువలనను గవిపేరును తండ్రిపేరును దెలియవచ్చుచున్నవి.

సీ. ఊహాగావింపుచునున్నచో రాణ వం
శాగ్రణినై తేజమంది వెలయు

జగదేవరాయ భూజాని చంద్రుండు నన్నుఁ
జేరంగఁ బిలిచి గంభీరఫణితి
నోపాన్నతోఁట్కాన్వయోజ్జ్వల......
కవివర్య! నీవు మున్నడఁగి మాకు
నంకితంబుగఁ జేసినట్టి మార్కండేయ
మనుపురాణంబు......
వెసఁగుచున్నవి గాన నీవిపుడొనర్చు
వామనపురాణమును జగద్వర్ణితముగ
మాకె యంకిత మొనరింపు మధురరసని
గుంభజృంభిత కవన సంరంభమునను.

గద్య:— ఇది శ్రీమద్వేంకటరమణ పరిచరణ ధురంధర హృదయ నిఖిలకవిరాజ వర్ణనీయవ రాంధ్రకవితావిశేష సర్వంకష భాషానిరాఘాట పాన్నఁతోఁట కలాపాథోనిధిరాకానిశాకరాజరాజ దాబళాచార్య తనూభవ దాబళకవిప్రణీతంబైన వామనపురాణంబునందు సర్వంబును దశమాశ్వాసము.

దీనినిబట్టి కవితండ్రి నామముగూడ దాబళుఁడే యన్ని తెలియుచున్నది. కాని యితఁడేకులమువాఁడో తెలియుట లేదు. గోత్రము గాని సూత్రముగాని చెప్పలేదు. పై సీసపద్యములోని మూఁడవ పాదాంతమునఁ గొంతభాగము శిథిలమైనది. ఆభాగమున నీకనొక గ్రంథనామ ముండియుండినట్లు తోఁచుచున్నది. ఈతని గ్రంథము లేవియు ముద్రింపఁబడలేదు. మదరాసునందలి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున వామన పురాణముయొక్క యముద్రిత ప్రతి యొకటి యున్నది. మార్కండేయపురాణ మిప్పుడెచ్చటను గన్పట్టుట లేదు.

కృతిపతియైన రాణా జగదేవభూపతి శూద్రుఁడైనట్లును, విష్ణువర్ధనగోత్రుఁడైనట్లును నీక్రిందిపద్యము వలనఁ దెలియఁగనగును.

గీ. శౌరిపదమున నాలవజాతి వొడమి
యభినుతి వహించి విఖ్యాతి నయ్యెనందు

విష్ణువర్ధనగోత్రంబు వెలసె మిగుల
సర్వసౌభాగ్య వైభవ స్థానమగుచు.

ఈరాణావంశమువారు మైసూరురాష్ట్రముననున్న చెన్నపట్టణమునకుఁ బాలకులుగానుండి, యుద్ధములలోఁ గర్ణాటక ప్రభువులకుఁ దోడుపడియున్నట్లు కన్పట్టుచున్నది. ఈవంశమునకు మూలపురుషుఁడు తిమ్మరాజు. ఇతనికొడుకు సింగరాజు. ఇతనికిఁ దిమ్మరాజు, మాదరాజు, చెన్నమరాజు, లక్ష్మరాజు అని నలుగురు తనయులు. ఇందులో బెద్దవాఁడైన తిమ్మరాజు బరీదు మొదలగువారిని గెలిచి, జగదేవుఁడను పేరు వహించిన ట్లీక్రిందిపద్యములోఁ జెప్పఁబడుచున్నాఁడు.

గీ. వారలలోఁ దిమ్మనృపతి గభీరచెన్న
మాంకుశేంద్రుండు తోడుగా నడరఁగడగి
యలబరీదపురాణ పురాధిపతుల
నణఁచి తాఁగాంచె జగదేవుఁడను సమాఖ్య.

ఈతనికిఁ బెదజగదేవుఁడు, ఇమ్మడి జగదేవుఁడు, చిన్నజగదేవుఁడు, అంకుశేంద్రుఁడు అను నల్గురు కుమాళ్లు.

సీ. వారిలో రణరంగధీరుఁడై యిమ్మడి
జగదేవరాయ భూజానిచంద్రుఁ
డసమబాహాశక్తి నలరారి మృత్యుజా
ఖానుచిత్తాఖాను కఠినభావ
ఖనిమూనిఖానుని ఖండించి వెస్సదదీ
య్యానుచరాక్రమి......!
...డాడి సమన్వితముగ విక్రమ
క్రమలీల నెంతయుఁ గ్రమముమీఱి

గీ. నార రాజన్యమాతుఁడే యాత్మనీన
ధాటికాస్తంభ జవనిరాఘాటఘోట
ఝాటఖురపుట సంభూతచటులభూప
రాగసంభృత దశదిశాభాగుఁడగుచు.

ఈపద్యమైనపిమ్మట ఆర్వీటి బుక్కరాయలవంశములోని శ్రీరంగ రాయల కుమాళ్లను వర్ణించు నీక్రిందిపద్య మొకటి యీగ్రంథ కృత్యాదియందుఁ జేర్పఁబడినది.

గీ. అళియరామావనీశుఁ దిర్మలనృపాల
వరుల శ్రీరంగరాయల సరసుఁడైన
వీరవేంకట రాయని వెలయరాయ
పట్టభద్రులఁ బడసె నవ్వార్థివుండు.

ఈపద్యమునకిటఁ బ్రసక్తి లేదు. ఈపద్యము వేఱుగ్రంథములోనిదయి యుండును. విలేఖకుఁడిక్కడఁ జేర్చియుండును.

క. ఆయిమ్మడిజగదేవున
కాయతవైభవ మెసంగ నవరజుఁ డగుచున్
ధీయుక్తి వెలసె నంకుశ
రాయధరిత్రీవిభుండు రమ్యాకృతియై.

ఈయంకుశరాయలకు వెంగమాంబయనుభార్యయందు మూఁడయ కుమార జగదేవుఁడు, అంకుశరాజు, వెంకటపతి యను నల్గురు తనయులున్నట్లిందు తెలుపఁబడినది. ఈజగదేవుఁడే కృతిభర్త.

తిరుపతి దేవస్థానమువారు ప్రకటించిన వంశవృక్షములలో నీవంశవృక్షము చూపఁబడినది. ‡ దానికిని వామనపురాణమునఁ బై పద్యములలో వర్ణింపఁబడిన దానికిని గొంచెము భేదమున్నది. అంకుశరాయలకు లింగాంబ, విఠలాంబ, లక్ష్మాంబ అను ముగ్గురు భార్యలని తిరుపతివారి వంశవృక్షములోఁ జెప్పఁబడినది. ఇందు వెంగళాంబ యని యున్నది. వెంగళాంబకు బదులుగా పొరపాటున లింగమాంబయని వడినదేమో! ఇంకను గొన్ని భేదములున్నవి. కాని వానితో మనకంతగాఁ బ్రసక్తి లేదు. ఈగ్రంథ కృతిపతియైన జగదేవరాయని తమ్ముఁడైన రెండవ యంకుశరాయలకుఁ గొండవీడునందలి సుప్రసిద్ధ కవిశేఖ

‡ సంపుటము 6 సంఖ్య 160.

రుఁడైన యేకామ్రనాథకవి సంస్కృతమున జాంబవతీ కళ్యాణమును కృతియొసంగెనఁట.

ఈకృతిపతియైన జగదేవరాయులు ఆంధ్రకవి యగుట నాతని చారిత్రమును వేఱుగ వ్రాసియున్నాఁడను.

ఈకవికాలమును గనుఁగొనుటకు గ్రంథమున నొకయాధారము దొరకినది. ఈకవి కందాళ భావనాచార్యుని తనయుఁడగు శ్రీరంగ గురుని శిష్యుఁడైన ట్లీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

సీ. శ్రీనివాస పదాంభోజసేవనాని
రూఢమానసఘనజాతరూపకుధర
ధైర్యుఁ గందాళ భావనాచార్య తనయు
గురుశిఖామణి శ్రీరంగగురుని దలఁతు.

సుదక్షిణా పరిణయమును రచించిన తెనాలిఅన్నయయు, విష్ణు పురాణమును జేసిన కలిదిండి భావనారాయణయుఁ గూడ నీశ్రీరంగ గురుని శిష్యులే. కావున నీయాబళకవి వారితో సమకాలికుఁ డను టకు సందియము లేదు. కావున నీతఁడు క్రీ. శ. 1540 ప్రాంతము వాఁడని నిశ్చయింతము.

గ్రంథమునుబట్టి కవి నివాసమేదియో నిర్ణయింప వీలుకలుగలేదు. కృతిపతి మైసూరు వాస్తవ్యుఁడు. సహాధ్యాయి గుంటూరు మండల నివాసి. గురువు తిరుపతియందున్నవాఁడు. పొన్నతోట కడపమండ లమున జమ్ములమడుగు తాలూకాలోనున్నది. ఆగ్రామమునుబట్టి యీకవి గృహనామ మేర్పడియుండును. ఈతఁడాయూరివాఁడేమో ! పొన్నతోటలో నీగృహనామముగలవారెవ్వరును నిప్పుడు లేరని తెలి యవచ్చినది.

ఈతని కవిత్వశైలి చూపుటకు వామన పురాణమందలి పద్య ములు నాకు లభింపనందునఁ బైనివ్రాసిన మూఁడు నాలుగు పద్యముల తోడనే తృప్తిపడవచ్చినది.

పై సీసపద్యమునం దుదాహృతులైన మృత్యుజాఖాను, చితాఖాన్, నూనిఖాను లెవ్వరో దెలిసినదికాదు. చిత్రాఖాననంగా చితాపఖానుకాదుకదా! ఈవిషయమింకను బరిశోధనీయము.

## 157 పొన్నాడ పెద్దిరాజు

ఈకవి ప్రద్యుమ్న చరిత్రమను ప్రబంధమును రచియించినట్లు రామాప్రెగ్గడ జగ్గనకవి ప్రబంధరత్నాకరమునం గొన్ని పద్యము లుదాహరించియుండుటనుబట్టి తెలియుచున్నది. అప్పకవి యీతని ప్రద్యుమ్న చరిత్రమునుండి లక్ష్యమును గైకొనియున్నాఁడు. ఈగ్రంథమిప్పుడు లభించుటలేదు.

ప్రబంధరత్నావళియం దీతని పద్యము లిరువదివరకు నుదాహృతములయియున్నవి. అందుఁ గొన్నిటి నీక్రిందనిచ్చుచున్నాఁడను.

శా. శ్రీవ్యాయామపురాలు లక్షుభిత పారావార క్షీణప్ర
శ్యావ్యాపారను రేంద్రు లగ్రహాణ చంద్రాదిత్యు లస్థావర
ప్రవ్యక్తామర భూరుహంబు లచతుర్భావాననబ్రహ్మ లా
దివ్యద్వారవతీపురిం గలుగుధాత్రీపాలు రెల్లప్పుడున్.

మ. బహువస్తుక్రయవిక్రయక్రియలు సంపత్ప్రాప్తి కై కాకయున్
విహితాచారము లైనచందముల వర్ణిత్వంగ నిరంతతనా
మహిలోరాదని చెప్ప నొప్పుదురు ధీమంతుల్ కుబేరాధికుల్
మహిమోదాహరణంబు లప్పురము కోమ ట్లుల్లలక్ష్మి స్థితిన్.

క. పురగోపురశిఖరంబులఁ
గర మరుదై పద్మరాగకలశము లమరున్
జరమాచరమాద్రులపై
సరిఁ బున్నమఁ దోఁచుసూర్యచంద్రులభంగిన్.

సీ. నెలఁతుకచూడ్కి వెన్నెలఁ గాసినఁ గుమారు
వీక్షణాంభోనిధి వెల్లివిరియఁ

బలిచూడ్కి తామరల్ పరువంబు నొందఁ దొ
　　　　య్యలిచూపు టలులు చిట్టాడుచుండ
సుదతిచూ పమృతంపుసోనయై కురిసిన
　　　　వరుదృష్టి యనిమిషత్వమున బొంద
నధిపుదృష్టి ప్రవాహంబు వెల్లడరిన
　　　　నింతిదృగ్మీనంబు లీఁతలాడ

గీ. వరుసఁ గౌతుకకల్లోలవలన మొలయు
రాగమకరందమత్తత పరిజ్వరిల్ల
సంచితధ్యానమను ప్రకాశము తలిర్ప
జిఱుతసిగ్గను వలలోనఁ జిక్కువడక.

సీ. గజయాన మెలఁగినగతి యైనఁ బైపడ
　　　　గద్దించి తర్కించి కలఁక నొందు
మానిని యల్గినమాడ్కిఁ దోఁచినఁ దేర్ప
　　　　నుంకించి భావించి యుమ్మలించుఁ
జపలాక్షి కెమ్మోవిఁ జవిగొన్నయ ట్లైనఁ
　　　　జెమరించి జర్పించి చిన్నవోవు
మదవతి కౌఁగిలి గదిసినయట్లైనఁ
　　　　బులకించి తేటి సంచలత నొందుఁ

గీ. దన్ను నొఱసినఁ గోర్కులు తగులుగొలుపు
నోలిఁ దనలోన నన్నరపాలసుతుఁడు
మౌన మూఁటాడ గంభీరమహిమ సడల
లజ్జ గడివోవ ధైర్యంబు లావు డిగఁగ

సీ. బ్రాఁతియే యిఁకఁ గల్గులేఁత వెన్నెల నిగ్గు
　　　　లుగ్గువెట్టెద నీకు నూరకుండు
ముమ్మపుగా నీకిత్తు ముదురు వెన్నెలసోఁగు
　　　　సంతసంబున నుండు జాలిమాని

వేగిరింపకు నీకు వెలఁది వెన్నెలకొవ్వు
గుడిపింతుఁ జిన్నారికడుపునిండ
నిట్టిముచ్చటవాయ నీఁదింతుఁ బంగువె
న్నెల వెల్లిఁ బలుమాఱు నిన్నుఁ జేరి

గీ. కూయకుఁడు మీరు సంతుష్టిఁ గూరినపుడు
శీతలం బగువెన్నెల చిగురుఁ బాన్పు
నందు నిద్రపుచ్చెద ననుచు నాద
రించె బిడ్డల నొకచకోరీపురంధ్రి

గీ. రాయుచున్న ఘనపయోధరములు గలిగి
నడుము లోకకొంత బయలయి బెడఁగు మిగిలి
చూపనొప్పారు రేఖల సొంపు మెఱసి
కోటకొమ్మలమరు వీటికొమ్మలట్లు

గీ. రత్నగర్భగర్భరత్నంబులవ్వీట
నర్థిఁ బుట్టుచుఁ గొనియాడ్థ మరగి
వీథివీథి నెపుడు విలసిల్లు నానాప
ణముల వివిధరత్నసమితి వెలుఁగు

జగ్గనకవి క్రీ. శ 1560 ప్రాంతమువాఁడగుటచే నీపెద్దిరా జంతకుఁబూర్వుఁ డగుటనిశ్చయము. పొన్నాడయను గ్రామము విశాఖపట్టణ మండలము లోనిది.

—) ♀ (—

## 158 కొటికెలపూఁడి సోమనాథకవి

ఈకవిచరిత్రమును శ్రీకొణిదెన బాలకృష్ణయ్యగారు శ్రీముఖ సంవత్సరాదిసంచికలో నిట్లు వ్రాసియున్నారు.

"విస్మృతకవిసమాజమునకుఁ జేరినవారిలో సోమనాథుఁడొక్కఁడై యున్నాఁడు. ఈతనిచరిత్రము కీ. శే. వీరేశలింగముపంతులుగారి కవిచరిత్రమున కెక్కియుండలేదు. కీ. శే. గుంటుపల్లి సోమయ్యగారు

తమచేఁ బ్రకటింపఁబడిన "ప్రబంధకల్పవల్లరి" యనుమాసపత్రికయం దీతనికృతి నొకదానినిఁ బ్రకటించుదనుక నీతనివృత్తాంత మాంధ్రలోక మెఱుంగదు. సమగ్ర మగునాంధ్రకవులచరిత్రమును రచింపఁదలంచు వారి కిది యుపకరించుననుతలంపునఁ సోమనాథకవివిషయము నిటవివ రించుచున్నాను.

సోమనాథుఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; ఆత్రేయసగోత్రుఁడు; సోమయామాత్యపౌత్రుఁడు; కోటీశ్వరభట్టారక పుత్రుఁడు. ఇతనికి "శారదాభరణాంక" యను బిరుద మున్నట్లు ఏత త్కవివిరచిత మగు విష్ణుమిత్రోపాఖ్యానపు గద్యమునందలి "నిఖిల విద్యానిరాంతక, శారదాభరణాంక, సకలవిద్వజ్జనవిధేయ" యనువాక్య మువల్ల దెల్ల మగుచున్నది. నిజముగ నితఁ డిట్టివిద్వత్కవిసార్వభౌముఁ డని యాతనిగ్రంథములే మొగంబులఁ జాటసమర్థంబై యొప్పుచున్న యది. ఈతనియింటిపేరు నివాసగ్రామము ననుసరించి 'కోటికెల పూఁడి' యనిపెట్టుకొనఁబడియుండును. ఇది యాంధ్రదేశజుల సంప్ర దాయమునకు వ్యతిరేకము గాదు. కోటికెలపూఁడి యనుగ్రామ మొ కటి గుంటూరుమండలమునందలి ఒంగోలుతాలూకాలోను, మఱియొ కటి కృష్ణామండలమునందలి నందిగామతాలూకాలోను నున్నవి. ఈ రెంట నెయ్యది సోమనాథుని నివాసగ్రామముగ నుండెనో తెలిసికొన నాధారము గానరాదు. ఇమ్మహాకవి విష్ణుమిత్రోపాఖ్యాన మను ప్రౌఢకావ్యము నొకదానిని రచించియున్నాఁడు.

ఈయుత్తమకావ్యమునకుఁ గొట్టుపల్లి (గుంటుపల్లి) తిప్పమంత్రి కృతినాయకుఁడై యంకితముఁ గొనియున్నాఁడు. తనకీగ్రంథము నంకి త మొనర్పఁ దిప్పన ప్రార్థించినవిషయము నీక్రిందిపద్యములవలనఁ గవి తనగ్రంథమునఁ దెలుపుడు సేసియున్నాఁడు;

మ. సరసాగ్రేసర! కోటనార్యునితనూజా! సోమ! విద్వత్పురం
దర! నీచాటునచాపవిజృంభణము లుద్ఘాటించు నర్థేందు శే

ఖరకోటీరకుటీరకోటరలుఠద్గంగోర్మిధారాశివం
కర ఘుంఘుంఘుమచక్రచంక్రమచమత్కారప్రగల్భార్భటిన్.

చ. కొటికెలపూఁడి సోమవిభుకోటయసోమ! సరస్వతీశిరః
కటకకిరీటరత్నఘటికామహనీయధగద్ధగప్రభా
పటలతిరస్క్రియాధిగతపాటవము ల్భవదీయవాక్యము
ల్కుటిలవిరోధియోధకవిలోకకఠోరవనీకుఠారముల్.

క. కావున నీవి త్తెఱఁగునఁ
గావింప నుపక్రమించు కావ్యము నాకున్
గావింపు మంకితముగాఁ
బ్రావీణ్యము మెఱసి కవిసుపర్వవరేణ్యా!

సోమనాథునికవితాప్రాగల్భ్యమున కీపద్యములునునిదర్శనములు

## కవి కాలము

సోమనాథుని కాలమును దెలిసికొనవలె నన్నచో విష్ణుమిత్రోపాఖ్యాన కృతిభర్తయగు గుంటుపల్లి తిప్పనామాత్యుని చరిత్రమును బరిశీలించినఁగాని తెలియబడదు. కావునఁ దిప్పమంత్రిని గుఱించి యించుక విమర్శింతము. ఈతిప్పమంత్రి యింటిపేరు తొలుతఁ "గాదేపల్లి" యనియుండి కాలక్రమమున నది "గుంటుపల్లి" గా మారినది. వీరునందవరవంశజులు. గుంటూరుమండలమునం దీగుంటుపల్లి వారు సుప్రసిద్ధులై, విద్యావితరణాది సుగుణవిరాజమానులై కీర్తి నార్జించియున్నారు. వారిలో వినుకొండ దండనాథపదవి నలంకరించి యాసీమను బరిపాలించిన ముత్తమంత్రియు, నాంధ్రదేశమున నాబాలగోపాలమునకు విప్రవినోదులచే జ్ఞప్తికిఁ దేఁబడుచున్న గుంటుపల్లి భాస్కరుఁడును, విద్యల భాస్కరుఁడును పేరెన్నికఁ గన్నవారు. తిప్పనతండ్రి తాతలందఱును నాకాలమున గుంటుపల్లి నగ్రహారముగాఁ బరిపాలన సేయుచుండిరి. ఈగుంటుపల్లి వినుకొండకుఁ బూర్వదిగ్భాగమున నున్నది. క్రమముగా వీరికి ముత్తమంత్రి కాలమున వినుకొండ పరగణాకు దండనాథ పదవి లభించినది. క్రీ. శ. పదునాఱవ శతాబ్దమున మల్కిభరామ పాదుషా

గోలకొండఁ బాలించుచుండెను. ఈమల్కిభరామునిఁ బొన్నిగంటి తెల గనార్యుఁ డీక్రిందిపద్యమున వర్ణించియున్నాఁడు.

సీ. తెలిపి సింగంపు గద్దియల రాతెఱగంటి
దొరలెల్ల మోడ్పుఁ జేతులనె కొల్వ
బూని యేఁబదియాఱు మానిసినెలవుల
పుడమితేండ్లూఁడిగంబులకుఁ జొరఁగ
ఠీవి మున్నీటిలో దీవులన్నియు నేలు
మన్నీలు మెట్టుఁ దామరల కెరఁగఁ
దన తేజసుడిగట్టు వెనుక చీఁకటి నెల్ల
విరియించుతమ్ముల నిదుగాఁగ
గీ. వెలయు మలికిభరామునిఁ గొలిచి......

యయాతి చరిత్రము.

ఈయిబ్రహీము పాదుశాహి క్రీ. శ. 1550—1581 వఱకు రాజ్యముచేసి యున్నాఁడు (ఆం.క.చ.ద్వి.భా. పుట 256) ఈతనికి సామంతుఁడై వినుకొండపరగణాను పాలించుచున్న రామలింగభాస్కరుఁడను నాతఁడు పైఁ బేర్కొనఁబడిన ముత్తమంత్రిని దత్తుఁడుగ స్వీకరించెను. క్రీ. శ. 1578—1589 (శా శ. 1500—1511) వఱకుఁ బరిపాలన కార్యమునందు ముత్తన తనదత్తుతండ్రికి సాయపడుచుండెను. (చూ. గుంటుపల్లి ముత్తమంత్రి చరిత్రము.) దీనినిబట్టి యాకాలమునకు ముత్తమంత్రి దాదాపు ఇరువదేండ్ల ప్రాయముగలవాఁడని యూహింప నవకాశముగలదు. ఈముత్తనపై ననేకులగు కవులు రచించిన చాటువులు గలవు. వాటిలో నొకటిరెండు మాత్రమిాక్రింద నుదాహరించుచున్నాను.

మ. శతమన్యుం డమరావతేలఁగ సురల్సత్రాలపాలైరి, సం
గతి బాతాళము శేషుఁడేలఁగ ఫణుల్గాలే వటించేది, యీా
క్షితి నీవేలఁగ వీరముత్త! మనుజుల్ప్రిగ్రంథము న్బువ్వులం
చితరాజాన్నములు న్దకూఁచయము లైకొందు రెల్లప్పుడున్.

శా. నావిద్వత్కవితా విశృంఖల వచోనైపుణ్య ధారాళధా
రావష్టంభ విజృంభణంబునకు నారా! వీరము త్తప్రధా
నావిర్భూత వితీర్ణి గల్గవలె, లేదా యన్యుల న్వేడనా?
ఛీ! వాచాలకటి! ఛీ! కవిత్వమ! చిఛీఛీయర్థ కాంక్షారతు.

ఉ. అంగ కళింగ వంగ మగధాదులు నెవ్వనివ్రాఁత కమ్మరీ
వింగనుపట్టి గుంటుపల్లి వీరయము త్తని వ్రాలు జూచితా
తెంగిలి ముచ్చుమంత్రు లిఁక నేటికి సిగ్గుమొగానఁ జేర్పరో
బంగరువంటి యాకులను బల్మరుగోరుదు రాత్మనామముల్.

ఈవదాన్య శిరోమణి, మహావీరుఁడు, దాశార్థ్య చరిత్రమను కృతికి నాయకుఁడు, దాతయునై కవులపాఁగ త్తల నజరామరంబగు యశశ్శరీరముచే నాంధ్రలోకమునఁ బ్రకాశించుచున్నాఁడు.

విష్ణుమిత్రోపాఖ్యానకృతిపతి తిప్పనకీము త్తన అన్నకుమారుఁడు. తిప్పమంత్రి యన్నయగు పెదవీరంరాజునకు గల నల్గురు పుత్రులలో ము త్తన మూఁడవవాఁడు. క్రీ. శ. 1578 వ సంవత్సరము నాఁటికి ము త్తన కిరువదేండ్లప్రాయము కలిగియుండునని పైనసూచించినదానిని బట్టి జనకస్థానముననీతనికిఁగల యిరువురన్నలయొక్కయు, నీతనితండ్రి పినతండ్రి (తిప్పమంత్రి) యొక్కయు వయఃపరిమితిని ఒక్కొక్కరిమధ్య మూఁడేండ్ల వ్యత్యాసముతో లెక్కించి తండ్రికిఁ గుమారునకు నడుమ నిరువదేండ్ల కాలముండునని నిశ్చయించినచోఁ బెదవీరంరాజు తమ్ముఁడగు తిప్పామాత్యుఁడు క్రీ. శ. 1535 వ సంవత్సరపు ప్రాంతమున నున్నాఁడని స్పష్టమగుచున్నది. కావున విష్ణుమిత్రోపాఖ్యాన కృతికర్త యగు సోమనాథుఁడును క్రీ. శ. 1535 వ సంవత్సరపు ప్రాంతమున నున్నాఁడని నిశ్చయింపనగును. ఒకవేళఁ బైఁ జెప్పఁబడిన కాలనిర్ణయము సరియైనది కాదనితలంచినను విష్ణుమిత్రోపాఖ్యానము 1580 సంవత్సరమునకుఁ బిమ్మట ననఁగా మనుచరిత్రమున కించుక తరువాతను వసుచరిత్రమునకుఁబూర్వమునను రచింపఁబడెననునది నిర్వివాదాంశము.

సోమనాథుఁడు గీర్వాణకవుల నుతించి, పిదపఁ గవిత్రయమును నాచనసోముని తనతండ్రియగు కోట సచివునిమాత్రము స్తవమొనర్చి యున్నాఁడు. చూడుఁడు:—

గీ. సాహితీధుర్యు నన్నపాచార్యవర్యు
నుభయకవిమిత్రు సుమనఃపయోజమిత్రు
శబ్దగుంభాధికోల్లాసు శంభుదాసు
సుకవి కువలయ గుణసోము సోముఁదలతు.

క. ప్రతిభట విద్వత్కవి సం
హాతికరటి ఘటామృగేంద్రు నస్మద్గురు నూ
ర్జిత నిర్జిత ఫణిపతి గీ
ష్పతి కొటికలపూఁడి కోటసచివునిఁ దలఁతున్.

సోమనాథుని తండ్రి కోటసచివుఁడును గొప్పపండితుఁడనియుఁ గుకవికుంజర ఘటాపంచాననుఁ డనియు దీనినిబట్టి విశదమగుచున్నది.

గ్రంథరచనము.

విష్ణుమిత్రోపాఖ్యాన మైదాశ్వాసములు గల ప్రౌఢకావ్యము. ఇందలియితివృత్త మొకపురాణగాథకు సంబంధించినది. ఇందుఁగథా భాగమున కెక్కువ ప్రాధాన్యము నిచ్చి సముచిత వర్ణనా సమంచిత ముగ సోమనాథుఁడు రచించియున్నాఁడు. రచనాపద్ధతి చాలదనుక మనుచరిత్రమునకుఁ బూర్వమునఁగల శ్రీనాథ పినవీరనాదులఫక్కి ననుసరించియున్నది. ఇతని కవనధాటి నిజమున "ఇందుశేఖర కోటీరకుటీర కోటరలుఠద్గగోర్మి ధారాప్రగల్భార్భటికిఁ" దీసిపోని రీతిని మిగులఁ బ్రౌఢమైయున్నది. శైలికఠినమని వేఱుగఁ జెప్పబనియుండదు. కావ్యమంతయు నారభటీవృత్తి ప్రాముఖ్యము వహించియున్నది. గ్రంథమంతయుఁ జాలదనుక సంస్కృతపద బంధురమై పెద్దనార్యుని మృదంగ నిస్వన సాదృశ్యమును దలపింపఁజేయుచున్నది. ఇందు నుపమాది ప్రశస్తాలంకారములు చిత్రింపఁబడియున్నవి. సోమనాథుని రచనాకౌశలము

లెఱిఁగింపఁగల గొన్నిపద్యముల నాతని విష్ణుమిత్రోపాఖ్యానమునుండి యిటనుదాహరించి దీనినిముగించుచున్నాను.

శా. ధరణీశాగ్రణి తారకాతరళ ముక్తారత్న చిత్రాతప
త్రరుచిర్వాత్రము దిగ్గరీవలదసూర్యాంశుశ్యా గాఢాంధ ను
స్మరమై సర్వశశాంకమండల సహస్ర శ్రీసముల్లాస త
త్పరమై పర్వఁగ నొప్పె సర్వజనదృగ్వ్యాపారపర్వంబుగన్ ౧౫

సీ. సమరట్ట ఘోట్టాణ సంఘట్టిత క్రోడ
ఖురపుటీవక సంక్షుభితమగుచు
పృథివీధర స్పర్ధి పృథురథ పరిథితప్ర
దారాభిఘాత మేదస్వి యగుచు
పటుతరోద్భట వీరభట చక్రవాళ
నిష్ఠురపదాస్ఫోటనస్ఫురిత మగుచు
గాఢకంధర సదృక్ష స్కంధ గంధ సిం
ధురకర్ణ తాళప్రరుళిత మగుచుఁ

గీ. దరుణదాశరకంఠ కందళకడార
మేదురాకార రణరంగ మేదినీప
రాగ నికురుంబ కంబంబరమున కెగసి
యర్కుఁ గబళించె రాహుగ్రహంబుఁ బోలె. ౨

ఉ. చందనశైలవాతకులిశక్షితిఁజే నతిఛిత్ర చైత్రసం
క్రందనుఁ డల్కమై నగ నగచ్ఛదగుచ్ఛము లుత్తరింప నం
దందసముద్భవిల్లు ఋద్ధిరావళిఁ బోలె వనంబులందు నా
నందము సంఘటించె నయనంబులకు స్తరుణప్రవాళముల్. ౩

మ. చటులాస్ఫోట తరాట్టహాస లహరీఝంపానిర్ఘాత ప
ర్యటన నాడంబర భిన్నదిక్తటకటాహక్రోడ వాఁ౦బుగా
నటనక్రీడ యొనర్చు కాలగళకకఠస్థాలకాళోలరు
ఘుటికాజాలము బద్వినట్లు నిగిడెన్ ఘోరాంధకారచ్ఛటల్ ఆర

చ. తనమది విష్ణుగుప్తుఁడు పదంపడి యచ్చెరువంద నందివా
హన, సరసీరుహాసన, బలాసురశాసన పావకేనసం
దన, దనుజాబ్ధినాయక, సదాగతి వైశ్రవణాది దేవతా
జనసహితంబుగా నసురశత్రుఁ డదృశ్యత నొందెనంతటన్. ఆ 2

మచ్చునకుఁగా సోమనాథుఁ డాంధ్రశబ్దబాహుళ్యముగ రచించిన సీసపద్యము నొకదాని నీదిగువ నుదాహరించుచున్నాను.

సీ. జిగిమీఱు నడుఁగు లేఁజిగురు నిబ్బర్పఁపుడా
లెరసంజ కెంజాయ కెదురుసూప
క్రొక్కారుమెఱుఁగు నిగ్గులకు సిగ్గులుగుల్క
మెయితళ్కు లపరంజి మిసిమి జిల్క
నవయవంబులతావు లచ్చంపు పచ్చక
ప్పురపు వాసనలకు బిరుదుగట్ట
సొలపుటల్లార్పుచూపుల దువాళములు చూ
పులవింటిజోదు తూపులనదల్ప

గీ. వివిధభూషణ భూషణ భవదగణ్య
పుణ్యలావణ్యరూప నై పుణ్యలగుచు
కౌశికద్వార వేదికాంగణము లందు
నిర్జరాంగన లేతెంచి నిలచిరపుడు

ఈతని వేఱొకకృతి ప్రబంధవల్లరియందే ప్రకటితమైనదని విని యున్నాఁడను. కాని నాకది లభింపలేదు. లభించినప్పు డనుబంధముగా నందలివిషయములఁ బ్రకటించెదను.

గుంటుపల్లి ముత్తమంత్రి శాసనములు శా. శ. 1528–1530 (క్రీ. శ. 1606–1608) సంవత్సరములలో గుంటూరుమండలమునఁ గన్పట్టుచున్నవి. ఇందు మొదటిశాసనములో ముత్తమంత్రి మల్లికార్జున పండితారాధ్యుని వంశములోనివాఁడైన రామలింగగురుని శిష్యుఁ డని యున్నది. రెండవ శాసనములో గుంటుపల్లి భాస్క

రయ్య పేర క్రోసూరునందు బజారును నిర్మించుటకు జెమార్దా నాగన్నకు కౌలునకిచ్చినట్లున్నది. ఈభాస్కరయ్య ముత్తమంత్రి కుమారుండనుటకు సంశయింపం బనిలేదు. ఈశాసనమునందు రాజాధిరాజ మహారాజశ్రీ గుంటుపల్లి ముత్తమంత్రి అనియున్నది.

ఈగుంటుపల్లి వారినిగూర్చి చింతగుంట కోదండరామకవి చారితమున మఱికొన్ని విషయములు వ్రాయందలఁచి యిటనదలితిని. ముత్తమంత్రికిఁ క్రీ. శ. 1608 నాఁటికి 60 వత్సరముల వయసుండునని తలఁపవచ్చును. అయిన నాతని జననము 1560 ప్రాంతమగును. ఆతనికి జనకపితయైన తిప్పరాజు 1510 ప్రాంతమున జన్మించి తనముప్పదియవయేటననఁగా 1540 ప్రాంతమున విష్ణుమిత్రోపాఖ్యానమును గృతినొందియుండు ననుటకు సంశయములేదు. ఈగ్రంథము నాకు లభింపలేదు. తిప్పరాజు కుమారుల నందు వర్ణించెనో లేదో ముత్తమంత్రి దత్తస్వీకార మందుదాహృతమయ్యెనో లేదో చెప్పఁజాలను.

ఆగ్రంథమును జదివి యుందేమేని విశేషాంశములు గనుపట్టిన మున్ముందు అనుబంధమునఁ బ్రకటించెదను.

## 159 తులసి బసవయ్య

ఇతఁడు సావిత్రి కథను ప్రబంధముగా రచియించెనఁట! రామాపెద్దిగడ జగ్గనకవి యాగ్రంథమందలి యిరువదియైదు పద్యములను తన ప్రబంధరత్నాకరమున సమకూర్చెనఁట. శ్రీప్రభాకర శాస్త్రిలుగారా పద్యములను ప్రబంధ రత్నావళిలోఁ జేర్చినారు. అందలి పదిపద్యముల నీక్రిందఁ బొందుపఱచుచున్నాఁడను. ఇంతకంటె కవినిగూర్చి. లేశమును దెలియ లేదు.

సీ. సంతతి లేని సంసారంబు నిస్సార

మొగి నర్భకులు లేనియొప్పుతప్పు

కొడుకుతోఁగూడని కూడు కీడుఁ తనూజు
లెపుడు క్రీడింపని యిల్లుపొల్లు,
పుత్రరత్నములేని భోగంబు రోగంబు,
తనయుఁగాననిదాని తగవు నగవు
పిన్నబిడ్డలులేని పెక్కువ తక్కువ,
సూనుహీను సోఁకనిమేను మాను

గీ. కానయెబ్బఁగినైన సంతానలబ్ధి
కాననగు బ్రోవఁబరికించి కానవలయుఁ
గాని యూరకయున్కి యుక్తంబుకాదు.
జగతిసంతతిలేకున్న జన్మహాని.

ఉ. పోకులఁబోయి యన్యసతిఁ బొందినవాఁడు శదాకళంకి, దో
షాకరుఁ డుగ్రమూర్తి సముదగ్ర విషాగ్ని సహోదరుండు ప
ద్మైకవిరోధి సంతత జనార్తుఁడు మాసరిగాఁ డటంచు ను
త్సేకముతోడ రాజు నిరసింతురు రాజకుమారు లప్పురిన్.

చ. పనివడి పాకశాసను నెపంబునఁ బంకజ సంభవుండు నీ
తనువుఁ దొలంగఁజేసె నతిదారుణశాంభవరోష వహ్నిచే
మనమున నాఁటియాగ్రహము మానకనీవును సంఘటించితా
ఘనునిశిరంబుఁ దుంచుతమకం బితరుల్ దెలియంగ నేర్తురే.

గీ. గగనలక్ష్మినఘూటికిఁ గలశవార్ధి
యెలమితోడ నుపాయనం బిచ్చినట్టి
కొత్తకట్టాణి ముంగఱముత్తె మనఁగఁ
జూడనొప్పారి వేగురుఁజుక్క వొడిచె.

ఉ. మాయపుఁదుంటవిల్తు వెడమాయుల మానినులార పాణముల్
వోయెడు నాఁడునాఁటి కీఁకఁబోవిడుఁ డీయలుకల్ నిజేసులన్
బాయకుఁడీ యటంచుఁ బరిభావలఁ జాటెడుభంగిఁ గొక్కొరో
కోయని కూఁత వేసెఁ దొలికోడి పురాంతర గేహదేహళిన్.

ఉ. అన్నగరంబు హర్మ్యములయందు ఘటించిన పద్మరాగర
త్నోన్నత కాంతిమండలము లొక్కమొగిన్ జదలేటఁ బర్వినన్
కిన్నరకాంత లాత్మఁ దలకింతురు జంబునదీప్రవాహ మి
ట్లెన్నఁడు వచ్చె నింగికని యెత్తినసంశయ సంభ్రమమ్ములన్.

క. హరితురగము నరుణాంగుని
హరులుం గవగూడెనేని యగు సరిలేదా
సరిగావని యితర హయో
త్కరముల నగు నప్పురమునఁ గలహరులెల్లన్.

చ. ఉరగవధూజనంబులు పయోధర సంభృత కుంకుమాంకముల్
గరఁగ నిరంతరంబు నవగాహన మర్థి నొనర్చుచుండఁగా
నరుణరుచిం గనుంగొనఁగ నందమగుం బరిఖాంబుతోయ మ
ప్పురి దనఘోరవీరరసముం బ్రకటించుచు నున్నకైవడిన్.

చ. కరుణదలిర్ప నిన్ గుటిలుఁగా మక్షిఁ జూడక జూటకోటిలో
నిరుపమలీలఁ జేర్చికొని నెమ్మది నున్నపురారిఁ బాండుర
స్ఫురితశరీరుఁ జేసితివి కంతునివైరమునఁ బట్టియక్కటా!
సరసిజవైరి! యీవిసవుజాతికిఁ బాంధవధంబు పెద్దయే!

ఈకవికాలము క్రీ. శ. 1560 ప్రాంతమునకుఁ బూర్వమనుట కంటె నిక్క మేమియుఁ దెలియదు.

---

## 160 కలిదిండి భావనారాయణకవి

ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; సాలంకాయనగోత్రుఁడు; ఇతనితండ్రి వెంకటాద్రి; తల్లి సూరమాంబ; తాత మంత్రిరాజు. ముత్తాత రాచయమంత్రి.

ఈతఁడు విష్ణుపురాణమందలి నాలుగంశలను నాలుగాశ్వాసములుగా నాంధ్రీకరించి, జగన్నాథస్వామి కంకితము చేసెను. తననుగూర్చి కవి యాగ్రంథమునందిట్లు చెప్పుకొనియున్నాఁడు.

సీ. సమధికస్ఫూర్తిఁ గృష్ణాగౌతమీమధ్య
దేశంబునకు భవ్యతిలకమగుచుఁ
బొగడొందు కలిదిండి పురమునకధిపతి
సుగుణుఁ డాపస్తంబసూత్రుఁ డధికుఁ
డసమసాలంకాయనసగోత్రుఁ డడవిరా
చయమంత్రి వెలయు నయ్యలఘుమతికిఁ
దనయుండు మంత్రిరాజనఘుఁ డాతఁడు గాంచె
విమలచారిత్రుని వేంకటాద్రి,
నమ్మహాత్మునకును సూరమాంబికకును
నందనుఁడఁ బూరుషోత్తమ నాథపాద
వందనానంద మహితజీవాతుజీవ
నాథ్యుఁడను భావనారాయణాభిదుఁడను.

ఈపద్యమునుబట్టి యీకవివంశమువారు కలిదిండి గ్రామమునకుఁ గరణములనియు, నందుచే నీతఁడు గలిదిండిభావనారాయణ యని పిలువఁబడుచుండెననియు, వీరిగృహనామము, అడవివారనియుఁ దెలియుచున్నది. అడవివారు నియోగిబ్రాహ్మణులలోనున్నారు. వారును సాలంకాయన గోత్రులే.

కలిదిండియను గ్రామము కృష్ణామండలములోఁ గైకలూరు తాలూకాలోనున్నది. ఇది బందరు పట్టణమునకు సుమారు రిరువదిమైళ్ళ దూరమునఁ గలదని విష్ణుపురాణ వీఠికాకారులు వ్రాసియున్నారు. గుడివాడ కీశాన్యమూల 21 మైళ్ల దూరములోఁ గలిదిండి యున్నదనియు నచ్చట మహమ్మదీయులచేఁ గట్టఁబడిన మట్టికోట గలదనియు స్వ్యాయల్ పండితుఁడు వ్రాసియుండెను. (సం 1 పుట 52)

ఈకవి వైష్ణవమతాభిమానము కలవాఁడని యీక్రింది సీసపద్యములో, వైష్ణవాచార్యులను భక్తులను గొనియాడుటచేఁ దలంపనగుచున్నది.

సీ. పూర్ణభక్తి భజింతుఁ బోయిగపూదత్తపే
యాళువారుల చరణాంబుజములు
సేవింతుమదిలోన శ్రీభక్తిసార భ
ట్టాధిప కులశేఖరార్యవరులఁ
బ్రణుతింతు మునివాహభక్తాంఘ్రిరేణుద్వి
పద్దండధరుల నిశ్చలమనీష
వరిపస్యగూర్తు మధురకవి శఠగోప
భావ్యకర్తలకు సౌభాగ్యరేఖ
గీ. నాథయామున మునికూరనాథపుండరీక
దృగ్రామ మిశ్రాది లోకవిస్రు
తాద్యగురు సంఘములకు సాష్టాంగనతులు
సేయుదు మదీయకృతికి మేల్సేయుకొఱకు.

ఈకవికి వాధూలస గోత్రుఁడైన కందాళ భావనారాయణ కుమారుఁడగు శ్రీరంగగురుఁడు, గురువైన ట్లీక్రిందిపద్యములో వర్ణించియున్నాఁడు.

సీ. తనకు మ్రొక్కిన మ్రొక్కు జనురనోకహావిని
ర్దళన ప్రచండ పరశ్వధంబు
తన సేవ పాతకోదక గభీరత్వ దు
స్తర సంసరణ వార్ధితరణ తరణి
తన శ్రీమదంఘ్రితీర్థము ముక్తిసామ్రాజ్య
పట్టాభిషేక సంభారజలము
తనసంశ్రితక్షణము సౌధాయిత మహనీయ
కైవల్య నిశ్రేణి కాశ్రయంబు
గీ. గాఁగ వాధూలగోత్ర సాగర శశాంక
భావనాచార్య తనయుఁడై ప్రబలు నపర
హరిని కందాళ శ్రీరంగగురుని
మద్గురుని భజింతు నభీష్టార్థయాప్తికొఱకు.

ఈకందాళ శ్రీరంగగురుఁడే, సుదక్షిణా పరిణయ కృతికర్త యగు తెనాలి యన్నయకును, హరిభట్ట కృత నరసింహపురాణ కృతిపతియగు రంగన మంత్రికిని గురువై యున్నాఁడు. కావున నీకవి వారితో సమకాలికుఁడు. ఈ శ్రీరంగగురుఁడు తిరుపతి దేవస్థానమునం దాచార్య పురుషుఁడై శ్రీ వేంకటేశ్వర స్వామికి 1500 పణము లర్పించి క్రీ. శ. 1545 సంవత్సరము జూలై నెల 5వ తేదీని శిలాశాసనము వేయించినాఁడు. కావున భావనారాయణకవి యాకాలము వాఁడనుటకు సంశయము లేదు.

ఇతఁడు జగన్నాథమందలి సుభద్రాదేవి కరుణాకటాక్ష వీక్షణ లబ్ధ కవితాధార కలవాఁడనని గద్యయందుఁ జెప్పుకొనియున్నాఁడు. సంస్కృతమున నాఱంశములుగల విష్ణుపురాణములోని నాలుగంశల నితఁడాంధ్రీకరించెను. వెన్నెలకంటి సూరన్న యెనిమిదాశ్వాసములలో నాఱంశలను దెనుఁగుచేసెను. భావనారాయణ కవిత్వము సర్వవిధముల నుత్తమమయినదే. కాన సూరనార్యుని కవిత్వముతో తులతూగదు. భావనారాయణ కవిత్వమునందచ్చటచ్చట వ్యాకరణ దోషములు గన్పట్టుచున్నవి. కాని యవి యనేకుల కవిత్వమునందును గన్పట్టుచుండుటచే నజ్ఞానకృతములు గావనియు, మాధుర్య రసాధిక్యములను తలంపున నట్టివి కవి ప్రయోగించియుండుననియుఁ దలంపవలసి యున్నది.

ఈగ్రంథమును మదరాసు విశ్వవిద్యాలయమువారు తమ విద్యాలయమందలి పండితులు రచించిన విపులమగు పీఠికతో ముద్రింపించి యున్నారు..

ఈకవి పురుషోత్తమఖండమునుగూడ నాంధ్రీకరించి యున్నట్లీక్రిందిపద్యములో నుడివియున్నాఁడు:

గీ. ఘనత శ్రీపురుషోత్తమఖండ మాంధ్ర
నవ్యపదబంధములఁ బ్రబంధంబు చేసి

యెన్నఁగల దైవమొయున్న వెన్నముద్ద
ముద్దుకృష్ణున కంకితంబుగ నొనర్చి.

ఈగ్రంథమున జగన్నాథక్షేత్ర మాహాత్మ్యము వర్ణితమైనట్లు కనుపట్టుచున్నది. ఇది నామావశేషమయినది. ఈకవి విష్ణుపురాణము నందు, జగన్నాథక్షేత్రమునందు నొక గోసాయి నీక్రింది పద్యమున సంస్మరించియున్నాఁడు.

మ. దినమున్ శ్రీపురుషోత్తమాధిపతికిం దేదీప్యమాన ప్రసూ
నన వోద్యద్వనమాలికా ఘనవిమానంబుల్ సమగ్రంబులై
తనరన్ గోటులు క్షేత్రరాజమునఁ జెంతన్నిల్పి యుప్పద్మలో
చనుఁడే తానగు రామకృష్ణభటుగోసాయిం బ్రశంసించెదన్.

నరకృతిసేయుటకంటెఁ బరమేశ్వరునకే కృతి నర్పించుట శ్రేష్ఠమనియుఁ దప్పులను విడచి యొప్పులను గైకొనుటయే సత్కవి లక్షణమన్నియు రెండుపద్యములను జెప్పియున్నాఁడు.

చ. సరసతయున్ మృదుత్వమును జక్కదనంబు నలంక్రియాపరి
స్ఫురణముగల్గి శ్రీవిభునిఁ బొందినచోఁ గృతి సాధ్వియందు రా
సరసతయున్ మృదుత్వమును జక్కదనంబు నలంక్రియాపరి
స్ఫురణముగల్గియుం బరులఁ బొందిన దుష్కృతియందు రెండునన్.

ఉ. లాలితకావ్యసీమ నొకలక్షణ మొప్పక యున్న సత్కవుల్
మేలుగ్రహింపఁ గోరుదురు మించిన సత్కృపఁ గాకవుల్ గడున్
బ్రేలుదురింతెగాక సవరింపఁగ నేర్తురె యంచయైవడిన్
బాలును నీరునేర్పఱచు పాకము కాకము పొందనేర్చునే.

ఈతని కవిత్వశైలి తెలియుటకై విష్ణుపురాణమునుండి నాలుగు పద్యముల నుదాహరించుచున్నాఁడను.

చ. అనిశము నిత్యకర్మపరులై విజితేంద్రియులై వినిష్టు వ
ర్తన ఋతుకాలదార నిరతత్వమునొంది దయార్ద్రులై మనం

బున పరహింసమాని జనపూజ్యతనొందు గృహస్థులొందునా
రనుపమమైన బ్రహ్మనిలయంబు వినిర్మల ధర్మవిత్తమా. ౧ఆ

శా. ఖ్యాతిం దూర్పునసూడి దక్షిణదిశాపత్యగ్రిశోదగ్దిశా
స్ఫీతద్యోత వితానుఁడై పటుధనుఃక్షిప్తాశుగాశుక్రియల్
చేతోమోదముగాఁ బ్రదక్షిణముగాఁ జిత్రస్థితిం ద్రిమ్మరన్
జ్యోతిశ్చక్ర సమేతుఁడై యెపుడు ఖద్యోతుండు విప్రోత్తమా! ౨ఆ

మ. జననాథోత్తమ! చెప్పెద న్వినుసదాచారంబు నిత్యంబు స
జ్జను లత్యాదృతి నాచరించుట సదాచారం బనం జెల్లు స
జ్జనసంజ్ఞల్ మనువుల్ ప్రజాపతులు నాస ప్తర్షులుం జువ్వె త
ద్వినుతాచార పరాయణుండు గను శీవన్ రెండులోకంబులున్. ౩ఆ

ఉ. తామసుఁడై యకాలము గదాయని యెంచక మించినీదుమా
తామహుఁడల్లి యచ్చె నతిదారుణశాపము నీవు నాజరా
భూమికపూని నాకొసఁగు భోగ్యభవన్నవ యౌవనంబు ని
త్యామిత భోగముల్గని సహస్ర సమాప్తిగ నిత్తుఁ గ్రమ్మఱన్. ౪ఆ

ఈకవికాలము క్రీ. శ. 1520—1580 అని 'గుటికబారెడు' న్యాయమున నిర్ణయింపవచ్చురు. ఇతఁడు జగన్నాథస్వామి భక్తుఁడు. ఇతని కవిత్వము కదళీపాకమున మనోహరమై యొప్పారుచున్నది.

ఈకవి గృహనామము కలిదిండివారని యెప్పుడు మారినదో తెలియదు. ముత్తాత కాలమునాఁటికి "అడవివారే", గోదావరిమండలమునఁ బట్టభద్రులై యుపాధ్యాయులుగానున్న అడవి శంకరరావుగారి నీవిషయమై కనుగొనఁగాఁ దమపూర్వులు కలిదిండి నివాసులేయనియు అడవి, మోచర్ల యను గ్రామములు నెల్లూరు మండలములో నున్నవనియు, అడవిగ్రామమునుండి కలిదిండి వచ్చిరనియుఁ జెప్పిరి. కలిదిండి యను గృహనామము కలవారు పశ్చిమగోదావరి మండలమున నియోగి బ్రాహ్మణులు పెక్కురున్నారు.

భావనారాయణ కవికృతమైన విష్ణుపురాణ తాళపత్ర ప్రతియొకటి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందున్నది. ఆగ్రం

థాంతమునఁ బ్రతివిలేఖకుఁ డిట్లు వ్రాసికొనియుండెను.

“ప్లవనామసంవత్సర నిజఫాల్గుణ శు 3 సోమవారం రోజుసర్కి ......... కందాళం అప్పడు వ్రాసి విన్నకోట జగ్గన్నకు అత్యంతస్నేహపూర్వకంగా యిచ్చెను.”

ప్రతివిలేఖకుఁడిచ్చిన కాలమునుబట్టి విష్ణుపురాణ రచనాకాలమింతకన్నఁబై సునిశ్చితముగాఁ దెలియునేమో చూడవలసియున్నది. గ్రంథములో కందాళం శ్రీరంగాచార్యుల నామ ముదాహృతమైయుండుటచే క్రీ. శ. 1500 కుఁ బూర్వము గ్రంథము రచితముకాలేదనుట స్పష్టము. స్వామికన్నుపిళ్లెగారి పంచాంగము ననుసరించి—

| | | | | | |
|---|---|---|---|---|---|
| (౧) | 5—3—1481 | మొదలు | 19—3—1482 | వఱకు | ప్లవ |
| (౨) | 2—3—1541 | ,, | 17—3—1542 | ,, | ,, |
| (౩) | 25—3—1601 | ,, | 14—3—1602 | ,, | ,, |
| (౪) | 21—3—1661 | ,, | 10—3—1662 | ,, | ,, |
| (౫) | 17—3—1721 | ,, | 8—3—1722 | ,, | ,, |
| (౬) | 25—3—1781 | ,, | 15—3—1782 | ,, | ,, |
| (౭) | 1841 | ,, | 1842 | ,, | ,, |
| (౮) | 1901 | ,, | 1902 | ,, | ,, |

ప్లవసంవత్సరము లీవిధముగా నున్నవి.

ఇందులో మొదటిప్లవకంటెఁ బూర్వపు ప్లవనాఁటికి గ్రంథమే రచితముకాలేదు. కావున నంతకుఁ బూర్వపుప్లవలతో మనకుఁ బని లేదు. మొదటిప్లవనాటికిఁ గూడ విష్ణుపురాణము రచితము కాలేదు. ఆప్లవలో నాషాఢమాస మధికమైనది. కావున మనకాప్లవతోను నావశ్యకములేదు. రెండవప్లవలోఁ జైత్రమాసమధికమైనది. తక్కిన యాఱుప్లవలలోను నధికమాసములు లేనే లేవు. కావున నీరెండవప్లవను గూర్చితప్ప తక్కిన ప్లవలనుగూర్చి యాలోచింపనక్కఱలేదు. జ్యోతిషసిద్ధాంతమున ననుసరించి, మార్గశిర, పుష్య, మాఘ, ఫాల్గుణము లెప్పుడును నధిక సములు గారావు. అట్టిచో నీవిలేఖకుఁడు నిజఫాల్గుణము

అని యెట్లువ్రాసెనో తెలియకున్నది. ప్లవలోను ఫాల్గుణమాస మధికము లేకపోవుటచే విలేఖకుఁడు సంవత్సరమో, మాసమో పొరపాటుపడి యుండునని యూహకలుగుచున్నది.

అధికమాస గణనములో సిద్ధాంతులలో భిన్నాభిప్రాయములు గలుగుచుండుటకూడ పరిపాటియైనది. ఆషాఢమధికమని కొందఱును శ్రావణమధికమని కొందఱును వాదించుట మన మెఱుఁగుదుము. అట్లే ప్లవసంవత్సరచైత్ర మధికమని కొందఱును, శార్వరి సంవత్సర ఫాల్గుణ మధికమని కొందఱును క్రీ. శ. 1542 లో సిద్ధాంతులభిప్రాయపడిరేమోయని యొకయూహ గలుగుచున్నది.

స్వామికన్నుపిళ్లగారి పంచాంగము ననుసరించి, ప్లవ సంవత్సర అధికచైత్ర శుక్ల తృతీయ సోమవారమే యైనది. అది శార్వరి సంవత్సర నిజఫాల్గుణ శుక్ల తృతీయగా విలేఖకుఁడు భావించెనేమో!

ఈచర్చ కొనసాగించుటవలనఁ బ్రయోజనము కాన్పింపదు. ప్లవసంవత్సర ఫాల్గుణ మధికమగుట యసంభవము. విలేఖకుని వ్రాఁతలోఁ బొరపాటుకలదని భావించి, కాలమును నిర్ధారణము చేయఁబూనుట వృధాయాసము.

ఈవిలేఖకుఁడు ప్రసిద్ధాచార్య పురుషుఁడైన కందాళం అప్పలాచార్యులై యుండుననియు, నీతఁడే పాండురంగ మహాత్మ్యకృతిపతి యైన విరూరి వేదాద్రికి గురువనియు అణ్ణయాచార్యుని తనయుఁడనియు నేనూహించుచున్నాఁడను. నాయూహ సత్యమయ్యెనేని పై కాలనిర్ణయమును బాధింపదు.

---

## 161 ఎలకుర్తి రామరాజు

ఈకవి "రాజహంస రథాంగ శ్రీరామలింగ" యను మకుటముతో నొక సీసపద్యశతకమును రచియించినట్లు రామాప్రెగ్గడ జగ్గన తన ప్రబంధరత్నాకరమునందుదాహరించిన యీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

సీ. గంగాప్రవాహంబు కన్నె గేదఁగి ఱేకు
   నమృతాంశురేఖ ముత్యాలసేస
యురగేంద్రహారంబు కురువిందములపేరు
   విసము కప్పురముతో వీడియంబు
ప్రాఁతకంకటికాలు పంకసంజాతంబు
   జింకపిల్లయు రాచచిలుకబోద
యిభచర్మ చేలంబు నింద్రగోపప్రబ్బు
   భూతిపుంజము నవ్యపుష్పరజము
హేమగోత్ర కోదండంబు విక్షుధనువు
గలుగునర్ధనారీశ్వరాకారమునను
భువనజాలంబు భక్తులఁ బ్రోవుమయ్య
రాజహంసరథాంగ శ్రీరామలింగ.

ఈకవి రామాప్రెగ్గడ జగ్గనకంటెఁ బూర్వుఁడు. అనఁగా క్రీ. శ. 1560 సంవత్సరమునకుఁ బూర్వుఁడు. శతకమొచ్చటను లభించుటలేదు. కవి వివరము లేమియుఁ దెలియవు.

కృష్ణామండలమునందలి బందరు (మచిలీపట్టణము) నకు సమీపములో ఎలకుఱ్ఱు అనునగ్రహారమున్నది. అందు "ఎలకుర్తి" వారు ఆరాధ్య నియోగి బ్రాహ్మణులున్నారు. ఈకవి యావంశములోనివాఁడేమో! ఈతఁడు రామలింగేశ్వరునిమీఁద శతకమును రచియించియుంట నారాధ్యుఁడేమో యనియు రామరాజనామమునుబట్టి యారాధ్యుఁడు కాఁడేమోయనియు సంశయము గలిగుచున్నది.

---

## 162 జైతరాజు ముమ్మయ

ఈకవి చరిత్ర మించుకేనియుఁ దెలియలేదు. రామాప్రెగ్గడ జగ్గన, ప్రబంధరత్నాకరమునందును, ఆంధ్రసాహిత్య పరిషత్తునందున్న యుదాహరణ గ్రంథమునందును, ముమ్మయకవి "విష్ణుకథానిధానము లోనివిగా నుదాహరింపఁబడినట్టివి యించుమించు నలువది పద్యములు

ప్రబంధరత్నావళిలోఁ బ్రకటితములైనవి. విష్ణుమాయానాటకములోని కథలే యిందుఁ జెప్పబడినవేమో! ఈగ్రంథము లభించుటలేదు. గ్రంథవిస్తరభీతిచే నందలి పది పద్యముల నిట నుదాహరించుచున్నాఁడను. కవిత్వము సరసమై నూతనభావములతో నొప్పారుచున్నది

చ. వలపెటువంటిదో ముసలివాఁ డనవచ్చునె! యద్దిరయ్య! ప
ల్కుల జవరాలు దాఁ జదువులోన జపంబులలోనఁ బాయ ద
గ్గలముగ నెల్లప్రొద్దును మొగంబునఁ గట్టినయట్లు యుండు నీ
వలువకు నంచుఁ గాముకులు నవ్వవిధాత శుభంబు లీవుతన్.

చ. వెనుకకుఁబోక యీ యనక వేసటఁబొందక పంక్తిపంక్తికిన్
బెనుపక కానమిన్ బ్రిమసి బెగ్గిల కంతయు మున్నచూచుచున్
కనుఁగొని యక్షరాక్షరము కందువ దప్పక యేకచిత్తుఁడై
యనుపమ భక్తితోఁ జదువునాతని వాచకుఁడంద్రు భూవరా!

శా. ఆహా! కావ్యము మేలు మేలనమి యన్యాయంబు వో శారదా!
ద్రోహంబేటికిఁ గట్టుకోనుచు సంతోషించునట్లుండు న
య్యూహాదుల్ విని సత్కవీంద్రుఁ డితరుండొచ్చెం బపేక్షించు సం
దేహించుం దనసొమ్ము పోయినగతిన్ దీనత్వముం బొందుచున్.

చ. అమృతమువంటి తల్లి కమలాసను పట్టపుదేవి వేదశా
స్త్రముల విహారభూమి కలప్రాణులకెల్లను పల్కుఁదోడు వి
శ్వమున సమస్తవిద్యల విశారద శారద నాదువక్త్రప
ద్మమున వసించి మత్కృతిఁ జమత్కృతి పట్టుగఁ జేయుఁ గావుతన్.

చ. తమకముతోడఁ దల్లియును దండ్రియు నొక్కట ముద్దువేడ సం
భ్రమమున వచ్చి తల్లిముఖపద్మముఁ దండ్రిముఖంబులైదు వే
గమ తన యాఱుమోములను గైకొని ముద్దిడు మేటివేలుపుం
గొమరుఁడు నాదువాణికి నకుంఠిత శబ్దము లిచ్చుఁగావుతన్.

ఉ. పూర్వకవీంద్రులం గొలుచు పూనికి నిప్పటివారిఁ గొల్తు ని
ర్గర్వత నిక్కవీంద్రులు పురాణకవీంద్రులకంటెఁ దక్కువే?

యర్థిని నేఁటివారగుట యొచ్చెమెః నేఁడును దామ్రపర్ణిలోఁ
బూర్వపు ముత్తియంబులను బోలినమౌక్తికరాజి లేదొకో?

క. సుత్యుఁడుఁ దటాకము దేవా
యతనము నల్లిల్లు నిధియు నారామము స
త్కృతియు ననుసంతతులయం
దతిశయము ప్రబంధమెపుడు నక్షయమగుటన్.

సీ. చనుఁగవఁ బయ్యెద జాఱంగ జాఱంగఁ
గరమూలములనంటఁ గదిమి కదిమి
వేసలి వెడ్డెవెడ వీడంగ వీడంగ
నెలమిమూఁపునఁ జాల నిఱికి యిఱికి
మదుటిపై నలకలు సెదరంగఁ జెదరంగ
నల్లన ముంజేత నదిమి యదిమి
పొడతెంచు చెమటలు పొదలంగఁ బొదలంగ
నడరు నూర్పులచేత నడఁచి యడఁచి

గీ. చన్నులును జేతికలశంబు సరసమాడ
నవ్వు నమృతంబుఁ దమలోన నవ్వులాడ
సిగ్గుతమకంబు వినయంబుఁ జెంగలింప
వెలఁది యమృతంబు వడ్డించె విబుధతతికి,

సీ. ఉత్తుంగ కర్కశవృత్తస్తనంబుల
నద్వైతభావన యతిశయిల్ల
నత్యంత శూన్యతాయత్తమధ్యంబున
నాస్తికతత్త్వంబు విస్తరిల్ల
స్నిగ్ధారుణారుణ ముగ్ధాధరంబున
బాహ్యాకరా పూర్వశోభ దొలఁక
విట్టమనో విదళనస్ఫుట కటాక్షంబుల
భేదసిద్ధాంతంబు పెంపుమీఱ

గీ. మేనవై శేషికప్రభ గానఁబడఁగ
నొప్పుదురు వారకామిను లిప్పురమునఁ
దలఁపఁ గేవల కామశాస్త్రంబె కాదు
నిఖిలశాస్త్రంబులును నిందు నెగడుననఁగ.

సీ. లసదురస్స్థలమునఁ బసనైన గళమున
విలసితలీల శ్రీ నిలిపినారు,
చరణాంబుపట్టున జడలలో చుట్టిన
ననువొందఁ గాగంగ నులిచినారు,
భవ్యగుణంబున దివ్యదేహంబున
నొఱపుమీఱఁగ భూతి మెఱసినారు
తిరముగా మూఁపున గర మొప్పురూపునఁ
బొలుపొందఁగా ధాత్రిఁ బూనినారు,

గీ. తెల్లగలయిండ్ల నిలిచి వర్ధిల్లినారు
ఇరువు రిరువుర భార్యల నేలినారు
పెక్కు మొగముల కొడుకులఁ బెనిచినారు
హరిహరులు వీరు సర్వలోకాధిపతులు.

---

## 163 చెందలూరి చిక్కయ్య

ఈతఁ డేకాలమువాఁడో, ఏకులమువాఁడో, ఎచ్చటివాఁడో ఏమియుఁ దెలియదు. ప్రబంధరత్నాకర కర్తయగు రామాప్రెగ్గడ జగ్గనసేకరించినవానిలో చెందలూరి చిక్కయ నాసికేతోపాఖ్యానము లోనివని యీక్రింది పద్యములు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే ప్రబంధరత్నావళియం దుదాహరింపఁబడినవి.

సీ. అమృతోపమానంబు లగునన్నములతోడఁ
బహువిధశాకసూపములతోడఁ
బాయసాపూప జాంబాలికఁబులతోడ
విమల హయ్యంగ వీనములతోడ

పాడబంబులతోఁ రసావళ్లతోడను
ఘనశర్కరా పానకములతోడఁ
గదలికాద్రాక్షాది మృదుఫలంబులతోడ
వడియాలతోడఁ బచ్చడులతోడ

గీ. బ్రికటముగ దుగ్ధమథితతక్రములతోడఁ
బ్రియము తళుకొత్త షడ్రసోపేతము గను
భాసురంబుగ నారగింపంగఁ జేసె
వారఘుత్తోణివిభుఁడు బ్రాహ్మణుల నెల్ల.

సీ. ప్రాలేయకిరణ బింబస్ఫూర్తిఁ దలపించు
విశదంపుఁదనుకాంతి దిశలు ప్రాఁక
జిగినిండఁ దొలఁకెడు చిగురుటాకుల సొంపు
వాటించు ఘనజటాభరము మెఱయఁ
గాంచినమౌంజీవికాసంబు గెడగూడి
చెలువుపూపుచు మృగాజినము దనరఁ
గమనీయ కోమల కరపయోరుహామునఁ
బ్రకటితంబగు విపంచిక దలిర్ప

గీ. హారికథాలాప శోభితమైనయట్టి
యాననమ్ము ప్రసన్నత నలరుచుండ
గగనమువనుండి సమవర్తికడకువచ్చె
సమరసంయమి వరుండు విద్యాగురుండు.

సీ. బహువిధ పరిమళ భరితోదకంబులఁ
జెలువంబు శోభిల్ల జలకమార్చి
నిండారు పండువెన్నెల సోయగమునవ్వు
పసిఁడి కమ్మల వెల్లపట్టుఁ గట్టి
కబరీభారంబునఁ గన్నెచెంగలువలు
పసమీఱఁ గొనలు దోఁపంగఁ జెరివి

త్రిండి్రించు పసిఁడిదీధితులచే నమరెడు
నవరత్నమయపు భూషణములు దొడిగి

గీ. మృగమదము గుంకుమంబును మేళవించి
గంధసారంబు మైదీగెఁగలయనలఁది
శ్రీలుమెఱయంగఁ బరిణయోచితముగాఁగ
సఖులు కైకేసి తెచ్చిరి చంద్రముఖిని.

సీ. రాజితరత్న దర్పణతోరణంబులఁ
గడుశోభితములైన కలువడముల
మానితకనకరంభాస్తంభ పంక్తుల
భాసురోజ్వల పతాకాసమృద్ధి
నిర్మలస్ఫురిత మాణిక్యకుంభంబుల
మెండైన చిత్రింపు మేలుకట్లఁ
బ్రకటితనూత్నమౌక్తిక రంగవల్లుల
రమణీయ పరిమళ ద్రవ్యసమితిఁ

గీ. దనరు నగరంబునుతనిరంతర విభూతి
నతిశయంబుగఁ దగనలంకృతులొనర్చి
బహుపదార్థంబు లొడఁగూర్చి పరిణయమున
కాయితముసేసిరంత వారనుపమముగ.

సీ. లక్ష్మిఁ గొల్లాపురిలంక శాంకరివిశా
లాక్షిఁగాశికను వింధ్యమున దుర్గఁ
గన్యఁగన్యాకుబ్జఁ గామరూపంబునఁ
గామాక్షిఁ గాంచిని గామకోటి
మండలిఁ బుంద్రక మాణిక్యదత్తవా
టమున నారావర్తకమునఁ ద్రిపుర
జాలంధరంబున జ్వాలహేమచ్ఛత్ర
పురిమహాయోగ శ్రీగిరినిభ్రమర

గీ. విరజ విరజహుంకృతిపీఠ (?) సింహ
శమున నరసింహికను గాశ్మిరమున వాణి
నుజ్జయిని మహాకాళిని నున్నతముగఁ
జూచువారలు జనుపురిఁజూడరెందు.

సీ. వర్ణితప్రాకార వప్రరత్నప్రభా
వ్యూహాకిమ్మీరిత వ్యోమతలము
వివిధవాదిత్ర భైరవ రావపూరిత
ప్రవిమాన తరదిశా భాగసమితి
బహుళ దంతావళ ప్రాలంబ ఘంటికా
టంకృతోల్లాసి ఘంటాపథంబు
కమనీయరూపరేఖా కళావిభ్రమ
ప్రకటితాజ్ఞానవారత్న పేటి

గీ. సహజధర్మార్థ కామమోక్షప్రసిద్ధి
సన్నుతౌదార్యఖేలనాజన్మభూమి
సకల సంపద్విలాస విస్తారహసిత
రాజరాజ పురంబు వారణపురంబు.

దగ్గుబల్లి దుగ్గన రచియించిన నాసికేతోపాఖ్యాన మొండుగలదు. అది చెందలూరి గంగనామాత్యున కంకితమీయఁబడినది. ఈకవి యింటిపేరుకూడ చెందలూరివారగుటచే, ప్రబంధరత్నావళిలో నేసీప ద్యములను మొదటఁ జూచినప్పుడు చిక్కయ చెందలూరివారి వంశీ యుఁడగు నొకలేఖరి యయియుండుననియు, నీపద్యములు దుగ్గన ప్రణీతములై యుండుననియు ననుకొంటిని కాని దుగ్గన నాసికేతో పాఖ్యానమును జూడఁగా నందీపద్యములులేవు. పైనివ్రాసిన పద్యము లలో మొదటిపద్యమువంటి పద్యమొకటి యున్నది. తక్కిన పద్యము లనుబోలిన పద్యములైనను నందు లేవు. రెండు గ్రంథములయందలి యితివృత్తము నొకటియే. కాని చిక్కయ నాసికేతోపాఖ్యానమున వర్ణనాంశము లధికముగానుండునని తోఁచుచున్నది.

ఇంతకంటె కవినిగూర్చిగాని గ్రంథమునుగూర్చిగాని నాకే మియుఁ దెలియ లేదు. ఉదాహృత పద్యములనుబట్టి ఈతని కవిత్వము ప్రాచీనకవుల కవిత్వమువలె హృద్యమై నిర్దుష్టమై యుండునని తోఁచు చున్నది.

ఇతనికాలమునుగూర్చి ఏమియుఁ దెలియనందున నావిమర్శనా భారమును భావిపరిశోధకులపైఁ బెట్టి ప్రస్తుతమీతనిని పదునైదవ శతాబ్దియందున్న వానినిగా నెంచుచున్నాఁడను.

---

## 164 భద్రకవి లింగకవి

సానంద చరిత్రమను మూఁడాశ్వాసముల ద్విపదకావ్యమొకటియు, దేవాంగపురాణమను నేడాశ్వాసములద్విపదకావ్యమొకటియు నీతని రచనములు. ఈరెండు గ్రంథములుకూడ ముద్రితములుకాలేదు. దేవాంగ పురాణమున కొకప్రతియు, సానందచరిత్రమునకుఁ దొమ్మిది ప్రతులును మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము నందును సానంద చరిత్రమునకే నాల్గుప్రతులు తంజావూరు పుస్తకభాండాగారమునందును గలవు. శివపంచాక్షరీ మాహాత్మ్యమున సానందుఁడను ఋషి యమలోకవాసులను నరకబాధలనుండి తప్పించినకథ సానంద చరిత్రమునఁ జెప్పఁబడినది. కోట శివరామయ్యయు మఱియొకకవియు నీకథను బద్యకావ్యములుగా రచించియున్నారు. దేవాంగపురాణము నందు మనువంశముననొకమహర్షి జనించి, దేవతలకు వస్త్రములనేయుట మొదలుగా దేవాంగుల పుట్టుక పూర్వోత్తరములు వర్ణింపఁబడినవి

ఈకవి జంగమ కులజుఁడయినట్లును, రామయకును, అమలాంబకును బుత్రుఁడైనట్లును, కాళహస్తియందలి సంగమేశ్వర గురుని శిష్యుఁడైనట్లును, నీక్రింది ద్విపదలవలనఁ దెలియుచున్నది.

జంగమకులవార్ధి చంద్రోదయుండు
లింగైక నిష్ఠావిలీన మానసుఁడు
వాసనగల పుణ్యవర్తనుం డనఁగ

భాసిల్లు రామయ ప్రభువరేణ్యుండు
తనదు పాతివ్రత్య ధర్మమార్గమున
ననసూయకెనయైన యమలాంబవలనఁ
గనిన పుత్త్రుఁడు భద్రకవి లింగవిభుఁడు
వినుతభాసుర కావ్య విద్యాధికుండు
* * *

చిరపుణ్యశోభిత శ్రీకాళహస్తి
గురుసంగమేశ్వర కోమలచరణ
జలజాత గంధపుష్పంధయమాన
కలితమానస భద్రకవి లింగధీర
విరచిత సానంద విమలచారిత్ర
మరుదైన ధవలతాయతలవిత్రంబు.

సానంద చరిత్రమును నరుణాచలమున కుత్తరముననున్న యరుణాద్రి మంగళపుర వాస్తవ్యుఁడును, సంగయదేవర కుమారుఁడునగు వీరభద్రయ్యయను జంగమదేవర కంకితముచేసిన ట్లీక్రింది ద్విపదలలోఁ గానవచ్చుచున్నది.

అరుదండశోణాద్రికట నుత్తరమున
నరుణాద్రిమంగళం బనుపురంబునను
శ్రీరుద్రగణమూర్తి శివయోగి చెన్న
వీరభద్రేశ్వర విమలసద్గురుండు
మన్నింప నిజశిష్య మండలిలోన
సన్నుతికెక్కిన సత్యసంధుండు
అంగగుణాతీతుఁడగు శివయోగి
సంగయదేవర సత్కుమారుండు
కలఁడు జంగమరూప కనకశైలంబు
విలసిల్లు శివయోగి వీరభద్రయ్య
* * *

అనినఁ దమ్మునిమాట లంగీకరించి
విని మమ్మురప్పించి వేడ్క నిట్లనియె
అనఘాత్మ సానందుఁడను మహామాని
ఘనపుణ్యచరితంబు కవులు గీర్తింప
వావిరి ద్విపదకావ్య ప్రబంధంబు
గావింపు మాపేరఁ గరమర్థిననుచు
శివయోగిరాయఁ డాశ్రితరక్షకుండు
ప్రవిమలభూతి మత్ఫాలభాగమున
ధరియించి కనకరత్న ప్రభాకలిత
వరభూషణాదులు వరుసతో నొసఁగి
ఘనసార తాంబూల గంధాక్షతములు
మునుకొని పాలించి ముదముతో ననుప
మనమున సంతోష మహిమ శోభిల్ల
ఘనపుణ్య కృతిసేయఁ గడఁగితినేను.

ఈగ్రంథమును కాళహస్తి నివాసుఁడైన గుళ్లపల్లి లింగార్యుఁడు వ్రాసినట్లీక్రింది ద్విపదలలోఁ జెప్పియున్నాఁడు.

జ్ఞానప్రసూన విజ్ఞానప్రదీప
శ్రీనిధియగుస్వస్తి శ్రీకాళహస్తి
పురవాసుఁడైనట్టి భూతేశుపాద
సరసిజమకరంద సచ్చిదానంద
భ్రమరుఁడై తగు గుళ్ళపల్లి లింగార్యుఁ
డమరవ్రాయింపఁ జెల్వలరినయట్టి
యీపుణ్యచారిత్ర మెవ్వరు వినిన

గ్రంథవిలేఖకుఁడును గవియొక్క గురువును గాళహస్తి నివాసులగుటచేఁ గవి నివాసముకూడఁ గాళహస్తియని యూహింపఁ దగియున్నది.

ఈకవి రచించిన దేవాంగపురాణము ముదునూరునందలి రామే శ్వరస్వామికంకితమైనది. ఈపురాణమున మనుమహర్షి యాశ్వరునకు దేవాంగఋషిగా జన్మించి దేవతావస్త్రనిర్మాణములను చేయుటయు' నాతఁడే విద్యాధర, పుష్పదంత, భేతాళ, వరరుచి, దివసాలి, దేవర దాసి యను నామములతో నాఱవతారములనెత్తుటయు. దేవరదాసి యవతారము దేవాంగకులమం దగుటయు, నాతఁడు జైనమతమును ఖండించి శైవమతము నభివృద్ధిచేయుటయు మొదలు గాఁగలకథ లిందు వర్ణితములు. ఈగ్రంథములోఁ గవితాను దేవరదాసమయ్య కులములోని వాఁడనని చెప్పుకొని యున్నాఁడు.

వరయశోధనుఁడు దేవరదాసమయ్య
కులపయోరాశి కుముదబాంధవుఁడు
తెలుఁగుకునెరవాది ద్విపదకు రాజు
గుణగణాభరణుండు గూడలిస్థలిని
గణుతింపఁదగు భద్రకవి లింగవిభుఁడు
కడునర్థి నతని నిక్కడకు రప్పించి
యెడపక చెప్పింపు డీప్రబంధంబు.

అని పడవీడు పట్టణమందున్న దేవాంగు లనుకొనిరఁట. ఈ దేవర దాసమయ్య దేవాంగులకు మూలపురుషుఁడు. దేవాంగులలో దాసమ గోత్రులున్నారు. దీనినిబట్టి యీకవి దేవాంగులకులజుఁడని స్పష్టమగు చున్నది. కాని పై నివ్రాసిన ద్విపదలలో జంగమకులజుఁడనియున్నది. వీర శైవమును గైకొనినవా రేకులమువారైనను జంగముల మనియే చెప్పుకొనుచుందురు. కావున నాసాత్రము ననుసరించి యీతఁడు జంగముండనని చెప్పుకొనియుండును. పడవీటినగరము నీకవి యీక్రింది ద్విపదలలో నిట్లువర్ణించియున్నాఁడు.

భూనారికిని శిరోభూషణంబైన
మానిత ద్రావిడ మధ్యదేశమున
నడరు మర్త్యస్వర్గమగు మధురరస
పడవీడు సకలసంపదలకు వీడు

♦ ♦ ♦

ఇరవొప్పఁ గాళహస్తీశ్వరుఁ డనెడి
పురుషాగ్రగణ్యుఁ డప్పురి కధీశ్వరుఁడు

♦ ♦ ♦

పరగిన కశ్యపబ్రహ్మగోత్రజులు
స్థిరవీలఁ బడవీటి దేవాంగఘనులు
పరమసమ్మదముతోఁ బదివేలకులము

* * *

బసివడి పిలిపించి బహుమాన మొసఁగి
పలికిరి కొల్వులోపల నొక్క నాఁడు
నెలకొని బుధులెల్ల నీకావ్యమహిమ
గొనియాడుచున్నారు కుంభినిమీఁద
ననఘాత్మ సంతోషమయ్యెడిమాకు
మాకులమునకు నీమహనీయచరిత
శ్రీకరాభరణమై చెలువు దీపించు
కావున దేవాంగఘనచరిత్రంబు
వావిరి ద్విపదకావ్యంబు గావింపు.

గ్రంథాంతమున కొమరేంద్రుఁడను దేవాంగుని వంశమును గవి వర్ణించియున్నాఁడు.

ఉదాహృతద్విపదలనుబట్టి యీతనికవిత్వము సరసమై హృదయంగమముగా నుండునని గన్పట్టుచున్నది. ఈకవి కాలమును నిర్ణయించుచు శ్రీ నిడదవోలు వెంకటరావు పంతులుగారొక వ్యాసమును వ్రాసియున్నారు. (భారతి – విరోధి – ఆషాఢము – పుట 22–28) కవికాలమునుగూర్చి శ్రీపంతులుగారి వాక్యములందలివి యీక్రిందఁ బొందుపరచుచున్నాఁడను.

"కాలము – లింగకవి తన దేవాంగపురాణమును రచియించునాఁడు పడవీడున కధిపతియగు శ్రీకాళహస్తీశుఁడను మహాపురుషుఁడధీశ్వరుఁడుగా నున్నట్లుగా నిట్లుచెప్పినాఁడు.

ఇరవొప్ప కాళహస్తీశ్వరుఁడనెడి
పురుషాగ్రగణ్యుఁ డప్పురి కధీశ్వరుఁడు
పట్టణంబులకెల్ల బరగినతల్లి
పట్టణంబయినట్టి పడవీటియందు.

పైనిపేర్కొనఁబడిన కాళహస్తీశ్వరుఁడు కృష్ణదేవరాయని వెనుక విజయనగరరాజ్యమును పరిపాలించిన యచ్యుతదేవరాయల కాలము వాఁడు (క్రీ. శ. 1530–1542) ఈతఁడాకాలమున పడవీడునుపాలించు చున్నట్లీక్రిందిశాసనములు కన్పట్టుచున్నవి.

ఉత్తరార్కాడుజిల్లా దేవకీపురమున బృహదంబాదేవియాలయమున శాసనములు.

శా. శ. 1452 క్రీ. శ. 1530 పడవీడు తిరుమలేశ్వరుని వసంత మండపనిమిత్తము భూదానము.

1452–1530 దేవకీపురము దేవాలయము ధర్మకర్తృత్వము (శ్రీకాళహస్తినాయకుఁడు).

1454–1532 ఇందులో స్పష్టముగా కొండమనాయకుఁడను వాఁడాకాలమున గొల్లలను దేవాలయమునకు సేవకై వినియోగించుటకు పడవీడును పాలించుచున్న కాళహస్తీశ్వరనాయకుని యనుమతిని బొందెనని కలదు.

1454–1532 దేవాలయమునకు ప్రతిమగ్గముపైని 12 పణములు వన్నుకట్టుటకు శాసనము. ఇందు కాళహస్తీశ్వరుఁడు పేర్కొనఁబడినాడు.

**(EP. Reports 1913 Page 44–45 Nos. 364, 374, 373, 377).**

ఇతఁడు తన కవిత్వమునుగూర్చి:—

"తెనుగుకు నెఱవాది ద్విపదకు రాజు
వినుతశబ్దబ్రహ్మవిద్యా నిరూఢి
ఘనతమించిన భద్రకవిలింగ విభుఁడ

రమణీయ శివకవి రాజన్యహృదయ
కమలమిత్రుఁడు భద్రకవిలింగ విభుఁడు
నెఱయ నాతనికంటె నేర్పరి కలఁడె"

అని తెలుపుకొనినాఁడు.

---

## 165 పె మ్మ న బా వ న

ఈతఁడు రచించిన "అనిరుద్ధచరిత్ర" మిప్పుడెచ్చటను గన్పిం, చుటలేదు. కాని యీతనినామమును స్మరించుటకు మనకు, రామా పెగ్గడ జగ్గన తనప్రబంధరత్నాకరమునం దుదాహరించిన పద్యములే యాధారములైనవి. ప్రబంధ రత్నావళియం దీతని పద్యములఱువది వఱకుఁ బ్రకటితములయినవి. గ్రంథవిస్తరభీతిచే వానినన్నింటి నిందు దాహరింపఁజాలక పది పద్యములను మాత్రమీదిగువ వ్రాయుచున్నాఁడను. ఈకవులచరిత్ర వ్రాయుసందర్భమున నేగ్రంథమునందో "బావన కవి' నామమును జూచియున్నట్లు నాహృదయమునకుఁ దట్టుచున్నది. కాని యాగ్రంథనామమును జెప్పలేకున్నాఁడను. ఇంతకంటె నీకవినిఁ గూర్చి యేమియుఁ దెలియరాలేదు. ఉషాపరిణయకథ యిందు వర్ణిత మైనది. యుద్ధమున జయింపఁబడిన పిమ్మట బాణుఁడుషాకన్యను గన్యాదాన మొనర్చిన ట్లిందుఁ గవి గల్పించినాఁడు.

సీ. కుసుమకోదండుండు గుణవంతుఁ డగుటెల్ల
యళులార! మీప్రాపుకలిమిఁ గాదె!
మరుని యెక్కుడుపెంపు మహిమీఁదఁ జెప్పుట
కీరంబులార మీపేరఁగాదె
సంకల్పజన్ముండు సప్రాణుఁడగుటెల్ల
మలయానిలంబ నీమహిమఁగాదె
మీనకేతనుకీర్తి మిన్నందుకొనుటెల్ల
శీతమయూఖ! నీచెలిమిఁగాదె

గీ. బాలఁ గారింపఁ దగదని పలుకఁదగదె!
యేడుగడయును మీరకాదెంత ద్రవ్వ
మాకుఁ బుష్పాస్త్రుఁడంచు ననేకగతుల
మధుప శుకమందపవమాన విధులఁ దలఁచి.

గీ. గురులపంపున వక్షోజభరము గదలఁ
జెలువు వీక్షించి యొక్కింత సిగ్గువడుచుఁ
గంకణంబులుఝణఝణత్కార మెసఁగ
నతివ లాజలుపోసె సప్తార్చియందు.

చ. చెలువములొప్ప రాజనపుఁజేలకుఁ గావలియున్న కాఁపుఁగూఁ
తుల నిడివాలుగన్నులును దోరపుఁజన్నులుఁ జూచి ధైర్యము
ల్వలపల నైన మందగతులన్ జనుచుండుదు రంగజాస్త్రముల్
దలముగఁ దాఁక నధ్వగులు దన్నగరాంతిక మార్గభూములన్.

సీ. ధూర్జటి కోపాగ్ని ధూళిగాఁ గ్రాఁగిన
నాఁడేల నీయమ్ము వాఁడిలేదు!
వాఁడికోరలరాహు వడిఁదోలి కఱచిన
నాఁడేల నీరస్మి వేఁడిలేదు?
శాపంబు శ్రీరామభూపాలుఁడిచ్చిన
నాఁడేల కూయవో పోఁడిగాను?
చనుపకములకర్గి కనుకని డుల్లిన
నాఁడేల మ్రోయరో? నేఁడుమీరు

గీ. మగువఁ బాయు టెఱిఁగి మగటిమి వాటించి
యేయఁగాయఁగూయ మ్రోయనగునె?
మదన! చంద్ర! పికము! కొదమతుమ్మెదలార!
నాఁడు నాఁడు నాఁడు నాఁడు లేరె?

శా. ధన్యంబై పితృదేవతానివహ ముద్యత్ప్రీతి నర్తింపఁ బ
ర్జన్యాచార్యుఁడు భార్గవుండు శ్రుతిమంత్రంబుల్ పఠింపంగఁ బ్రా

ధాన్యం బొప్పఁగ శైలరాజసుత యత్యాసక్తి వీక్షింపఁగాఁ
గన్యాదాన మొనర్చె బాణుఁడనురాగస్ఫూర్తిఁ బ్రొద్యుమ్నికిన్.

మ. తెరయెత్తించిరి దేవదానవగురుల్ దీక్షాకళాకోవిదుల్
తరుణీరాజతనూభవాంతరమునన్ దట్టంపుఁ గౌశేయమున్
తెరయెత్తించెను వారలిద్దఱ మనోదేశంబులన్ గాముఁడున్
సరి నన్యోన్య ముఖేందుమండల విదృక్షా కౌతుకాంభోనిధిన్.

సీ. వరుణుండు కానిక పురుహూతునకుఁ దెచ్చి
పోవిడ్డనవరత్నపుంజ మనఁగ
నుదయాద్రి తటములో నున్నాళమై మున్ను
వికసించు రక్తారవింద మనఁగఁ
గాశ్మీరరసపూర కమనీయమగు శచీ
సఖి చేసికళ్యాణ చషకమనఁగఁ
బ్రాచికందుక కేళి పరతమింటికి వైవఁ
బోల్పారు మందారపుష్పమనఁగ

గీ. నడరు కెంజాయమండలం బతిశయిల్ల
నఖిలభూసురదత్త సంధ్యార్ఘ్యతోయ
దళితమందేహుఁడై జగంబులు వెలుంగ
భానుఁడుదయించె దేదీప్యమానుఁడగుచు.

ఉ. "వేగుచువచ్చె బాసె నిదె వెన్నెల యిన్నెలవింక నుండఁగా
వేగునెమాకు నీక్షణమ వేఁడివెలుంగుదయించు నంచును
ద్వేగమునం దదీయ పదవీపరివర్తన ముజ్జగింపవే
వేగమునం దొలంగుగతి విచ్చెనుడుప్రజమంబరంబునన్.

గీ. వారుణీస్పర్శమున నాదువాఁడి దఱిగె
సకలతీర్థనిదాన మీాజలవిధాన
మేనొనర్చెదఁ బావనస్నానమనుచు
మునుఁగుగతిఁ బశ్చిమాంబుధి యునిఁగె నినుఁడు.

గీ. పిమ్మటను గూర్చి ముఖ్యమైనవ పేరటాలు
నలువపట్టంపు దేవి లేనగవు నగుచు
నగసుతాపద్మ లీక్షింప బిగియుముడిచె
దంపతులయు త్తరీయవస్త్రములతుదలు.
ఈకవి క్రీ. శ. 1560 కిం బూర్వుడు.

---

## 166 కుంటముక్కల తిరుమలనాథకవి

ఇతడు నియోగిబ్రాహ్మణుడు; పరాశరగోత్రుడు; అహోబలామాత్యపుత్త్రుడు; కుంటముక్కల గ్రామవాస్తవ్యుడు. దుర్గాంబికావరప్రసాదాసాదిత కవితావిలాస భాసురుడు.

ఈకవి శైవాచార సంగ్రహ మను మూడాశ్వాసముల పద్యకావ్యమును రచియించి, పిల్లలమర్రి గన్నయామాత్యున కంకితము చేసెను. ఈగ్రంథము మదాసు గవర్నమెంటువారి ప్రాచ్య గ్రంథావళిలో ముద్రితమైనది దీనికాంధ్రవిశ్వవిద్యాలయ పండితాగ్రేసరులగు శ్రీగంటి జోగిసోమయాజులు, M. A. L. T. గారాంగ్లాంధ్రములలో విపులములగు పీఠికలను వ్రాసియున్నారు.

ఈకవినిగూర్చి పై నిర్వాసినవిషయము లీగ్రంథమందలి యీక్రింది పద్యగద్యములవలనం దెలియుచున్నవి.

క. అనుపమచరితుం బరాశర
మునిగోత్రజు నన్ను గుంటముక్కల నిలయున్
ఘనుని నహోబలమంత్రిం
ద్రుని నందనుం దిమ్మనార్యనుతగాంభీర్యున్.

గద్య. "ఇది శ్రీదుర్గాంబికావరప్రసాదాసాదిత కవితావిలాస భాసుర శ్రీమహోబలామాత్యపుత్త్ర సుకవిజనమిత్ర సకల విద్యానిధాన తిరుమలనాథాభిధాన ప్రణీతంబైన శైవాచార సంగ్రహంబనుకృతి..."

గ్రంథమందెచ్చటను కవియింటిపేరును దెలిసికొనుట కాధారము లేదు. మదరాసు విశ్వవిద్యాలయ పండితవర్యులగు శ్రీనిడదవోలు

వేంకటరావుపంతులు, **M. A** గారు ఆంధ్రపత్రిక రజతోత్సవసంచిక 16–17 పుటలలో, "శివాగమముల ననుసరించి తెనుఁగున శివపూజావిధానాదికమును దెల్పు నీకృతి కుంటముక్కల తిరుమలనాథకవి విరచితము" అనియు, నీకవి ఎఱ్ఱనకవికృత "కొక్కోకమునకు కృతిపతి యగు భైరవమంత్రి యన్నయగు నౌబళమంత్రి కుమారుఁడు" అనియు వ్రాసియున్నారు. కొక్కోక కృతిపతి కుంటముక్కల మల్లమంత్రి కాని భైరవమంత్రి కాఁడు. భైరవమంత్రి మల్లమంత్రికి, అన్నకుమారుఁడు. ఈ భైరవమంత్రికిఁ బైనిచెప్పిన యఱ్ఱనకవియే సకల నీతికథానమను గ్రంథము నంకితము చేసియుండెను. ఈవిషయ మీక్రింది పద్యపాదములవలన స్పష్టమగుచున్నది.

"మాపినతండ్రైన మల్లమంత్రికినిఁ గొ
క్కోకంబు చెప్పిన కోవిదుఁడవు."

వీరిసంబంధము సులభముగాఁ దెలియుటకై కుంటముక్కల వారి వంశవృక్షము నీక్రింద నిచ్చుచున్నాఁడను.

పెరుమాళ్ళరాజు
|
కొమ్మరాజు
|
మనుమయ్య
|
ఓబళమంత్రి
|
తెలగయ్య
|

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఔబళుడు తిరుమలనాథకవి శైవాచార సంగ్రహకర్త | భైరవామాత్యుఁడు = అక్కమాంబ | వాచన | సోమన | కాళహస్తిమంత్రి | గోపన | సింగన |




ఈవంశవృక్షమునకు శైవాచార సంగ్రహపీఠికలో, నుదాహృతములైన తంజావూరు తాళపత్ర ప్రతియందలి పద్యములును, కొక్కొకముద్రిత ప్రతియందలి పద్యములును నాధారములు. ఈముద్రిత ప్రతికిని ఆతాళపత్రి ప్రతికిని భేదము కనబడుచున్నది. దానినీక్రింద నిచ్చెదను.

ముద్రిత ప్రతి.

గీ. ఘనులు నాచన సోమన కాళహస్తి
మంత్రి గోపన సింగనామాత్యవరులు
తమ్ములుగ రూపకీర్తి ప్రతాపములను
ప్రబలెనిలఁగుంటముక్కల భైరవుండు.

తంజావూరు పాఠము.

గీ. బొబ్బళుఁడు తోడఁబుట్టిన యన్నగాఁగ
మంత్రిగోపయ సింగయామాత్యవరులు
తమ్ములుగ రూపకీర్తి ప్రతాపములను
బ్రబలెనలఁ గుంటముక్కల భైరవుండు.

ఈగీతపద్యమందలి తుది రెండు పాదములు రెండు పాఠముల యందును సమానమే. మొదటి రెండు పాదములయందే పాఠభేద మున్నది.

ముద్రితప్రతిపాఠము నంగీకరించితిమేని, పై వంశవృక్షములో భైరవామాత్యుని యన్నయగు "బొబ్బళుని, పీఠికాకారులూహించిన

యాతని కుమారుఁడగు తిరుమలనాథకవిని తీసివేయవలసియుండును. తంజావూరు పాఠము నంగీకరించితిమేని పై యిరువురను నందుంచి, నాచన, సోమన, కాళహస్తి మంత్రులను మువ్వురను దీసివేయవలసి యుండును. ఆపక్షములో శైవాచార సంగ్రహకర్తయగు తిరుమలనాథకవి, కొక్కోక కృతిపతియైన మల్లమంత్రికిఁ బెదతండ్రి కుమారుఁడును, సకలనీతికథాన కృతిభర్తయైన పిన్నభైరవమంత్రికిఁ బెదతాతకుమారుఁడు నగును.

ఈకవి కాలనిర్ణయము చేయవలసివచ్చినప్పు డుపకరించునేమోయనుటకంటె నీబాంధవ్య చర్చకుఁ బ్రయోజనము లేదు. ఈవంశవృక్షములోని మల్లమంత్రినిగూర్చికాని పినభైరవమంత్రినిగూర్చికాని మఱి యెవరినిగూర్చికాని, శైవాచార గ్రంథమించుకంతయును దెలుపుట లేదు. ఎట్టన కవికృతగ్రంథము లీశైవాచార సంగ్రహమును గుఱించియుఁ దత్కర్తనుగూర్చియు మూకీభావము వహించినవి. తుదకీతిరుమలనాథకవి తండ్రియైన యుహోబలమంత్రి పై వంశవృక్షములోని భైరవామాత్యునికగ్రసోదరుఁడగు నోబళమంత్రియని నిశ్చయముగాఁ జెప్పుటకు గ్రంథస్థ నిదర్శనములు లభింపలేదు. అందుచే నీపాఠద్వయ చర్చయు, నీబాంధవ్య విమర్శనమును నిష్ప్రయోజనములు. కావున వదలివేయుదము.

కవి యింటిపేరు కుంటముక్కలవారని నిర్ణయించుటకుఁ గుంటముక్కలనిలయుఁడననియుఁ బరాశరగోత్రజుండననియు, గవిచెప్పుకొనిన పై కందపద్యమే చాలును. కుంటముక్కలవారిది పరాశర గోత్రమని కొక్కోకాది గ్రంథములు సూచుచునే యున్నవి.

ఈకవి శైవాచార సంగ్రహమును బిల్లలమఱ్ఱి గన్నమంత్రికిఁ గృతియిచ్చెను. ఇతనితండ్రి విస్సామాత్యుఁడనియుఁ దాత గన్నసైన్యపతియనియు నితఁడు యాజ్ఞవల్క్యుఁడును భారద్వాజ గోత్రుఁడు ననియు నీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

శా. భారద్వాజ పవిత్రగోత్రుఁడు జగత్ప్రఖ్యాతుఁడు ద్వ్యద్వశః
పారంభుండగు గన్నసైన్యపతి సత్పౌత్రుండు శ్రీయాజ్ఞవ
ల్క్యార్యాఖ్యాన్వయ దీపకుం డయిన విస్సామాత్య పుత్రుండు వి
ద్యారాజీపథవుండు గన్నయ మహోదారుండు ధీరుండిలన్.

కృతిపతినివర్ణించుచు కవిరచించిన పద్యములింకను గొన్ని కలవు. కాని వానియందుఁ జరిత్రకుపయోగించు నంశములు లేవు. కృతిపతి తాతయైన గన్నసైన్యపతి యేరాజుసైన్యమున కధిపతిగా నుండెనో చెప్పలేదు. జైమిని భారతమును రచించిన పిల్లలమఱ్ఱి పినవీరనయు, నీగన్నమంత్రియు సగోత్రీయులే. పినవీరనకృత గ్రంథములలోఁగాని, ఆతని వంశీయుఁడనని చెప్పకొనిన పెనుమళ్ల సోమమంత్రి చేసిన వంశవర్ణనములోఁగాని, యీగన్నమంత్రి, విస్సామాత్య, గన్న సైన్యపతి నామములు కన్పింపలేదు. పినవీరన్న చరిత్రమును వ్రాయునప్పుడు నాకాతఁడు యాజ్ఞవల్క్య నియోగిబ్రాహ్మణుఁడని వ్రాయుటకుఁ దగిన యాధారములు లభింపలేదు.

ఈగన్నమంత్రికి వీరభద్రుఁడను నొక స్నేహితుఁడు గలఁడట! ఈవిషయమీక్రింది రెండు పద్యములలోఁ జెప్పియున్నాఁడు.

సీ. అఖిల జగత్కర్త యగు
శ్రీనగాధిపునకు సిద్ధిలింగ
తనునకు మల్లికార్జున మహాదేవున
కపరావతారమై యఖిలదిశలఁ
జెలఁగి వారాణసీసిద్ధ భిక్షావృత్తి
యతినాథునాత్మజుఁడై ధరిత్రి
వీరశైవాచార విభవంబు విశదంబు
గాఁ బ్రతిష్ఠించి యక్కజముగాఁగ

గీ. సకల ధర్మంబులును సప్తసంతతులును
భూతదయయును నాశ్రిత పోషణంబుఁ

బ్రిఋతికెక్కిన గేమయ ప్రభునిసుతుఁడు
వీరభద్రుండు పెంపొందు విమలకీర్తి.

క. ఆవీరభద్రునకు హితుఁడై వెలసినయట్టిపుణ్యుఁ డనవరతంబున్
శైవార్చన సంపన్నుఁడుభూవినుతుఁడుగన్నమంత్రిపుంగవుఁడొప్పున్.

ఉ. నిత్యయశోవిశాలుఁ డురునీతియుగంధరుఁ డద్రిధీరుఁడా
దిత్యసమానతేజుఁడు సుధీనుతుఁ డున్నత ధర్మశీలుఁడున్
సత్యవివేక భూరి గుణసాంద్రుఁడు పిల్లలమఱ్ఱిగన్ననా
మాత్యుఁడు చెప్పనొప్పు మహిమ న్విలసిల్లుచు నెల్లదిక్కులన్.

శై. సం. కృత్యాది.

ఈకవికాలమును నిర్ణయించుటకై పీఠికాకారులగు శ్రీసోమయాజిపండితులు మిగుల శ్రమపడి కృతికర్త బంధువులగు కుంటముక్కల మల్లమంత్రి, షినభైరవమంత్రుల కాలమును శ్రీశైల భిక్షావృత్తి మతాధిపతులగు శాంతభిక్షావృత్తి, సిద్ధభిక్షావృత్తి మొదలగువారి శాసనములనుబట్టియును "మొత్తముమీఁదఁ దిమ్మకవి కృష్ణరాయలకాలమువాఁడై యుండియుండవచ్చునని తోఁచుచున్నది. క్రీ. శ. 1510 సం॥ర సమీపమున నీగ్రంథము రచియింపఁబడినట్లు తోఁచుచున్నది." అని నిర్ణయించినారు. శ్రీనిడదవోలు వెంకట్రావుపంతులు **M.A.** గారు "సిద్ధభిక్షావృత్తి శ్రీశైల శాసనమువలన క్రీ. శ. ౧౪౬౫ ప్రాంతము వాఁడు. అతని మనుమనికాలమున కీ. శ. ౧౪౮౦ ప్రాంతమున గన్నమంత్రియు, కుంటముక్కల తిమ్మకనియు నుండురని చెప్పవచ్చును." ఈకాలమునుబట్టి చూచినను కృతికర్త కృతిభర్త లిరువురు కృష్ణదేవరాయులకించుక పూర్వులగుదురు.

ఇంతకంటె నీకవికాలమును సునిశ్చితముగా నిర్ణయించుటకు నాకు గ్రొత్తయాధారము లేమియు లభింపలేదు. కృతిభర్తకు హితుఁడైన వీరభద్రుని తాత వారాణసీసిద్ధ భిక్షావృత్తి. పై సీసపద్యములోఁ జెప్పిన యాతని వర్ణనమునుబట్టి యాతఁడు శ్రీశైలమునందున్న భిక్షావృత్తి మఠ పరిపాలకుఁడని చెప్పవచ్చును. సిద్ధభిక్షావృత్తి వీరశైవసిద్ధ

భిక్షావృత్తి, అజాతివీరశైవ సిద్ధభిక్షావృత్తి అనువారల శాసనములు గన్పట్టుచున్నవి. ఈశాసనకాలములు పీఠికలో నీయఁబడినవి. కాని వారాణసీ సిద్ధభిక్షావృత్తి శాసనములు గన్పింపలేదు. ఈసిద్ధభిక్షావృత్తి శ్రీశైల మఠపాలనమునకై కాశీనుండి వచ్చియుండునని తోఁచుచున్నది. అందుచే నాతనిని ప్రజలు వారాణసీ సిద్ధభిక్షావృత్తియని పిలుచుచు వచ్చిరేమో! శాసనములలో నీవారాణసీ పదము విడువఁబడి యుండవచ్చునని యూహకలుగుచున్నది. ఇది సత్యమయ్యేనేని సిద్ధభిక్షావృత్తి శాసనములు శా. శ. 1470–1475 లోనున్నవి. కావున నాతని మనుమనికి హితుఁడైన కృతిపతి క్రీ. శ. 1550–1560 ప్రాంతమున నుండెనని నిశ్చయింపవచ్చును. కాని యిది యూహామాత్రమే.

శైవాచార సంగ్రహ ద్వితీయాశ్వాసాంతమున ;—

కం. లింగావధానసంతత
సాంగత్య పవిత్రమానస్ఫుటలీలా
జంగమమయయుతలింగా!
అంగీకృత వినయ విశ్రుతౌదార్యనిధీ!

అనుపద్యములోఁ గృతిపతియైన గన్నామాత్యుఁడు లింగావధానుఁడను నాతని సంతత సాంగత్యముచేఁ బవిత్రమానసుఁడైనట్లు చెప్పియున్నాఁడు. దీనినిబట్టి లింగావధానులు పవిత్రహృదయుఁడైన గొప్ప పుణ్యపురుషుఁడై యుండునని మనమనుకొనవచ్చును. ఇతఁడు ఎన్నిక పురుషులలో నొకఁడై యుండనిచోఁ బ్రత్యేక మాతనిని పేర్కొనుట సంభవింపదు. కావున నీలింగావధాను లెవరో యాతనినిబట్టి కవికాలము నిర్ణయించుటకేమయిన యాధారము లభించునేమో తెలిసికొనవలసియున్నది.

శ్రీరామ స్తవరాజము, తత్త్వ చంద్రోదయము ననుగ్రంథములను రచియించిన ముమ్మడి మల్లనకవికిని, ఆంధ్ర భగవద్గీతను రచించిన కంభంపాటి నారపామాత్యునకును గురువైన ధేనువుకొండ తిమ్మయా

చార్యునకును, ఆత్మైక బోధాది గ్రంథకర్తయగు యోగానందావ భూతకును గురువర్యుఁడైన చింతల లింగావధాను లొకఁడు కలఁడు. సుప్రసిద్ధ యోగిపుంగవుఁడైన దత్తాత్రేయ యోగీంద్రునకు శిష్యుఁడై యనేక వేదాంత గ్రంథములను పరమానంద శతకాదులను రచించిన పరమానంద యతీంద్రుఁడీ లింగావధానులకు గురువు. ఈగురుశిష్య సంబంధమునుబట్టి లింగావధానులు నుతిపాత్రుఁడగు మహాపురుషుఁడని స్పష్టమగుచున్నది. కావున నీతఁడే శైవాచార సంగ్రహమునఁ జెప్పఁబడిన లింగావధానులని నాయూహ.

తిరుమలనాథకవి కాలనిర్ణయమునకు లభించిన యాధారముల న్నియు మొత్తముమీఁద సంశయగ్రస్తములేయైనవి. పైనివ్రాసిన పద్యమునందలి లింగావధానులు, చింతల లింగావధానులే యైనను, ఆతని కాలముగాని ఆతని శిష్యప్రశిష్యుల కాలముగాని సునిశ్చితము కాలేదు. ముమ్మడి మల్లన కంభముపాటి నారపామాత్యుల కాలములు తెలియరాలేదు. లింగావధానుల గురువైన పరమానంద యతీంద్రుని కాలమును దెలిసినదికాదు.

చంద్రభాను చరిత్రమును రచించిన తరిగొప్పుల మల్లన తన గురువు దత్తాత్రేయ యోగిపుంగవుఁడని చెప్పుకొని యున్నాఁడు. ఈ మల్లన క్రీ శ. 1585–1614 నడుమ రాజ్యముచేసిన వెంకటపతి రాయల యాస్థానకవి. ఈతనిగురువగు దత్తాత్రేయ యోగియుఁ బైనిచెప్పిన దత్తాత్రేయయోగియు నేకవ్యక్తియేయని తలంచితిమేని యుఁ జంద్రభాను చరిత్ర రచనాకాలమునకు మల్లన వయసు 50–60 సంవత్సరములుండునని యూహించితిమేనియు దత్తాత్రేయ యోగి పుంగవుని కాలము క్రీ. శ. 1520–1570 అని నిశ్చయింపవచ్చును. ఈకాలములోనే పరమానంద యతీంద్రుఁడును జింతల లింగావధానులు నుండియుందురు. దీనినిబట్టిచూచినను శైవాచార సంగ్రహ కృతికర్త కృతిభర్తలిరువురును పదునాఱవశతాబ్ది పూర్వార్ధమున నుండిరనియు నాకాలముననే శైవాచార సంగ్రహము పుట్టియుండుననియు గుఱికిఁ బారెడు న్యాయమున నిర్ణయింపవచ్చును.

ఈగ్రంథమున భస్మధారణవిధి, రుద్రాక్షధారణవిధి, ముగ్గుల విధానము, పూజాపుష్ప నిర్ణయము, నైవేద్యవిధి, జపవిధానము మొదలుగా శైవులాచరించవలసిన యనేకాచారములను శ్రుతిస్మృతి పురాణేతి హాసాది బహుగ్రంథములనుండి సేకరించి దాదాపు 850 పద్యములలోఁ జక్కని శైలిలోఁ జెప్పియున్నాఁడు. శివపూజాతత్పరు లగు భక్తులకిది మిగుల నుపయోగించును.

వీరశైవాచార సంగ్రహమనుపేర నిట్టిదే ద్విపద కావ్యమొకటి కలదు.

తిరుమలనాథకవి కవిత్వము సలక్షణమై సరసముగానున్నది. శైలి చూపుటకై మూఁడాశ్వాసములనుండియు మూఁడు పద్యముల నీక్రింద నిచ్చుచున్నాఁడను.

ఉ. ఆయతభక్తియుక్తిఁ ద్రిపురాంతకు శంకరు నల్లగల్వలన్
వేయును నూట నెన్మిదిట విశ్రుతభంగి భజింప మానవుం
డాయుభవుండు తానయయి యద్భుతవైభవసంపదున్నతిం
బాయక శంభుసన్నిధి నపారసుఖంబుల నొందు నెప్పుడున్.

క. రుద్రాక్ష దొఱకకున్నను
రుద్రాక్షను మంటిదైన రోయక దాల్పన్
విద్రితదుష్కృతుఁ డగుచును
రుద్రనిలోకంబు వడయు రూఢి దలిర్పన్.

చ. కరము వినీతి నీసునకుఁ గార్తికమాసము దీపమాలికల్
వరగు ఘృతంబు నించి తగుపాత్రల నెన్నిట నెత్తునన్ని వేల్
వరయుగముల్ వసించుఁ దనవంశమువారును దానుఁగూడి శం
కరుపురిఁ గోటిసూర్యుల యఖండరుచిన్ మనుజుండు పెంపునన్.

—|౯|—

# 167 కంచిరాజు సూరయ్య

ఈకవిపేరు మనకుఁ దెలియుటకు పెదపాటి జగ్గన కృతప్రబంధరత్నాకరమే కారణము. ఈతఁడు కన్నప్పచరిత మనుప్రబంధమును రచియించెనఁట! అందలి పద్యములను ప్రబంధరత్నావళినుండి తీసి యిట పొందుపఱచుచున్నాఁడను. కవిచరిత్రము దెలియదు. కన్నప చరిత్రము దెలియదు.

ఈక్రిందిపద్యములను జదివి యానందించుటయు, నీగ్రంథమును సంపాదించుటకై ప్రయత్నించుటయు పాఠకుల కర్తవ్యము.

ఉ. కారణమేమి? రక్కసు నఖంబుల వ్రచ్చితినాఁడు నీకుఁ బెం
పారఁ గుఠార వబ్బదా పురారి విరించులు చేరి యేటికిం
గోరనఁబోవు సేఁతలకు గొడ్డలియున్నఁ దొఱంగితో? వినం
గోరెద నన్నయిందిరకుఁ గోర్కులనిచ్చుముకుందుఁ గొల్చెదన్.

ఉ. కొమ్మను దొండమున్ కఠినకుంభయుగంబును నయ్యుమాకపో
లమ్ములచారు కాంతిఁ దొడలన్ వలిచన్నులఁ బోలెఁ బుత్త్రకుం
డిమ్ములఁ దల్లిఁబోలి జనియించిన సంచిత భాగ్యవంతుఁడౌ
నమ్మ! యటంచు సిద్ధసతు లక్కునఁ జేర్చు గజాస్యుఁ గొల్చెదన్.

మ. తమసౌభాగ్యము లంగసంభవుని భద్రశ్రీల సేవింపఁగాఁ
దమదృగ్జాలము లాలతాంత శరకుంత శ్రేణిఁ బాలింపఁగాఁ
దమవృత్తస్తనభారముల్ మరుని చిత్తస్ఫూర్తి సూచింపఁగాఁ
దమకం బారఁగఁ జేరి చూచిరి పుళిందగ్రామణిన్ బ్రేముడిన్.

సీ. శ్రుతిసుధాత్మ భక్త సురజన నీవధూ
మల్లశంకర ధర్మమహితబుద్ధిఁ
గగకూర్మకిటినర మృగకుబ్జరామ రా
మానంతబుద్ధకల్క్యాహ్వాయముల
నముచి మందర కుదానవబలార్జుషపంక్తి
ముఖముష్టిక స్త్రీవిముక్తఖలుల

దత్పుచ్ఛకర్పర దంష్ట్రాగ్ర నఖపద
పరశుబాణహాలాంగ ఖరపుటములఁ

గీ. జెరివి తాల్చియెత్తి చీరి బంధించి ని
ర్జించి యేసి యేర్చి బెటిచి మట్టఁ
గాడఁగుచున్న శౌరి కరుణావిధేయుఁడై
మనలఁ గోర్కు లిచ్చి మనుచుఁగాత.

ఇందలి మొదటిపద్యమును. కూచిమంచి తిమ్మకవి తనలక్షణ సారసంగ్రహమున నుదాహరించియున్నాఁడు. కవిచరిత్రమును దెలిసి కొనుట కీపద్యములలో సూచనలేమియు లేవు. కన్నప చరిత్రమందలి కథావివరమును దెలియలేదు కన్నప చరిత్రమును రచించినకవి వేఱొకఁడు కలఁడని జ్ఞాపకముగనున్నది కాని యాకవి నామమిప్పుడు స్ఫురించుటలేదు.



## 168 లింగమకుంట రామకవి

ఇతఁడు ప్రథమశాఖా నియోగిబ్రాహ్మణుఁడు; కాత్యాయన సూత్రుఁడు; కాస్యపసగోత్రుఁడు; సర్వకవి సార్వభౌమపౌత్రుఁడు; లక్ష్మియామాత్య తిరుమలాంబల పుత్త్రుఁడు; సులక్షణసారమును రచియించిన లింగమకుంట తిమ్మకవి కగ్రజుఁడు. తెనాలి రామకృష్ణునకు జామాత.

ఈకని ఆనందకానన మాహాత్మ్యము, చతుర్వాటి కామాహాత్మ్యము, వేంకట మాహాత్మ్యము, మత్స్యపురాణము, వామనపురాణము అను గ్రంథములను రచించెను. ఇతఁడు తనపితామహుఁడైన సర్వకవి నీక్రిందిపద్యములో స్తుతించియున్నాఁడు.

సీ. శ్రీవల్లభోపేంద్ర దేవేంద్ర జనక క
శ్యపఋషిగోత్రాబ్ధి చంద్రుఁడగుచు

వృద్ధకుండికపొంత వెలయులింగమకుంట
నేకభోగముగాఁగ నేలినట్టి
చెన్నయామాత్యుని శ్రీరామమంత్రినం
దనుఁ డన్నపకును దద్ధర్మపత్ని
కమలమ్మకు సుతుఁడును సంభవుండును ది
మ్మనకుఁ గాదనకుఁ గస్వనకుఁ బెద్ద
గీ. భవ్యభాగీరథీసతీ ప్రాణవిభుఁడు
ఘనుఁడు బస్వన రామలక్ష్మణులతండ్రి
మహితవిద్యుఁడు మత్పితామహుఁడునైన
సర్వకవి సార్వభౌముని సన్నుతింతు.

ఈకవిసార్వభౌముఁడు రచించిన గ్రంథము లేవియో నిందుఁ జెప్పలేదు. ఈకవి లక్ష్మయామాత్యునకుఁ బుత్త్రుఁడయినను నితనికి రామమంత్రి పాలకపితయైన ట్లీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు. రామమంత్రి కవికిఁ బెదతండ్రి. లింగమకుంట గ్రామమునుబట్టి వీరి గృహనామ మేర్పడియుండును.

సీ. శ్రీకృష్ణమంత్రప్రసిద్ధుండు సర్వస
త్కవిసార్వభౌమనందనుఁడు ఘనుఁడు
కలిత భాగీరథీగర్భ సంభూతుఁడ
త్యనఘుండు బస్వన కవరజుండు
లక్ష్మణాగ్రజుఁడు సలక్షణ నాగమా
ప్రాణవల్లభుఁడు విరాజ చరితుఁ
డనుపమదీప సమారాధనప్రీత
రమ్యచతుర్వాటి రామవిభుఁడు
గీ. మంత్రరాజ రామమంత్రోపదేష్ట యా
గురుఁడు పాలకపితృవరుఁడు ప్రేమ
రామమంత్రి కరుణరంజిల్ల స్వప్నంబు
నందుఁ గానుపించి యుంచితముగ.

కవి తననుగూర్చి యీక్రిందిపద్యములోఁ జెప్పుకొని యున్నాఁడు.

సీ. శ్రీరామసేవాప్రసిద్ధుఁ గాస్యపగోత్రు
శుభదకాత్యాయన సూత్రపాత్రు
లలితచారిత్రుఁ గాళయమంత్రికిని గోన
మకును దౌహిత్రు సర్వకవి పౌత్రుఁ
దిరుమలాంబాగర్భ వరవార్ధి పూర్ణేందు
ధన్యాత్ము లక్ష్మిప్రధానపుత్రు
నిజపాలక జనక నిష్ఠాగరిష్ఠ రా
మ సచివలబ్ధ రామజపధుర్యు

గీ. రామకృష్ణాఖ్యుజామాతఁ బ్రకటవిభవు
శుక్లయజురధ్యయనుఁ బేరసూరిమాచ
యానుజునిఁ దిమ్మధీనిధి కగ్రజాతు
ననఘులింగమకుంట రామార్యునన్ను.

ఈకవి రామకృష్ణున కల్లుఁడైనట్లు పైపద్యములో నున్నది. ఈరామకృష్ణుఁడు పాండురంగ విజయాది ప్రబంధకర్తయైన తెనాలి రామకృష్ణుఁడే. అతఁడు భట్టరు చిక్కాచార్యుల శిష్యుఁడైనట్లాతని చారిత్రమున వ్రాసియుంటిని. లింగమకుంట రామకవికూడఁ దాను భట్టరు చిక్కాచార్యుల శిష్యుఁడనని యీక్రింది పద్యములోఁ జెప్పి యున్నాఁడు.

క. గురురాయ పట్టభద్రుని
నరహరు శ్రీరంగనాయకాంశభవున్ భ
ట్టరు చిక్కాచార్యుల మ
ద్గురుఁ దలఁచుచు నడుగులకు నతుల్గావింతున్.

చిక్కాచార్యులకు యౌవనదశలోఁ దెనాలి రామకృష్ణుఁడును వయసుమీఱిన పిమ్మట రామకవియు, శిష్యులై యుందురని తలంప వచ్చును. రామకృష్ణ రామకవులిద్దరును యాజ్ఞవల్క్య నియోగి బ్రాహ్మణులే.

ఈకవి రచించిన చతుర్వాటికా మాహాత్మ్య మైదాశ్వాసములు కలది. ఇందు వర్ణింపఁబడిన చతుర్వాటికయే చెదలువాడ. ఎఱ్ఱాప్రెగడ వంశీయులకు నివాసమయినదికూడ నీచెదలువాడయే. ఈ చెదలువాడయు, లింగమగుంటయుకూడ నెల్లూరు మండలములోనివి. వృద్ధకుండికయని పై సీసపద్యములో వర్ణితమైనది. దానినిప్పుడు గుండ్లకమ్మ యందురు. చెదలువాడలోనున్న శ్రీరామచంద్రు నీక్రింది పద్యములోఁ గవి నుతించియున్నాఁడు.

చ. కలశభవుండు పంకరుహ గర్భుని చేఁ గొని తెచ్చి వేడ్కఁ సం
ధిలభువనంబులోననఁ బ్రతిష్ఠితుఁ జేసిన లీల నొప్పు స
న్మలఘుజకీర్తి శోభితుని మత్కులదేవత నాదిదేవుఁ గే
వల కరుణాంబుధిన్ జదలువాడ రఘూద్వహుఁ బ్రస్తుతించెదన్.

చెదలువాడ నివాసియుఁ బండితుఁడు నగు ననంతాచార్యుఁడను వైఖానసుఁడీకవిని, చతుర్వాటికా మాహాత్మ్యమును రచియింపుమని ప్రోత్సహించిన ట్లీక్రిందిపద్యములలోఁ గవి చెప్పియున్నాఁడు.

సీ. ఏకముఖంబున నింది రావల్లభు
నర్చించుటకుఁ దానయవతరించి
విఘనసబ్రహ్మ నా వెలసిన బ్రహ్మానం
శంబున జనియించి జపితయగుచు
సమయత్రయజ్ఞాన చతురుఁడై దూరశ్రి
వణదూరదృష్టి భావజ్ఞుఁడగుచుఁ
గలియుగ వ్యాసుని కరణి మించినయనం
తాచార్యవర్యుఁ డుదారయశుఁడు

గీ. సర్వవైఖానసకులాబ్ధి చంద్రుఁడగుచుఁ
జదలువాడ స్థలంబున నుదయభాను
చందమున నుండి యొకనాఁడు సముచితాతి
శయములోఁ నన్నుఁ బిలిపించి సరణి ననియె.

ఆ. రమణఁ జదలువాడ రామునకిల్లడ
వారు మీరు నీదుపేరివాఁడు
రామసుకవి! కవితచే మెచ్చఁగను నతం
డఖిలబుధజనంబు సౌనసంగ.

ఈతఁడురచించిన, వేంకటమాహాత్మ్య, మత్స్యపురాణ, వామన పురాణము లిపుడెచ్చటను గాన్పించుటలేదు. లభించిన రెండుగ్రంథము లును సముద్రితములు. వాని తాళపత్రప్రతులు మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమునందున్నవి.

ఆనందకానన మాహాత్మ్యము కోనమంత్రి ప్రేరణముచే రచించి శ్రీవెంకటేశ్వరునకంకితముచేసెను. ఆనంద కాననమనఁగా కాశీ. కాశీ క్షేత్రమహిమయిందు వర్ణితమయినది. ఈకోనమంత్రి శుక్లయజుశ్శాఖీ యుఁడు, విశ్వామిత్రగోత్రుఁడు; కలువకూరు వాస్తవ్యుఁడు. ఈతఁడు కవినీక్రింది వాక్యములతోఁ బ్రోత్సాహపరిచెను. కలువకూరు చిత్తూరు మండలమునఁ గాళహస్తి తాలూకాలో నున్నది.

"గీ. వినుము మత్స్యపురాణ వామనపురాణ
ములును వేంకటమహాత్మ్యమును ఫలప్ర
దము చతుర్వాటికా మహాత్మ్యమును దెనుఁగు
చేసి వెలసితి వవనిఁ బ్రసిద్ధి దనర.

వ. కావున నీవ పురాణంబులు తెలుంగుసేయ సమర్థుండవు వాయు పురాణంబునందుఁ లక్ష్మీసంహితోక్తానంద కానన మాహాత్మ్యం బాంధ్రభాషావిశేషంబున రచియించి వేంకటేశ్వర పూజాంతికం బు సేయుమని యానతిచ్చిన నియ్యకొని..."

ఈతఁడు తెనాలి రామకృష్ణుని కల్లుఁడు. కావునఁ బదునాఱవ శతాబ్ది మధ్యభాగము నందున్నవాడని చెప్పుటకు సంశయింపనక్కఱ లేదు. ఈతని కవిత్వము సలక్షణమై సరసముగాను మనోహరముగాను నున్నది. శైలితెలియుటకై కొన్ని పద్యములనుదాహరించుచున్నాఁడను.

శా. శంకాటంకము లేక తారసిలి యాశాచిత్తుల్లాడఁగా
లంకానాథుఁడు వీరవిక్రమ కళాలంకారుఁడై శింజినీ
టంకారధ్వను లుల్లసిల్ల శరవీతంబుల్ పడెంటన్ మహా
హుంకారంబులు సేసె బాణనికరం బాభీలమై కప్పఁగాన్. ౧౮.

చ. కడువడి నివ్వఁజేని సుచిగాకయు నూరక బ్రహ్మకుండి లో
నడుగులు దోఁచినంతనే వియన్నది పాదమునందుఁ గల్గుమేన్
దడుపుచు రామచంద్రునకుఁ దండముపెట్టినవాని పుణ్యముల్
నుడువఁగ శక్యమా నె పదినూఱుదలల్ గలపాఁపఱేనికిన్. ౧౮.

ఉ. పాదములంటి భూలలన భాగ్యమునొందఁగఁ ద్రోవఁద్రొక్కుచున్
బాదరజఃకణంబుననే పాపము శాపమునూడ్చి పుణ్యకృ
త్పాదుఁడవై మునీశ్వరునిపై దలిఁ బావని జేసినట్టి నీ
పాదమె దిక్కుగా బ్రదుకు బ్రాహ్మణునన్ దిగనాడఁజెల్లునే. ౨౮

ఉ. రాముఁడు పోవునప్పటికి రామునికన్నను మున్నుపోయి నే
రాముని వాసయోగ్య కుథరంబగుచుండెద నంచు వచ్చి యీ
భూమిధరాకృతిన్ నిలిచి పోల్పనదో వెలిదీవినాగ ని
త్యామిత శుభ్ర కాంతి యుతమైన సితాగముఁగాంచెనంతటన్. ౪౮

మ. కనియెన్ నారదమౌని సింహము లసత్కల్పద్రుమానీకమున్
ఘనసౌధాగ్ర పతాకమున్ సురనదీకల్లోల వారీకమున్
జనితశ్రీకము దైత్యభీకర మహోజ స్ఫూర్తతాద్రేకమా
త్సనఘానంద రసప్రవాహ సురసంఘాస్తోకమున్ నాకమున్. ౪౮

ఉ. కోమల పారిజాతములు కొప్పుననున్నవి వానికంటె నీ
భూమిరుహప్రసూనములు బుద్ధిఁ దలంప నతిప్రియంబులౌ
కోమలిరమ్మటంచు నొకకుంజమునీడకుఁ దార్చి నొక్కను
తాప్రనుభటుండు వేగనొకతన్వి ననంగవిహారకేళికిన్.

సీ. వదరు తొయ్యలి తలవాకిట నిమ్మితో
నుండవాగ్వల్లభుం డొక్కవంక

వలిపెంకిపట్టి డాపలవంకఁ గనుపట్టి
యుండ సదాశివుం డొక్కవంక
పాలోమి వామాంకభాగ మధ్యంబున
నుండ పురంధరుం డొక్కవంక
తమతమ చిన్నెలెంతయు విభ్రమింపుచు
నుండ సురాసుర లొక్కవంక

గీ. సురగ లోకాధినాయకు లొక్కవంక
చుక్కలును జందమామయు నొక్కవంక
సూర్యరశ్మియు గ్రహములు నొక్కవంక
సంగములు నుండ నుండె నాభంగియసుడు.

ఉ. ఆగమశాఖలేర్పరచి యాగమతత్త్వ రహస్యముల్ మహా
భాగుఁడనన్ జనుల్దెలియ భారతసంహితయుందుఁ బల్కియున్
వేగమెచిత్తశాంతి యొదవింపగ యున్నఁ బరాశరాత్మజున్
భాగవతంబు సేయుమని పల్కె కృతార్థునిఁ జేయవే దయన్.

ఈకవికాలము క్రీ. శ. 1520_1580 అయియుండుననియు నీతని గ్రంథములు 1550_1570 నడుమ రచియింపఁబడియుండుననియుఁ దలంచుచున్నాఁడను. ఆవంద కానన మహాత్మ్య కృతి పేరకుండైన కోనమంత్రినిగూర్చి వ్రాయుట తాళపత్రప్రతి శిథిలమైయుండుటచే నేమియుఁ దెలిసినది కాదు.

# 169 చిరుమూరి గంగరాజు

ఈకవినిగూర్చి యేమియుఁ దెలియరాలేదు. ఈతఁడు కుశలవో పాఖ్యానమును రచియించినట్లందులోనివని రెండు పద్యములు రామా పెగ్గడ జగ్గనయు, ఆంధ్రసాహిత్య పరిషత్తునందున్న యుదాహరణ గ్రంథ సంధాతయు నుదాహరించి యుండుటచే నీకవినామమును గ్రంథనామము నెఱుంగఁగలిగితిమి. ఆపద్యముల నిటనుదాహరించు చున్నాఁడను.

క. హరిదాసుని వనవాసుని
బరిచితపరమోపవాసు భాసురహాసున్
సురుచిరనిగమాఖ్యాసున్
విరచితకాశీనివాసు వేదవ్యాసున్.

సీ. పదపద్మరజమునఁ బాషాణపుత్త్రికఁ
బూఁబోఁడిఁ జేసిన పుణ్యుఁ డితఁడు
బాలుఁడై హరధనుర్భంగంబు సీతకు
నుంకువ సేయు నిశ్శంకుఁ డితఁడు
మణిమయుండై యున్న మాయామృగంబుఁ
గడఁగి చంపినవేఁటకాఁ డితండు
కట్టాశిముత్యంబుకై వడి మున్నీరు
బాణాగ్రమున నిల్పుప్రౌఢుఁ డితఁడు

గీ. ప్రబలదశకంఠపటుకంఠనిబిడవిపిన
దహనకీలాయమానదోర్దండచండ
చటులకోదండనిర్ముక్తశరనికాయుఁ
డితఁడు గాకుత్స్థవంశాబ్ధిహిమకరుండు.

ఈకవి క్రీ శ. 1560 వ సంవత్సరముకంటె బూర్వుఁడు. ఇంత కంటె కవినిగూర్చినవివరము లేమియుఁ దెలియరాలేదు.

———

# 170 లింగమకుంట తిమ్మకవి

ఈతఁడు ప్రథమ శాఖానియోగి బ్రాహ్మణుఁడు; కాత్యాయన సూత్రుఁడు; కాశ్యపగోత్రుఁడు; సర్వకవిపౌత్రుఁడు; లక్ష్మణామాత్య తిమ్మాంబలకుఁ బుత్రుఁడు; మత్స్యపురాణ వామనపురాణాది గ్రంథ కర్తయగు లింగమకుంట రామకవికిఁ తమ్ముఁడు; ఆపురాణ గ్రంథలేఖకుఁడు చిక్కయభట్టరు శిష్యుఁడు.

ఈకవి సులక్షణసారమను లక్షణగ్రంథమును రచించెను. లక్షణ గ్రంథము లనేకము లున్నను, ఈతనిలక్షణసారము విద్యార్థిలోకమున నెక్కువప్రచారముఁ గాంచినది. కవి తననుగూర్చియు తాను రచింపఁ బోవు లక్షణగ్రంథమును గూర్చియు నీక్రిందిపద్యములను రచించి యున్నాఁడు.

సీ. శ్రీవైష్ణవహితుండఁ జిక్కయభట్టరు
శిష్యుండఁ గవితావిశేష శేష
తులితసర్వార్యపౌత్రుండ లక్ష్మయకుఁ ది
మ్మాంబికు సుతుండఁ బేరనకు మాచ
నకు రామకవివరునకు ననుజన్ముఁడ
నారామకవి చెప్పినట్టిమహిత
మత్స్యపురాణ వామనపురాణాది స
త్కృతుల కెల్ల లేఖకుఁడ వృద్ధ
కుండికాతీరలింగమకుంటనామ
పట్టణస్థితకుండ సౌభాగ్యయుతుఁడ
నాదిశాఖాప్రవర్తన మమరువాఁడఁ
గాశ్యపగోత్రుఁడను దిమ్మకవిని నేను

క. లక్షణశాస్త్రము లెల్ల బ
రీక్షించుటఁ గొంతగొంత యెఱిఁగినవాఁడన్

లాక్షణకాదులు మెచ్చను
లక్షణసారం బొనర్తు లక్ష్యము లమరన్.

తే. కొందఱెంచు లక్షణములఁ గొందఱెంచ
రందఱును నెంచునవి గొన్ని యవియు నవియుఁ
దొరయఁగా గూర్చి కవిసమ్మతులను వ్రాయు
దొకటి కొకటికి సంస్కృతాంధ్రోక్తులెనయ

తే. గ్రంథసామగ్రి గలుగుటఁ బ్రతిపదమున
కన్నిలక్షణములు వ్రాయు దనిన నందు
గ్రంథవిస్తారమగుఁ గానఁ గవితసూత్ర
మెన్నిటను దేటపడు నన్నియే లిఖింతు.

ఈకవి నివాసము నెల్లూరు మండలములోని లింగమగుంట గ్రామము. గుండ్లకమ్మ నదతీరమున నున్నది. దీనినే వృద్ధకుండిక యనెదరు. ఈకవియు సోదరునివలెనే తనగ్రంథమును చెదలువాడ యందలి శ్రీరామచంద్రున కంకితము చేసెను.

తెనాలి రామకృష్ణకవియు నీతఁడును చిక్కభట్టరు శిష్యులు. కావున నీకవులిరువురును సమకాలికులును బంధువులునై యున్నారు. ఈవిషయమున రామకవిచారిత్రమునఁ గొంతవ్రాసియున్నాఁడను. ఈ కవి పదునాఱవ శతాబ్ధియందు మధ్యకాలమున నున్నవాఁడని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

ఈకవికాలమునుగూర్చి శ్రీవీరేశలింగముపంతులుగారు "రామకృష్ణునితోడి సమకాలీనుఁ డగుటచేత లింగమకుంట తిమ్మకవి 1620 సంవత్సర ప్రాంతములయందున్నవాఁడు. ఇతఁడు వృద్ధదశలోఁ గాకనూరి యప్పకవికాలములో సహిత ముండియుండవచ్చును" అనివ్రాసియున్నారు. ఈయభిప్రాయముతో నేనేకీభవింపఁజాలను. అనేక కారణములను జూపుచు రామకృష్ణకవి క్రీ. శ. 1500–1560 నడుమ నున్నవాఁ డనియాతని చారిత్రమున వ్రాసియుంటిని. (ఆ. క. త. 8 సం.

పుట 17) కావున నీతిమ్మకవియు నీతనియగ్రజుఁడగు రామకవియు రామకృష్ణకవికంటె 20—25 సంవత్సరములు వయసున చిన్నవారై రామకృష్ణకవితో సమకాలికులై 1550 ప్రాంతమునందమ తమ గ్రంథములను రచియించియుందురని నిర్ణయింపవచ్చును.

ఇప్పుడు మనకు లభించుచున్న సులక్షణసార ముద్రితప్రతి సరియైనది కాదు. ఈవిషయమున శ్రీపంతులు గారాంధ్రకవులచరిత్రమున "ఇప్పుడు ముద్రితమై యున్న సులక్షణసారమునకును నాయొద్దనున్న యముద్రితపుస్తకమునకును మిక్కిలి వ్యత్యాసము కనబడుచున్నది" అని వ్రాసియున్నారు. తిమ్మకవివిగాని పద్యము లనేకము లిందుఁజేరినవి. తాళపత్రప్రతులు పరిశోధించి, తిమ్మకవి సులక్షణసారమును సిద్ధపుముగ బ్రకటించుటకు మిగుల నావశ్యకమై యున్నది.

ఈ గ్రంథమున కముద్రితప్రతియొకటి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునం దున్నది.

ఆప్రతిలో గ్రంథాంతముననున్న :— (R. No. 11)

గీ. భీమనయు, ననంతయయును బెద్దనయును
  దాతెనయుఁ జెప్పినట్టి ఛందములుగూర్చి
  ప్రకరణము లొప్పఁ జేసెను బ్రహ్మసంఖ్య
  నొనర లింగమకుంట తిమ్మనుకవియు

అనుపద్యమునుబట్టి యీకవి సులక్షణసారమును దొమ్మిదిప్రకరణములుగా రచియించినట్లు గన్పట్టుచున్నది. ముద్రితప్రతిలో ప్రకరణ విభాగమే కాన్పింపదు ఈపద్యమందలి పెద్దన చిత్రకవి పెద్దనయై యుండును. ఆపెద్దన తిమ్మకవితో సమకాలికుఁడు. అతనిలక్షణగ్రంథము నీతఁడు చూచి యందలి లక్షణములను గొన్నిటిని జేకొనియుండును. ఈతని కవిత్వశైలి చూపుటకై శ్రీవీరేశలింగముపంతులుగా రుదాహరించిన రెండు పద్యముల నీక్రింద నిచ్చుచున్నాఁడను.

మ. విను మీరీతియటంచుఁ గావ్యకరుఁడై వెల్లంకితాతప్ప చె
ప్పిన సూత్రంబులు కల్లఁగాఁ గనఁబడెన్ వీక్షింపనెట్లన్నచో
మును దీర్ఘంబులపై అకారములకే పూర్ణస్థితప్రజ్ఞ గా
దనియెన్ లింగమగుంట తిమ్మకవి నేఁ దర్కింతు నిప్పట్టునన్

చ అనుచు నదేమొకో మును రచుంబున లక్షణసారసంగ్రహం
బెనయ వచించెఁ జిత్రకవిపెద్దన లెస్సవు వోఘు వోధ్రు శ
బ్దనయత గానరో వినరొ తద్ధను లెంతయు ధన్యులయ్యుమే
ల్గన భ్రమగాంతు రాత్మల నొకానొకచోటఁ బరాకుగమ్మఁగన్.

ఈపద్యములు ముద్రితప్రతిలోఁ గానరాలేదు.

ఈతిమ్మకవి బాలురకు సుబోధకముగా నుండుటకై బాలబోధ ఛందస్సు అనుపేర వేఱొక ఛందోగ్రంథమును రచియించినట్లు కన్పట్టు చున్నది. ఈవిషయమున శ్రీ నిడదవోలు వేంకటరావుపంతులు M A. గారిట్లు వ్రాసియున్నారు. (భారతి, యువసంవత్సర మాఘమాసము. పుట 165.)

"లింగమకుంట తిమ్మన బాలబోధచ్ఛందస్సును వ్రాసినట్లు పాకనాటియందుఁగల కౌలూరి యాంజనేయకవి దన సుకవికర్ణామృతమను లక్షణగ్రంథమున వ్రాసియున్నాఁడు.

సులక్షణ సారముగాక బాలబోధచ్ఛందస్సుగూడ తిమ్మనకవి రచియించి యుండవచ్చును. ఇందపూర్వ గ్రంథములనుండి పద్యము లుదరింపఁబడినవి. శ్రీరామకృష్ణకవిగారు దీనికి బాలబోధమనియుఁ గవిసంజీవని యనియు సందిగ్ధనామములు గలవని వ్రాసియున్నారు. ప్రభాకరశాస్త్రులవారు క్రీడాభిరామ గ్రంథపీఠికలో నీఛందస్సును గూర్చి యిట్లు వ్రాసియున్నారు.

బాలబోధచ్ఛందస్సుకర్త పేరెరుఁగరాదు. అందు బహుప్రాచీనములైన గ్రంథను లుదాహృతములయ్యెను. అప్పకవికంటెఁ దత్కర్త ప్రాచీనుఁడు గాఁదగును. అది ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోఁ గొంత

కలదు. బ్రహ్మశ్రీ మా. రామకృష్ణకవిగారి దగ్గఱఁ గొంతగలదు. వారు దఱచుగా నక్కడక్కడ నుదాహరించుచువచ్చిన ప్రాచీన పద్యరత్నములనేకములందలివి. రత్నఖనియగు నాగ్రంథమును గూర్చి వేరుగా నొకవ్యాసమును వ్రాయుదును.

పై యుద్ధృతాంశములఁబట్టి ఈఛందస్సు ప్రాశస్త్య మెఱుఁగఁద గును. లింగమకుంటతిమ్మన యప్పకవికిఁ బూర్వుఁడగుటచేతను, నాంజ నేయకవి తిమ్మన దీనిని రచించినట్లు చెప్పియుండుటచేతను తిమ్మనయే యీగ్రంథము రచియించియుండునని తలంపవచ్చును."



## 171 నెల్లూరి ముత్తరాజు

రామాప్రెగ్గడ జగ్గనకవి తన ప్రబంధరత్నాకరమున నెల్లూరి ముత్తరాజు పద్మావతీ కళ్యాణములోనిదని యీక్రిందిపద్యము నుదా హరించియున్నాఁడు. ఇప్పుడాగ్రంథ మెచ్చటను లభ్యమగుటలేదు. అందుచేఁ గవిచారిత్రమేమియుఁ దెలియరాలేదు.

క. నీవెంత వేఁడుకొన్నను
గేవల పాతకుల కేలఁగృపపుట్టు మదిన్
దేవుఁడు 'నహి' గురువున్ 'నహి'
భావజచంద్రులకు వికచపద్మదళాక్షీ.

జగ్గనకవి క్రీ. శ. 1560 ప్రాంతమువాఁడు. కావున నీకవి యంతకుఁ బూర్వుఁడని యనుటకంటె నితని విషయమున నేమియుఁ వ్రాయఁజాలను. నెల్లూరి వీరరాఘవకవి, నెల్లూరి శివరామకవి యను నిరువురు కవులున్నారు. వారి చారిత్రముల నీకవితరంగిణియందు వ్రాయుదును. ఈకవి వారివంశములోని పూర్వుఁడేమో తెలియదు. ఈపద్మాకృతి ఎవ్వరో తెలియదు. పై పద్యము నాయికా విరహావర్ణ నములోనిది. నూతనభావముతో నొప్పారుచున్నది.

# 172 కాసె సర్వప్ప

ఇతఁడు మల్లనమంత్రి కుమారుఁడు; వరంగల్లు ప్రాంతనివాసుఁడు, ఇంతకంటె నితనిచారిత్ర మేమియుఁ దెలియదు.

"ఈకవి సిద్ధేశ్వర చరిత్రమను నామాంతరముగల ప్రతాపచరిత్ర మును ద్విపద కావ్యముగా రచించెను." అని కవుల చరిత్రకారులు వ్రాసియున్నారు. గోలకొండకవుల సంచికనుబట్టి యీరెండును వేఱు వేఱు కావ్యములని తోఁచుచున్నది ఈగ్రంథములేక గ్రంథములు ముద్రితముకాలేదు. తాళపత్రప్రతులును గన్పించుటలేదు. అందుచే నీవిషయమును నిర్ణయింపఁజాలము. ఈగ్రంథమునఁగాకతీయ ప్రభువుల చారిత్రము వర్ణితమైనదని తోఁచుచున్నది. ప్రతాపచరిత్రమునకు సిద్ధేశ్వర చరిత్రమని నామాంతరమెట్లువచ్చెనో తెలియదు. ఈగ్రంథ మందలి కొన్నిద్విపదల నుదాహరించియుండుటచే శ్రీవీరేశలింగము పంతులుగారాగ్రంథమును జూచియుందురనియు రెండుపేరులుగల యా గ్రంథ మొకటియే యనియుఁ దలంపవలసియున్నది. శ్రీపంతులుగా రుదాహరించిన యీక్రింది ద్విపదలవలన నీకవిపేరును దండ్రిపేరును దెలియుచున్నవి.

ఇది శ్రీసకల విద్వదిభ పాదకమల
సదమల సేవన సభ్య సంస్మరణ
భాసుర సాధుభావనగుణానూన
భూసురాశీర్వాద పూజనీయుండు
కాసె మల్లనమంత్రి ఘనకుమారుండు
వాసిగాఁజెప్పె సర్వప్పనునతఁడు.

ఈతని గ్రంథమునుండియే కూచిమంచి జగ్గకవి తన సోమదేవ రాజీయమునందు విశేషభాగము గ్రహించియున్నాఁడు.

ఈకవికాలమునుగూర్చి శ్రీవీరేశలింగము పంతులుగారు "ఈకవి కాలమెప్పుడో నిశ్చయముగాఁ దెలియదు. కాని యితని గ్రంథము

మిక్కిలి పురాతనమైనదనుటకు సందేహములేదు. ఇతఁడు ప్రతాపరుద్రుని యనంతరమునఁ గొంతకాలమయినతరువాత నుండినవాఁడు" అని వ్రాసియుండిరి. గోలకొండకవుల సంచికలో ఇతని కాలము క్రీ. శ. 1400 ప్రాంతమనియుఁ "కవితావిషయముకంటెఁ జరిత్రాంశమున నితనివి ప్రమాణగ్రంథములనియు, వరంగల్లు ప్రాంతవాసియగుట నిచటి ప్రవాదములను గ్రంథస్థముగావించె" ననియు వ్రాసియున్నారు. ఈకవి వ్రాసియుంచిన చారిత్రాంశము లీగ్రంథప్రతి లభింపకపోవుటచే నాకీగ్రంథము వ్రాయునప్పుడుపయోగింపలేదు.

ఈకవికాలమును నిర్ణయించుటకుఁ దగిన యాధారములు నాకే మియు దొరకకపోవుటచే నేమియుఁ జెప్పఁజాలను.

ఈతని కవితయందు లక్షణవిరుద్ధములైన ప్రయోగములనేకములు గానఁబడుచున్నవని శ్రీవీరేశలింగము పంతులుగారు వ్రాసియున్నారు. శ్రీపంతులుగా రుదాహరించిన కొన్నిపంక్తుల నీతనిశైలి చూపుటకీ క్రిందఁ బొందుపరచుచున్నాఁడను.

సారెసారెకుఁ జేరి సన్నుతుల్ సేయ
సారపారావార సరసగంభీర
సారుఁడై కీర్తివిస్తారుఁడై యలరు
నారీతి గణపతి నటుచూచు వేడ్కఁ
దిక్కున సోమయాజక్కడ కొకట
దిక్కుదిక్కులనుండి తెరలి విద్యార్థు
లక్కడక్కడను గావ్యముల శ్లోకార్థ
మొక్కొక్క విధమున నొగివినిపింప.

—౯ ౯—

## 173 పెద్దిరాజు రామరాజు

కాకునూర్యప్పకవి తనయప్పకవీయమున ఈవని పెద్దిరాజు రామరాజు చాటుధారలని యీక్రింది రెండుపద్యముల నుదాహరించి యున్నాఁడు.

క. "ఇమ్మహిలో మహనీయ గు
ణమ్ముల నీసాటిగలరె నానావిధ దే
శమ్ముల శ్రీరాముని సీ
తమ్మా మాయమ్మ నిత్యహర్షములిమ్మా!

క. ఇమ్మా మదభీష్టంబులు
కొమ్మా మాౘ్రమొక్కులెల్ల గురుమతితో మా
యమ్మా రఘునందను సీ
తమ్మా సౌభాగ్యసిద్ధి దాయని వమ్మా!"

ఈవని పెద్దిరాజనుటచే సీతఁడు గుంటూరు మండలములోని ఈవని గ్రామవాస్తవ్యుఁడేమోయని యూహ కలుగుచున్నది. అప్ప కవికంటెసీతఁడు పూర్వుఁడు. కావునఁ బదునాఱవ శతాబ్దివాఁడని తలంపవచ్చును. ఈతఁడు రచించిన గ్రంథములేవియో తెలియదు. ఈపద్యములు చాటుధారలనుటచే నొకగ్రంథములోనివి కావనితోఁచు చున్నది. ఇంతకంటె సీతనిఁగూర్చి యేమియుఁ దెలియదు.

—**—

## 174 శంకరకవి

ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; అపస్తంబసూత్రుఁడు; కౌండిన్యగోత్రుఁడు; దేచనామాత్య పుత్త్రుఁడు. ఈతని గృహనామ మేదియో తెలిసినది కాదు.

ఈకవి హరిశ్చంద్రోపాఖ్యానము నయిదాశ్వాసముల ప్రబంధముగా రచియించి, ఈదూరి యెల్లయామాత్యున కంకితము చేసెను.

కృతిపతి యీగ్రంథమును దన కంకితము చేయుమని కోరినట్లు కవి యీక్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

మ. ననుఁ గౌండిన్యమునీంద్ర గోత్రజు సుధాంధస్సింధుకల్లోల తు
ల్యనిరాఘాటవబోధురంధరుని దేచామాత్యు సత్పుత్త్రుఁ బావన
చారిత్రు శశాంకమౌళి పదసేవాలబ్ధ సాహిత్య స
ద్ధనునిన్ బంధువిధేయు శంకరకవిన్ దాక్షిణ్యపుణ్యాధికున్.

తే. మమత రావించి యుర్వాసనమున నునిచి
తత్పరతమీఱ గంధాక్షతంబు లాది
గాఁగఁ గర్పూర తాంబూల కనకభూష
ణాంబరంబులు దనియ నందంద యొసఁగి.

తే. సప్తసంతానములలో యశస్కరంబు
కృతియె కావున నీవొనరించునట్టి
నిరుపమాన హరిశ్చంద్ర నృపచరిత్ర
మంకితముసేయు నాపేర ననఘచరిత.

కవి యాశ్వాసాంతములయందు వ్రాసికొనిన గద్యయిట్లున్నది.

"ఇది శ్రీమదాపస్తంబసూత్ర పవిత్ర కౌండిన్య మునిచక్రవర్తి గోత్ర సకల సుకవి జనానీకమిత్ర దేచనామాత్యకుమార నవియవివేక విద్యాలంకార శంకరకవి నామధేయ ప్రణీతంబయిన హరిశ్చంద్రోపాఖ్యానంబను మహాప్రబంధంబు.

ఈగ్రంథమునుబట్టి కవినిగూర్చిన విశేషము లింక నేమియుఁ దెలియరాలేదు. కవినివాసమును దెలియదు.

కృతిపతియైన యాదూరి యెల్లయామాత్యుఁడు ఈదూరునకుఁ గరణమైనట్లునుఁ గోదావరి నదీప్రాంతమైన కారుకొలను గ్రామనివాసుఁడైనట్లును, కేదారగురుని శిష్యుఁడైనట్లును, నీక్రింది పద్యములవలనఁ దెలియుచున్నది.

సీ. ఆర్యానుకూల కృత్యంబు శంభునియందుఁ
దనయందుఁ గలుగంగఁ దనరినాఁడు
భూరి సుదర్శనస్ఫూర్తి కృష్ణునియందుఁ
దనయందుఁ గలుగంగఁ దనరినాఁడు
చతురాననప్రౌఢి జలజాసనునియందుఁ
దనయందుఁ గలుగంగఁ దనరినాఁడు
ప్రబల భోగోన్నతి ఫణివల్లభునియందుఁ
దనయందుఁ గలుగంగఁ దనరినాఁడు

తే. మతి వితర్కింపఁ గేవలమంత్రిమాత్రుఁ
డే ధనంజయ బాహుశౌర్యాధికుండు
సత్యవర్తనుఁ డీడూరి శాసనుండు
హితవచోహారి బాచయయెల్ల శౌరి.

వ. అమ్మంత్రి నిధానంబునకు నిజస్థానంబు.

మ. అరవిందాసన వాసవాద్యమర లోకారాధ్య కర్కోటకే
శ్వర కారుణ్యపదాభిరక్షితము భాస్వద్దీప్తి మదూర్పానురో
త్కర నిత్యశ్రుతి పాఠనిస్వనముదాత్తశ్రీ నజస్రంబు లి
ధ్దరణిం దేర్కొనఁబొల్పుఁ గార్కొలను గోదావర్యుపాంతంబునన్

శా. వేదార్థప్రతిపాదన ప్రకటచిద్విద్యాధురీణుండు సా
ధూదర్కుండు కళావతంసుఁడు సమగ్ర ప్రాభవాఢ్యుండు నై
కేదారేశ గురుండు సత్కృపఁ గటాక్షింపఁగ వర్ధిల్లు ని
త్యోదార ప్రతిభాగుణాభరణుఁ డీడూరెల్ల నార్యుండిలన్.

ఈకృతిపతి కుతుబనమల్కుని యనుగ్రహము బడసినవాఁడై జల
సీమారక్షణమున నియోగింపఁబడిన ట్లీక్రింది పద్యమున పంచమాశ్వా
సాంతమునఁ జెప్పబడినది.

క. అలఘు ప్రతాపకుతుబన
మలకేంద్ర కృపాసమగ్ర మహిమాన్విత కో

రొట్టెలని గ్రామని కేతన!
జలసీమారక్షణైక చాతుర్యనిధీ!

ఈ కుతుబనమల్కు గోలకొండ నవాబుగా నున్నట్టియు, యిబ్రహిమ్ కుతుబ్ షాహా కుమారుడైనట్టియు, మహమ్మదు కుతుబ్ షాహా యని యభిప్రాయపడి బ్ర. శ్రీ. వీరేశలింగము పంతులుగారు "ఇతడు క్రీ. శ. 1581 వ సంవత్సరము మొదలుకొని 1611 వ సంవత్సరము వఱకును గోలకొండలో రాజ్యము చేసినందున కవియు నప్పుడేయుండి పదునాఱవ శతాబ్దాంతముననో పదునేడవ శతాబ్దాదియందో యీ పుస్తకమును చేసియుండును." అని వ్రాసియున్నారు. పై పద్యములోని కుతుబనమల్కును మహమ్మదు కుతుబ్ షాహాయని యెంచుటకు పంతులుగారి కెట్టియాధారము లభించినదో చెప్పఁజాలను. కుతుబనమల్కు అను పేరు కులీకుతుబ్ షాహాకుమాత్రమే అన్వయించునని నాయభిప్రాయము. ఇతని కొడుకులును మనుమలునుగూడ కుతుహాషాహాలనియే పిలువఁబడుదురు. కాని యాశబ్దమునకుముందు వారిపేరులను జేర్చి జంసద్ కుతుబ్ షాహా, ఇభరామ్ కుతుబ్ షాహా, మహమద్ కుతుబ్ షాహా అని యనుచుందురు. నేను తలంచినట్లు కృతిపతి కాశ్రయుఁడైన కుతుబనమల్కు కులీకుతుబ్ షాహా అయినయెడల, నతఁడు క్రీ.శ. 1511 మొదలు 1543 వఱకును రాజ్యము చేసినవాఁడు. కావున, కృతిపతియుఁ గవియుఁగూడ నాకాలమున నున్నవారనియుఁ హరిశ్చంద్రోపాఖ్యాన మాకాలమున రచితమయినదనియుఁ జెప్పవచ్చును. కృతిపతి కేదారగురుని శిష్యుఁడని పైని వ్రాసిన పద్యములలోనున్నది. ఇబ్రహిమ్ (మల్కిభరామ్) కుతుబ్ షాహాకు తపతీసంవరణోపాఖ్యానమును గృతినిచ్చిన అద్దంకి గంగాధరకవియును గేదారగురునిశిష్యుఁడే. ఈయిరువురి గురువులు నొకేవ్యక్తియని నాయభిప్రాయము. గంగాధరకవికంటె కేదారగురువు వయసునఁ బెద్దవాఁడై యుండునుకదా! అందుచే నతనిని మహమ్మదు కుతుబ్ షాహా కాలములో నున్నాఁడనుటకంటె అతని తాతయైన కులీకుతుబ్ షాహా కాలములో నున్నాఁడని తలంచుటయే యుక్తము.

కులీకుతుబ్ షాహాతో సమకాలికుఁడగు అద్దంకి గంగాధరకవి తన తపతీసంవరణోపాఖ్యానకృత్యాది యందు మహమ్మదీయ ప్రభువును శంకరకవివలెనే "గుతుబనమలక" యనియే చెప్పియున్నాఁడు.

"నితర ధరణీతలాధీసులెవ్వరికిఁ
పృథివిఁ గుతుపనమలుక చక్రేశ్వరునకు."

కావునఁ గవియుఁ గృతిపతియుఁ బదునాఱవ శతాబ్దియందుఁ బ్రథమార్థమున నున్నారని నిశ్చయింతము.

కృతిపతి నివాసము కొర్గొలను అని యొకపద్యములోను కోర్గొలను అనియొక పద్యములోనున్నది గోదావరి మండలమందలి భీమవరము తాలూకాలో 'కొరుగొల్లు' అను గ్రామమున్నది. అదియే కృతిపతి నివాసము. 'గోదావర్యా ప్రాంతంబునన్' అని పైని వ్రాసిన వాక్యము నాయూహను బలపఱచుచున్నది. భీమవరము తాలూకా ప్రదేశముల నిప్పుడు 'జల్లిసీమ' యని వాడుచున్నారు. పైని వ్రాసిన కందపద్యములోని 'జలసీమ'యే యిప్పుడు జల్లిసీమయైనది. భీమవరము తాలూకాలోని కొల్లేరు సరస్సునుబట్టి యాప్రాంతమునకు జలసీమయని పేరు వచ్చియుండును. కృతిపతిని ఈడూరి పురశాసనుఁ డనఁగా ఈడూరునకుఁ గరణమని పైని వ్రాసియున్నాఁడను. ఈయీడూ రెచ్చటనున్నదో తెలిసికొనవలసియున్నది నెల్లూరు మండలములో నొక ఈడూరున్నది. కాని యది గోదావరీ నదీప్రాంతముకాదు. కావున నాయీడూరు కానేరదు. తూర్పుగోదావరీ మండలమునఁ దుని తాలూకాలో నొక ఈడూరున్నది. అదియే యిందు చెప్పిన యీడూరు. కృతిపతి వంశమునకు మూలపురుషుఁడైన లింగామాత్యుఁడు బల్లికురువపురాంకుఁడై నట్లీక్రింది పద్యములోనున్నది.

తే. ఆమునీశ్వరు వంశదుగ్ధాంబునిధికిఁ
పూర్ణనీహారకిరణుఁడై వర్ణనీయ
మహిమవిలసిల్లె లింగనామాత్యవర్యుఁ
డనఘమతి బల్లికురువ పురాంకుఁడగుచు.

ఈబల్లికురువపురము కమ్మనాటిలో నున్నది. ౧. ఈలింగనామాత్యుఁడో యాతని పూర్వులో యాడూరునకువచ్చి కొంతకాలము తమపూర్వగ్రామముపేర 'బల్లికురవ'వారని పిలువఁబడుచుఁ దరువాత నీడూరు నివాసనిమిత్తముగ నీడూరివారైరని తలంపవలసియున్నది.

లింగనామాత్యుని తనయుఁడైన పెగ్గడయ్య ఉండికరణమైన వీరనమంత్రి పుత్రికఁ దిప్పమాంబికను బరిణయమైన ట్లీక్రిందిపద్యము వలనఁ దెలియుచున్నది.

చ. ప్రెగడనమంత్రి బంధుజనబృందము పేర్కొన నుండిశాసనుం
డగుమతిశాలి వీరసచివాగ్రణి పుత్రికఁ దిప్పమాంబికం
దగుమహిమన్ వివాహమయి ధన్యచరిత్రులఁ గాంచెఁ బుత్రులన్
జగదభివర్ణనీయుల విశాలయశోవిభవాభిరాములన్.

ఈపద్యమునఁజెప్పఁబడిన ఉండియను గ్రామముకూడ భీమవరము తాలూకాలోనే యున్నది. కృతిపతిభార్య యైనభవాని, సత్తిరాజు లింగయామాత్యునిపుత్రి యై నట్లీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

గీ. సరస సారస దినరాజు సత్తిరాజు
లింగయామాత్యపుత్త్రి నాళీకనేత్ర
రూపగుణశీల నుతభవానీపురంధ్రి
నెలమి వరియించె నీడూరి యెల్లమంత్రి.

సత్తిరాజు లింగయామాత్యుని దేగ్రామమనో చెప్పలేదు. కాని సత్తిరాజువారు తణుకు భీమవరము తాలూకాలలో నున్నారు. వీని నన్నిటినిబట్టిచూడఁగాఁ గృతిపతినివాసము గోదావరిమండలమనియే నిశ్చయింపఁదగియున్నది.

కృతిపతి కేవలము కరణముమాత్రమే కాక దండనాథుఁడై యుండెననియు, కృతిపతితండ్రియైన బాచయామాత్యుఁడుకూడ, దండనాథుఁడనియుఁ గవి యీక్రిందిపద్యములలో వ్రాసియున్నాఁడు.

---

౧. ద. హిం. శా. సం. ౬ సంఖ్య ౬౨౨.

తే. వింద వీడూరియెల్ల పృథ్వీకళత్ర
దండనాథయశః కాంతిమండలములు
దిక్సరోజాతలోచనాదీర్ఘకర్ణ
కోణముక్తాఫలభ్రాజికుండలములు

కొలను గణపతిదేవకవి రచించిన శివయోగసార కృతిపతియగు "ఈడూరినూకనారాధ్యుఁ" డీవంశమునకుఁ జెందిన పూర్వుఁడనితోఁచు చున్నది. ఈనూకనారాధ్యుఁడో యీతనిపూర్వులో బల్లికురువనుండి యీమండలమునకు వచ్చియుందురు. వారినిబట్టి యీలింగనామాత్యుఁ డును యీడూరునకు వచ్చి యీడూరివారిలోఁ గలిసిపోయియుండును.

ఈశంకరకవి నెల్లూరిమండలమువా డనిబ్రౌనుపండితుఁడువ్రాసి యున్నాఁడు కవిచరిత్రకారు "లీకవినెల్లూరుమండలమువాఁడు కాఁడ నియు, నెల్లూరుమండలమునుండి వెదకికొనుచు వచ్చి గోదావరిమండ లములోనియొకకరణమునకుఁ గృతియిచ్చినాఁడని తలంచుట సమంజ సము కాదనియు వ్రాసియున్నారు. అద్దంకిగంగాధరకవియు నితఁడును సహాధ్యాయులు. కేదారగురు వేగ్రామనివాసుఁడో తెలియుటలేదు. ఈ విషయమింకను విచారణీయమైయున్నది. కృతిపతితండ్రియైన బాచయా మాత్యున కిరువురు భార్యలు. అందొకయామె పెండెకల్లు కరణము కుమార్తె యైన ట్లీదిగువపద్యమువలనఁ దెలియుచున్నది.

చ. అనఘుఁడు మల్లెపూడికొమరాధిపుకూరిమిపుత్త్రి సద్గ్రనం
దన కెన యైనపద్మనయనం బెదలింగమఁ బెండెకల్లుశా
సనుఁ డగుపర్వతయ్యసుతఁ జంద్రముఖిం బినలింగమాంబ నిం
పెనయ వివాహమయ్యె విభవేంద్రుఁడు బాచయమంత్రియున్నతిన్.

ఈపెండెకల్లయే యిప్పుడు పెండ్యాల యని వాడఁబడుచున్నదని న్యూయెల్ పండితుఁడు (సంపుటము 1 పుట 87) వ్రాసియున్నాఁడు. పెండికల్లువారిప్పు డాప్రాంతములయందున్నారు. ఈగ్రంథమునఁ జెప్పఁ బడినకథ సుప్రసిద్ధమైనది. హరిశ్చంద్రకథ మార్కండేయపురాణమునఁ

గొంత విపులముగానే యున్నది. ఈకథ ఋగ్వేదమునందుఁగూడ నున్నదఁట. ఈకథను గౌరనమంత్రి ద్విపదకావ్యముగా రచియించియున్నాఁడు. దానినిబట్టి యీశంకరకవియు కంచివీరశరభకవియుఁ బద్యకావ్యములను జేసియున్నారు. శంకరవీరశరభకవులిరువురును సమకాలికులని శ్రీవీరేశలింగముపంతులుగారు వ్రాసియున్నారు. కాని యదిసత్యమనుట కాధారములు దొరకలేదు. శంకరకవికంటె వీరశరభకవి యర్వాచీనుఁడు.

కృతిపతి గోదావరిమండలమువాఁ డనినిశ్చయమైనది. శంకరకవి బ్రాహ్మణుండేయుఁ డనినట్లు నెల్లూరుమండలమువాఁడు కాకపోయినను కమ్మనాఁటిలోని బల్లికురువ ప్రాంతమువాఁడేమో యనియు కృతిపతి వంశమువారు బల్లికురువనుండి గోదావరిమండలమునకు వచ్చియుండుటచే నాపరిచయమునుబట్టి, కవియు నిచ్చటకు వచ్చి యెల్లయామాత్యునకుఁ గృతి నిచ్చియుండునని తలంపవచ్చును.

కవితండ్రి దేచయామాత్యుఁ డని గద్యవలనఁ దెలియుచున్నది. తెనాలి రామకృష్ణకవికృత ఉద్భటారాధ్యచరిత్ర కృతిపతి దేచనామాత్యుఁడు. ఆతఁడును కౌండిన్యగోత్రుఁడే. ఆదేచనామాత్యుడు సర్వదా శంకరకథావ్యాసంగముగలవాడని యుద్భటారాధ్య చరిత్రమునందున్నది. ఆతనికుమారుఁ డీశంకరకవియనియు శంకరపద ధ్యానతత్పరుఁడగుట చేతను జంద్రశేఖరమానిశిష్యుఁడగుటచేతను దేచయామాత్యుఁడు తన కుమారునకు శంకరనామముంచియుండుననియు నూహకలుగుచున్నది. కాల మిందుల కాటంకము కలుగచేయదు. ఉద్భటారాధ్యచరిత్రరచనాకాలము క్రీ. శ. 1525 ప్రాంతమని తెనాలి రామకృష్ణచారిత్రమున వ్రాసియుంటిని. అప్పటికీశంకరకవికిఁ బది, పదునై దేండ్లుండెనేని, కులీకతుబ్షాకాలములోఁ దనయిరువదియైదు, ముప్పదేండ్ల ప్రాయమున ననఁగా క్రీ. శ. 1535–1540 ప్రాంతమున నీకావ్యమును రచియించి యుండును. ఈయనుమానమును సత్యమని ధ్రువపర్చుట కాధారము లిప్పటికి నాకు లభింపలేదు. ఇందునుగూర్చి యింకను బరిశోధనము జరుగవలసియున్నది.

కవిచరిత్రకారులనినట్లు యీకవి కవిత్వము మృదుమధురపాకము గలదయి రసవంతమయి సహృదయ హృదయాహ్లాదకరముగా నున్నది. ఇందలి పద్యములను గొన్నిటిని గౌరనచారిత్రమున నుదాహరించి యున్నాఁడను. మఱికొన్ని పద్యముల నిట వ్రాయుచున్నాఁడను.

ఉ. పౌరసితంబినీజనుల పయ్యెద లొయ్యనఁ దూఱి పీనవ
క్షోరుహాలిప్తసంకుమదకుంకుమచందనపంకవిస్ఫుర
త్సౌరభము ల్మనోజ్ఞగతి సారెకుఁ గ్రోలి పటీరభూమిభృ ౧ ఆ
న్మారుత మప్పురి న్మెలఁగు మాంద్యముఁ జల్లదనంబుఁ జూపుచున్.

చ. మలయజశైత్యయుక్తములు మానసము ల్విలయోష్ణభానుమం
డలకిరణాతితీక్ష్ణములు నాలుక లెప్పుడు మానికోటికిం
దలఁప ననుగ్రహించినఁ బితామహుఁ జేయుదు రల్పునైనఁ బే
రలుక వహించిరేని, కడునల్పునిఁ జేయుదు రప్పితామహున్. ౨ ఆ

శా. ఎట్టెట్టో! మిము నొక్కమానవుఁడు దా నెంతే నహంకారియై
బిట్టుల్కం దెగి యింత చేసెనె కడున్ భీభత్సరూపంబుగాఁ
గట్టా నేఁగతి నింక వాఁడు నిలువంగా నేర్చు నాముందటన్
జట్టల్చి తెదఁ బొట్టవ్రచ్చెద భుజాశౌర్యం బవార్యంబుగన్. 3 ఆ

చ. హరిపదపూజకుం దొలఁగి యంత్యజుఁ గొల్చి కులాభిమానమున్
సరగున వెచ్చపెట్టి హరిచందనకీర్తులు వీటిఁబుచ్చి దు
ష్కర మగువల్లకాటి కధికారమువచ్చిన దుష్టబుద్ధికిం
గరుణ దలంప నక్కడిదె గంధగజేంద్రసమానగామినీ.

హరిశ్చంద్రునిభార్య చంద్రమతి, కుమారుని మృతకళేబరమును దీసికొని దహనము గావించుటకై శ్మశానమునకు రాఁగా శ్మశానసుంకముక్రింద నొకమాడ యిచ్చినగాని శవమును దహింపనీయనని హరిశ్చంద్రుఁ డామె నాటంకపరచెను. అప్పుడామె తనయువస్థనుగూర్చి దుఃఖించుచుండ నాతఁడామెతో

చ. కుదురు మెఱుంగు నిబ్బరపుగుబ్బలపై నయనాంబుపూరముల్
సెదరఁగ నేలయేడ్చెదవు చెల్వ! దురంతవిషాదవేదనా
విదళితమానసాబ్జ వయి, వేమఱు నాయువుశాశ్వతంబె సం
పదలు స్థిరంబులే విధివిపాకము దాఁటఁ దరంబె యేరికిన్.

అనిపలికినట్లు శంకరకవి గ్రంథమునందున్నది. ఈపద్యము రామరాజభూషణుఁడు రచించిన హరిశ్చంద్ర నలోపాఖ్యానమునందును గలదు. రామరాజభూషణునికంటెఁ శంకరకవి పూర్వుఁడు. కావున నాతనిపై గ్రంథచౌర్యదోషమారోపింప వీలులేదు రామరాజభూషణుఁడు మహాకవి. వసుచరిత్రాది మహాకావ్యకర్త. ద్వ్యర్థి కావ్యరచయిత. శంకరకవిపద్యమును తన గ్రంథమున వేసికొనెనని తలంపరాదు. విలేఖరు లెవరో యీపనిని జేసియుందురనుటకు సంశయములేదు.

అందువలన నీపద్యకర్త యెవ్వరో నిర్ణయించుభారము మనపైఁ బడినది. ఈపద్యకర్తృత్వమునుగూర్చి శంకరకవిచారిత్రమునఁ జర్చించెదనని చంద్రిమౌళికపచారిత్రమున వ్రాసియున్నాఁడను. (అ. క. త. సం. 8. పుట. 77) పద్యమందలిస్వారస్యమునుబట్టి కవిని నిర్ణయించుట దుస్సాధ్యము. రామరాజభూషణుఁడు శంకరకవికంటెఁ బఁడితుఁ డను మాట నిశ్చయమేకాని యిట్టిపద్యమును శంకరకవి రచియింపఁ జాలఁడని యనలేము. ఇట్టిధారకలిగినపద్యము లనేకములు హరిశ్చంద్రోపాఖ్యానమున నున్నవి. రామరాజభూషణుఁడు కవితాప్రావీణ్య మధికము గఁగలవాఁడే యైనను యాతని రచనము ద్వ్యర్థి కావ్యమగుట నచ్చట చ్చటఁ బద్యముల నడకకుంటివడుచుండును. కాని యీపద్యము రెండర్థములు కలదికాకపోవుటచే నామాట యీపద్యమున కన్వయింపదు.

ఇఁకఁ బూర్వోత్తర సందర్భములననుసరించి యీపద్యకర్తను నిర్ణయింపవలసియున్నది. ఈపద్యభావమును వెల్లడించునప్పటికి శంకరకవి హరిశ్చంద్రుఁడు చంద్రమతిని దనభార్యయని గుర్తింపలేదు. సుంకమడిగినవాఁడు హరిశ్చంద్రుడని చంద్రమతియు నెఱుంగదు. చంద్రమతి కంఠముననున్న మంగళసూత్ర మమ్మి సుంకమును దెచ్చియిమ్మని యప్పటికింకను హరిశ్చంద్రు డామెతో ననలేదు.

ఇఁక రామరాజభూషణుని చంద్రమతీహరిశ్చంద్రుల పద్యము నకుఁబూర్వము పరస్పరము తెలిసికొనియుండిరి. నలుఁడు దమయంతి నదివఱ కెఱింగియున్నవాఁడే. కాని మాఱురూపమున నుండుటచే దమయంతి నలుని నెఱుంగదు. ఎఱుంగకపోయినను దాసివలన నాతనియుదంతము నెఱింగియాతఁడు నలుఁడని నిశ్చయించుకొనినది.

ఈపద్యము హరిశ్చంద్రుఁడు చంద్రమతినిగూర్చి పలికినది. రెండవయర్ధములో నలుఁడు దమయంతినిగూర్చి నుడివినది. దహించుటకై పుత్రునిమృతకళేబరమును శ్మశానమునకు దీసికొనివచ్చి శ్మశానపాలకుఁడు సుంకమిమ్మనియడుగగా నిర్ధనయై చేయునదిలేక మహాదుఃఖముతోఁ గన్నీరుగార్చుచున్న చంద్రమతి నోదార్చుటకై యామె నెఱుంగని హరిశ్చంద్రుఁ డాపల్కులను పల్కెనని చెప్పినవాఁడు శంకరకవి. రామరాజభూషణుని కావ్యమందలి చంద్రమతియవస్థకూడనదియే. కాని యామెను హరిశ్చంద్రుఁ డెఱిఁగియుండెను.

కుమారునిజూచినచో నలునిహృదయము కఱగి నిజరూపమును బయల్పరచికొని యాదరించు ననునుద్దేశముతోఁ గుమారు నెదుటనుంచి యాతని వికృతరూపమును జూచియు ఋతుపర్ణునికడ సేవకుఁడుగనుండుటను దలంచియు శోకగ్రస్తయైనది దమయంతి.

రామరాజభూషణుఁ డీపాత్రలనేకపదజాలముచే నీక్రిందిపద్యములలోఁ బ్రదర్శించినాఁడు వ్యాఖ్యాత యీపద్యములకు వేఱువేఱుగ నర్థములను వ్రాయక రెంటనుసమానమని వ్రాసి యూరకుండెను. దమయంతీ చంద్రమతుల శోకకారణములను వారియవస్థలును భిన్నములు, అట్టిపాత్రలనేకవాక్యజాలముచేఁ బ్రదర్శించుట చాలకష్టము. అందు రామరామరాజభూషణకవి యెంతవఱకుఁ గృతకృత్యుఁడయ్యెనని చర్చించుట ప్రస్తుతాంశము కాదు. వివాదాంశమైనపద్యము నీతఁడు రచియించెనా ? యని చర్చించుటయే ప్రస్తుతాంశము. ఈసందర్భమున రామరాజభూషణుఁడు రచించినపద్యము లివి.

౧. చ. అడుగుల వ్రాలి శోకకలితాకులతాచలితాత్మవీథియై
నడుకుమఁ బ్రాణనాథ! కరుణాభరణాభరణాంతరంగ! నీ
కొడుకు తెఱంగుఁ గోమలినెగుల్ దిలకింపఁగదయ్య! నేఁడు నిన్
బొడఁగనఁ గల్గెఁ జాలుఁదలఁపుల్గరితార్థము లయ్యె నెంతయున్.

౨. క. అన నాజననాథాగ్రణి
మననాధికశోకశిఖల మానస మార్తిం
గన నాచ్ఛాదించి కులాం
గన నాత్మకథావిబోధకారణిఁ బలికెన్.

౩. చ. కుదురు మెఱుంగు నిబ్బరపుగుబ్బలపై నయనాంబుపూరముల్
సెదరఁగ నేలయేడ్చెదవు చెల్వ! దురంతవిషాదవేదనా
విదళితమానసాబ్జ వయి వేమఱు నాయువు శాశ్వతంబె సం
పదలు స్థిరంబులే విధివిపాకము దాఁటఁ దరంబె యేరికిన్.

౪. గీ. అఖిలదేశంబుల సదాసహాయవృత్తి
నఱపితి విలాసవతి! యిట్టినిన్ను నమ్మి
కనుఁగొనుట యెట్లు? నిర్వాశంకతఁ దలిర్ప
నిపు డెదుట నిల్చి మాటాడు టెట్లు టన్న.

ఇందు మూఁడవపద్యము వివాదాస్పదమైనది. మొదటిమూఁడు పద్యములకును వ్యాఖ్యాత యర్థము వ్రాయలేదు. అందుచే చంద్రమతీ దమయంతుల శోకనిమిత్తములును నవస్థలును సమానములే యని కావ్యకర్తయు వ్యాఖ్యాతయుఁగూడ భావించియుండి రనుట స్పష్టము.

(౧) మూఁడవపద్యము, నాయకులు వారిభార్యలయెడల సానుభూతిగనుపరచి, వారినూఱడించుటకై యుద్దేశింపఁబడినది. రామరాజభూషణకవి యీపద్యమును రచియించియున్నచో దమయంతివిషయమున నాయువుశాశ్వతంబె? అనుపదముల నిటఁ బ్రయోగించియుండఁడు. చంద్రమతి పుత్రశోకముచేఁ గృంగుచున్నది కావున నామెనాశ్వాసించుటకై యాపదముల నుపయోగింపవచ్చును. కాని యుందరుసుఖ

చేవ్రాలై యున్నదమయంతిపట్ల యాపదము ననువర్తింపవు. "సంపదలు స్థిరంబులే" యనువాక్య మిరువురుపట్లనువర్తించును. ఉచితానుచితజ్ఞుం డగు తాళ్ళూరాజభూషణుఁడు ఇట్టికావ్యమున ననాలోచితముగా సామాన్యజనునివలె "ఆయువు శాశ్వతమా?" అని యూరక ప్రయోగించెనని తలంపరాదు.

(౨) ఈమూఁడవ పద్యమును గ్రంథమునుండి తొలఁగించిచూడుఁడు. ఇరువురివిషయమునను గూడఁ గథకులోపము రాలేదు.

(3) నాల్గవపద్యమునుబట్టి చూచినచో దమయంతిపట్ల నలునకు సానుభూతిలేదు సరికదా! ఆమెవిషయమున విశ్వాసరాహిత్యమును గనుపరచినాఁడు.

ఈనాల్గవపద్యమందు హరిశ్చంద్రుఁడు చంద్రమతితో "ఓవిలాసవతీ! నీవు సర్వదా నాకు సహాయము చేయుచు సమస్త దేశములు నాతో సంచరించితివి. అట్టి నిన్ను (దయాశూన్యుఁడనై) విక్రయించిన నేను నీ మొగ మెట్లుచూడఁగలను! నీయెదుటనిలిచి యెట్లు మాటలాడఁగలను" అని వాపోయినాఁడు.

నలుఁడు దమయంతితో "విలాసవతీ! నీవు ఒంటరిగా సకల దేశములు తిరిగినదానవు. ఇట్టి నీయెడ నెట్లువిశ్వాసము చూపగలను, నీయెదుటనిలిచి మాటలాడు టెట్లు?" అనిపలికి యామె పాతివ్రత్యమును శంకించినాఁడు.

ఇట్టి యనుమాన హృదయుఁడగు నలుఁడు పైమూఁడవపద్యము నందలియనునయ వాక్యములను బలికెననుట కవకాశము లేదు. పాత్రౌచిత్యమును జక్కగా నెఱింగిన రామరాజభూషణుఁడు పైపద్యము నీసందర్భమున రచియించి యుండఁడు.

ఈకారణములనుబట్టి యీపద్యకర్త రామరాజభూషణుఁడు కాఁడని నావిశ్వాసము. ఆపుస్తకములో శంకరకవియే యీపద్యమును రచియించెనని తెలుచున్నది. అయినను శంకరకవి పద్యములయందుఁ

బూర్వోత్తర సందర్భములెట్లున్నవో పరికింతము. రామరాజభూషణున కున్నంతకష్టము శంకరకవికిలేదు. గ్రంథవిస్తరభీతి యున్నను నీసందర్భమున శంకరకవి రచించిన పదిపద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

సీ. ఆఁడుదానవు గానననుకంప జనియింపఁ
బరుషోక్తులను నేమిబలుకనోడి
యూరకయుంటిఁ దక్కొరుని నవ్వానినైన
శిరము ఖండింతుఁ గౌక్షేయకమున
సాదనేర్పఁ దగునంతచోటికి నొకమాడ
తెచ్చి నాకిత్తురు మచ్చెకంటి
యీచొప్పు దప్పక యిచ్చ్యంగ వలయును
దొరకకయుండినఁ దొలఁగి పొమ్ము.
తే. మాటలింకేల యిచ్చోట మసలితేని,
యంత్యజాగ్రణి మత్స్వామియైన వీర
బాహుపదముల యాన యోభామ యనిన
మిగుల శోకంబు నిగుడ నమ్మగువ పలికె. 82

చ. పరహిత మార్గవర్తన! శుభంకర! నన్నొకకొంత నీదయా
సరణిఁ గనుంగొనన్వలయు సంపదగల్గిన దానిఁబోలెఁ ని
ష్ఠురగతి మాడ వేఁడెదవు చూడఁగ నేనిరుపేదరాల నె
వ్వరు మఱిదిక్కులేరు తగవానను శోకపయోధి ముంపగన్. 83

క. శ్రీలున్ దైవారిజలధి, వేలాయి తధరిత్రి విమల యశుండై
యేలు నృపసూతి యఘుగెడు, నేలకుఁ బాత్రుండుగాఁడె నీకిటు
తగునే. 84

వ. అని మఱియు. 85.

మ. అకటా చేరెడు నేలకుం దగఁడె సప్తాంభోధి వేష్టితవ
త్సకలద్వీపకలాపభూప మకుటాంచత్పద్మ రాగోజ్జ్వల
ప్రకటానర్గళ నిర్గళత్కిరణశుంభత్పాదుఁడై నట్టి రా
జకమార్తండని యెచ్చె కన్నుగవ నశ్రూల్గాల్వలై పార్వగన్. 86

చ. కుదురుమెఱుంగు నిబ్బరపు గుబ్బలపై నయనాంబు పూరముల్
చెదరగ నేలయేడ్చెదవు చెల్వ! దురంత విషాదవేదనా
విదళితమానసంబునను వేమఱు నాయువు శాశ్వతంబె సం
పదలు స్థిరంబులే విధివిపాకము దాఁటఁ దరంబె యేరికిన్. 87

వ. అనినఁ జంద్రమతి యిట్లనియె...... 88

ఆ. సుజనవినుత! గోరుచుట్టుపై రోఁకటి
పోటు దాఁకినట్లు పోతలంప
మొదల శోకజలధి మునుగంగ నందుపై
నీవుపల్కినట్టి నిష్ఠురోక్తి. 89

మత్త. ఓమహాత్మక! మిమ్ముదూఱఁగ యుక్తమే వివరింప మా
రేమిచేయుదురయ్య! మాటికి హెచ్చి కౌశికమౌని మా
యామయంబయి వెంటవెంట నహర్నిశంబులు బాయకు
ద్దామశక్తిని నాదుకర్మము దాయకై పడి నుండఁగాన్. 90

శంకరకవి గ్రంథమున విలేఖకులు చాలమార్పులు కావించి యుండిరనియు, "అకటా! చేరెడు నేలకుండగఁడె" యనుపద్యము శంకరకవి రచించినది కాదనియుఁ జంద్రమౌళికవి చారిత్రమున వ్రాసి యున్నాఁడను. ఆపద్యమును దీసివేసి పైపద్యములను జదువుఁడు. ఆ పద్యము చంద్రమతి పల్కినది. దాని తరువాతి "కుదురుమెఱుంగు" అనుపద్యము హరిశ్చంద్రుడు చెప్పినది. ఈరెంటికీ నడుమ నొకచిన్న వచనమో పద్యమో యుండితీరవలయును. లేకున్న నీ "కుదురు" పద్యముకూడఁ జంద్రమతి పల్కినట్లే యగును. 'అకటా చేరెడు' అనుపద్యమును దీసివేయక యచ్చటనుంచినను నీయన్వయ దోషముపోదు. కావుననీ 'అకటా చేరెడు' అనుపద్యమును గ్రంథమునుండి తొలఁగింపుఁడు.

ఆపద్యముతోపాటు 'కుదురుమెఱుంగు' ఇత్యాది పద్యమును 88 వచనమునుగూడ తీసివేయుఁడు. వివాదాస్పదమైన మీ 'కుదురు

మెఱుంగు' అను పద్యముకూడఁ జంద్రమౌళికవి రచించిన హరిశ్చంద్రో పాఖ్యానములోనిదని నాయభిప్రాయము.

ఈపద్యము శంకరకవి రచనమా? రామరాజభూషణరచనమా? యనుప్రశ్నకు ఈయిరువురి రచనమునుకూడఁగాదు. చంద్రమౌళికవి దని ప్రత్యుత్తరమిచ్చుట 'అసత్యేన తపసా? వపసా?' అను ప్రశ్నకు రెండునుగాదు. 'అసత్యేసరజసా' యని యుత్తరమిచ్చినట్లున్నది.

వివాదాస్పదమైన యీపద్యమును దీసివైచినచో హరిశ్చంద్రుడు చంద్రమతికేమిచెప్పెనో తెలుపు పద్యముండవలదా? యనుప్రశ్న రావచ్చును. శంకరకవి యట్టిపద్యమును వ్రాసియుంచినాడు. చూడుఁడు.

చ. సరసిజనేత్ర! జీవితము సత్యముగాదు శరీరధారికిన్
మరణము నిశ్చయంబు పలుమాఱుఁ గుమారునిఁజూచి యేడ్చినన్
మరలునె వీనిప్రాణములు మంగళసూత్రసువర్ణమిచ్చి నీ
వరసుతునిం దహించు మగువా యనమూర్ఛిలెశోకమగ్నయై. 96

ఈపద్యములోని భావమే 'కుదురుమెఱుంగు' పద్యములోఁ జెప్పఁబడినది. ఒకేభావమును బునరుక్తిగా రెండుపద్యములలో శంకరకవి చెప్పినాఁడనుటకంటె 'కుదురు...' పద్యము చంద్రమౌళిదని నిర్ణయించుట సమంజసము. ఆపద్యమును గ్రంథమునుండి తీసివేసినను కథను లోపమురాకుండ నన్వయదోషము లేకుండ సరిపోవుచున్నది.

పాఠకమహాశయు లీసందర్భమున శంకరకవి పద్యములను రామరాజభూషణుని పద్యములను పూర్వోత్తరములయందున్నవానిని మఱికొన్నిటిని చదువవలయును.

హరిశ్చంద్ర నలోపాఖ్యాన పీఠికాకారులు, వివాదగ్రస్తమైన యీపద్యమును రచించిన యాతఁడు రామరాజ భూషణుఁడే యని నిర్ణయించుచు హరిశ్చంద్రుఁడు తనభార్యయని తెలియకపూర్వము 'కుదురుమెఱుంగు' అను పద్యముచేఁ దనభావమును వెల్లడించె ననుట యుచితమనియు, నట్టిభావమును వ్యక్తపరచినాఁడని శంకరకవిపై నింద

మోపుటకంటె తనభార్యయని యెఱింగినపిదప నట్లుమాటలాడెనని రచించిన రామరాజభూషణుఁడే యీపద్యకర్తయని నిర్ణయించిన మేలని యందులకొక హేతువునిచ్చియున్నారు. నేనీపీఠికాకారుల యభిప్రాయముతో నేకీభవింపఁజాలను. చనిపోయినవాఁడు తనపుత్త్రుఁడనియు, దుఃఖాంబుధిలో మునిఁగియున్నది తనభార్యయనియుఁ దెలిసిన మీఁదట నట్టి పదములతో హరిశ్చంద్రుఁడు భార్యనోదార్చినట్లు రామరాజభూషణుఁడు రచించియుండఁడనియు కావున నాపద్యమాతనిది కాదనియు నాయభిప్రాయము. ఇట్టి పద్యములనుబట్టి యాకర్తృత్వమును నిర్ణయింపవలనుపడదు. స్వస్త్రీ, పరస్త్రీ భేదమిచ్చుట లేదు. స్వస్త్రీయని యెఱింగినను బరస్త్రీయని భావించినను నాయవస్థలోనున్న యబలాకుచవర్ణన మనుచితమనుట సత్యమే. కాని కవులు ప్రాయికముగా స్త్రీలరోదనమును వర్ణించునప్పు డౌచిత్యము చ్యుతమైనను కండ్లనశ్రువులు కాలువలై స్తనములమీఁద బడుచున్నట్లు వర్ణించుచుందురు.

"కాటుకకంటినీరు చనుకట్టుపయిఁబడ నేల యేడ్చెదో" (పోతన) ఇట్టివింకనుగలవు. కొందఱిట్టిపద్యములలో శబ్దాడంబరముకొఱకు కొన్ని పదములను స్తనములకు విశేషణములుగాఁ జేర్చుచుండుటయుఁ గలదు. ప్రతిపదార్థమును గైకొనినచో నిందౌచిత్యము లేదని చెప్పకతప్పదు. కాని చదువరుల హృదయముల కాపద్యపఠనమువలన నాదీనవదనము దుఃఖాశ్రువులు హృదయ విదారకమైన యామెదైన్యావస్థయునే గోచరించునుగాని యన్యము గాన్పింపదు. అట్టి పద్యరచనాకాలమునఁ గవులును దన్మయావస్థలోనుండి తమ కవితయందెట్టి పదములు పడుచున్నవో తెలిసికొనెడి స్థితిలోనుండరని భావించి వారిని కఠిన విమర్శనుఁ బాలుచేయకుండుట పాఠకుల ధర్మము.

పీఠికాకారులు, తాము చూచిన తాళపత్రప్రతులయం దీపద్యమున్నదనియు, వ్యాఖ్యాత, రామరాజభూషణునకుఁ దరువాత సమీపకాలములోనున్నవాఁడనియు, నందుచే రామరాజభూషణుఁడే యీపద్య

మును రచియించెనని నిర్ణయింపవలయునని వ్రాసియున్నారు. ఈపద్య కర్తృత్వమును నిర్ణయించుట కిదియొకసాధనము కాఁజాలదు. అనంత కవి స్వహస్తలిఖిత తాళపత్రప్రతి లభించినను, ఈపద్యముదాహృతము కాని హరిశ్చంద్రోపాఖ్యాన ప్రతులు లభించినను గొంతవరకవి సాక్ష్యములుగా గ్రహింప నర్హములై యుండును.

ఈపద్యకర్తృత్వ విషయికచర్చతో నీకవి చారిత్రము పెద్దదైనది. ఈపద్యము చంద్రమౌళిదే యనునాయభిప్రాయమును దెలుపుచు నీచరిత్రమును ముగించుచున్నాఁడను.



## 175 భాస్కరాచార్యులు



ఈకవి వైశ్యపురాణ మనునెనిమిదాశ్వాసముల పద్యకావ్యమునురచించి పెనుగొండయందలి వైశ్యయువకుల కంకితముచేసెను.

ఆంధ్రకవి చరిత్రకారు లీకవినామమును భాస్కరపంతులని పేర్కొనియున్నారు. (221వ పుట, 1899 ముద్రణము,) కాని వైశ్యపురాణ ముద్రితప్రతియందలి గ్రంథాంత గద్యలో "ఇది శ్రీ సరస్వతీ విలాస చరణసరసీరుహ నిష్యంద మకరందబిందు సందోహమాధురీ మధుకరాయమాన మానస సరస కవితావిలాస బొల్లనార్య తనూజవర్య శ్రీగురుభాస్కరాచార్య ప్రణీతంబైన వైశ్యపురాణం" బని వ్రాసికొని యుండుటచే నేనీతనిని భాస్కరాచార్యుఁడని పేర్కొంటిని.

ఈకవి తననుగూర్చి వ్రాసికొనిన యీక్రింది పద్యములనుబట్టి యీతఁడు గౌతమగోత్రుఁడైన బ్రాహ్మణుఁడనియు, బొల్లన కుమారుఁడనియుఁ బెనుగొండ నివాసియనియుఁ దెలియుచున్నది.

శా. ఆపస్తంబ మునీశ్వర జగద్వ్యాఖ్యాతసూత్రుండ వి
ద్యాపాథోనిధి గౌతమాఖ్యముని గోత్రాధిక్యుడం బోల్లన

చ్ఛాపానుగ్రహ వాక్యమర్థిత నృపశ్లాఘ్యుండఁబెన్గొండపూఃయున్
శ్రీపుణ్యాద్యధివాస భారతుఁడ ధాత్రీ దేవతామాన్యుఁడన్.

క. సల్లలిత లక్షణోక్తుల
నుల్లసిత కవిత్వ తత్త్వయుక్తుఁడ సుమనః
పల్లవితకీర్తి లతికో
ద్వేల్లితహరిదంతరుఁడ ధృతి భాస్కరుఁడన్.

ఈకవికాలమునుగూర్చి యాంధ్రకవుల చారిత్రములో "గ్రంథ సామగ్రి తక్కువగుటచేత నీతనికాల మిదియని నాకిప్పుడు నిశ్చయముగాఁ దెలియకపోయినను, ఇతఁడు పదునాఱవ శతాబ్దమునకుఁ బూర్వుఁడని తెలియవచ్చుచున్నది." అని వ్రాసియున్నారు. వైశ్య పురాణ కృత్యాదియందు —

ఉ. భారతరామ సత్కథలు భాగవతంబుఁ దెనుంగుసేయఁగా
నేరరె సత్కవీశ్వరులు నేర్చిరచించిన సత్కవిత్వముల్
మీఱుచుఁ దెనుంగుబాస నిల మెచ్చుగనొక్క తెనుంగు గ్రంథమిం
పారఁ బ్రసిద్ధిసేయు మహిమండలి నొప్పఁగఁ బండితాగ్రణీ!

అను పద్యములో నాంధ్రభాగవతకర్తను సంస్మరించియుండుటచే నీతఁడు బమ్మెర పోతనామాత్యునికంటెఁ దరువాతివాఁడనుట స్పష్టమైన విషయము. ఈ వైశ్యపురాణమునకుఁ గన్యకాపురాణమనియు, వాసవీ మాహాత్మ్యమనియు నామాంతరములు. ఈగ్రంథము ముద్రితమైనది. దీనియముద్రిత ప్రతులు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నాలున్నవి. (R 91, 185 A D 316 to 320) ఇందు నాల్గు ప్రతులకు విలేఖకులు తమకాలముల నిచ్చియున్నారు. ఆ కాలములను అందలి తిథివారములనుబట్టి స్వామికన్నుపిళ్లగారి పంచాంగము ననుసరించి యేర్పడిన యింగ్లీషు తేదీలను క్రింద నిచ్చుచున్నాఁడను.

R 91 సాధారణ సం, పుష్యబ ౧౦ భానువారం 26—1—1851
D 317 ప్లవంగనామ సం చైత్రశు ౧౩ శనివారం 31—8—1787

D 818 తారణ సం ఆశ్వీజ శు ౨ బుధవారం 20—9—1704
D 819 ప్రమోదూత సం జ్యేష్ఠ బ ౫ గురువారం 21—6—1810

దీనినిబట్టి యీగ్రంథము క్రీ. శ. 1500—1700 నడుమ రచియితమైనదని స్పష్టమగుచున్నది. కావున నీకవి పదునాఱవ శతాబ్ది పూర్వార్థమువాఁడని ప్రస్తుతమున నిర్ణయింతము.

ఈకవి నివాసమైన పెనుగొండ అనంతపుర మండలములోనిదని ప్రాచ్యలిఖిత పుస్తకభాండారమునందలి గ్రంథముల క్యాటలాగులో వ్రాసియున్నారు. కాని యది సత్యముకాదు. (R. No. 91, అనంతపుర మండలమునఁ బెనుగొండ నగరమున్నమాట సత్యమే కాని, యీ వైశ్యపురాణమున వర్ణితమైన పెనుగొండ యదికాదు. ప్రస్తుతమున పశ్చిమగోదావరియని పిలువబడుచున్న మండలములోఁ దణుకుతాలూకాయందొక పెనుగొండయున్నది. అదియే యిందు వర్ణితమైనదని యీక్రింది పద్యములవలన స్పష్టమగుచున్నది.

సీ. ఏపురంబుననుండు మూలస్థాన
మల్లికార్జునుఁడు శ్రీమండితుండు
ఏపట్టణంబున గోపికాపతి దైత్య
మర్దనుఁడుండు జనార్దనుండు
ప్రవహించు వే వీటి ప్రాగ్భాగమున బెట్టు
కదలిరాయనికొమ్మ గౌతమమ్మ
ఏవీటఁజెలువొందు నేప్రొద్దుఁ గరుణతో
విశ్వనాథుని దేవి వింధ్యనిలయ
విప్రబాహుజ విట్శూద్ర విమలహర్మ్య
కూట సంస్థాపిత స్వర్ణ కుంభదీప
జాలభాసిత బ్రహ్మాండ గోళకంబు
ధరణి స్వర్గంబు పెనుగొండ పురవరంబు.

సీ. ప్రవహించు నేవీటి ప్రాగ్భాగమునమించి
శ్రీమత్తరంగ ఫాసితగంగ

దర్శించు నేవీట దక్షిణంబున దుగ్ధ
కాసారపుర మేలుఘనుఁడు శివుఁడు
పాలించునే వీడు పశ్చిమంబునను గౌ
రీశ్వరుండైన రామేశ్వరుండు
యోజించు నేవీటికుత్తరంబున నుండి
యంబుజాక్షుండు జనార్దనుండు

అట్టిపురవర మఖిల విద్యాధురీణ
వైశ్యవంశపరాక్రమ వర్ణనీయ
సముచితాక్షర సంపూర్ణ శాసనాగ్ర
కీర్తనీయంబు అమ్మహా గిరివరంబు.

ఈపద్యములలోనుదాహృతములైన వశిష్ట, గౌతమియనునదులు గోదావరి మండలమునందలి పెనుగొండ సమీపముననున్నవి. కాని యనంతపుర మండలమున లేవు. దుగ్ధకాసారపురమనఁగా పాలకొలను. ఇది పాలకొల్లు అనుపేరఁ బరగుచు పశ్చిమగోదావరి మండలముననే యున్నది. పై పద్యములోని రామేశ్వరుఁడీ పెనుగొండ సమీపమునం దున్న ఆచంటయందున్నాడు. పై పద్యములలో నుదాహృతములైన దేవాలయములన్నియు నీపెనుగొండయందున్నవి. పెక్కు వైశ్యకుటుం బములైశ్వర్యముతోఁదులదూగుచు నీపెనుగొండయందున్నవి. కావున భాస్కరాచార్యకృత వైశ్యపురాణమునఁ జెప్పఁబడిన పెనుగొండ, పశ్చిమగోదావరి మండలమునందలి పెనుగొండయే కాని యనంతపుర మండలమందలి పెనుగొండ కాదు.

ఈవైశ్యపురాణములో మొదటినాలుగాశ్వాసములును వైశ్యుల జన్మవృత్తాంతమును వారు కైలాసమునుండి భూమియందవతరించుట మొదలుగాఁ బురాణగాథలతో నిండియున్నది. మిగిలిన నాలుగాశ్వా సములును వాసవీ కన్యతో సంబంధించినకథ. పెనుగొండ పట్టణమునఁ గుసుమసెట్టి యను ధనవంతుఁడగు వైశ్యుఁడొకండు కలఁడు. అతఁడు సంతానమునుగోరి భార్యతోఁగూడి పుత్రకామేష్టి చేయ విరూపాక్షుఁ

డను తనయుఁడును నొకకుమార్తెయుఁ గలిగిరి. ఆమెపేరు వాసవి. తల్లి దండ్రులామె నతిగారాబముతోఁ బెంచిరి. యుక్తవయసు వచ్చినప్పటి కామె యత్యంత రూపవతియై సర్వాంగసుందరియయ్యెను. ఆకాలమున రాజమహేంద్రవరమున రాజ్యముచేయుచున్న చాళుక్య వంశజుండగు విష్ణువర్ధనుఁడనురాజు దిగ్విజయము చేయుటకై దేశమునఁ దిరుగుచు మార్గవశమునఁ బెనుగొండకు విచ్చేసెను. ఆనగరమప్పుడు వైశ్యుల పరిపాలనములో నుండెను. వారు రాజునుచిత మర్యాదలతో నెదు ర్కొని పూజించి తెచ్చి యొకసౌధమున విడియించిరి. రాజునకు నివా ళులనిచ్చుటకై యరుదెంచిన వైశ్యయువతులలోనున్న వాసవీ కన్యను జూచి కామించి విష్ణువర్ధనుఁ డాకన్యను దనకిచ్చి పరిణయముసేయుమని కుసుమసెట్టికి వర్తమానించెను. నగరవైశ్యులందఱితో నాలోచించికాని యేమియుఁ జెప్పఁజాలనని యాసెట్టి బదులుచెప్పెను. విష్ణువర్ధనుఁడు బలవంతముగా నాకన్యను రాజమహేంద్రవరమునకుఁ దెమ్మని తనసేనా నాయకునితోఁగూడ సైన్యమునిచ్చి పంపించెను.

వైశ్యులొకచో సమావేశమై ప్రాణములను త్యజించియైనను మతాచారములను గాపాడుకొనుట ధర్మము కావున రాజునకుఁ గన్య నీవలదని తీర్మానించుకొనిరి. బలవంతుఁడైన రాజుతోఁ బోరాటము వలన లాభము లేదని తలంచి సతీపుత్ర బాంధవసహితముగా నగ్నిగుం డములబడి యగ్నికాహుతులై తమధర్మమును గాపాడుకొన నిశ్చ యించుకొనిరి.

వైశ్యులీనిశ్చయమునకు వచ్చుటకై ప్రోత్సహించి తోడుపడిన యాతఁడు వైశ్యుల పురోహితుఁడగు భాస్కరాచార్యులను బ్రాహ్మ ణుఁడు. తెల్లవారినమున నీదారుణ కార్యము జరుగుననఁగా దొలినాటి రాత్రి యీభాస్కరాచార్యుఁడు అగ్నికాహుతియగుటకు సిద్ధపడిన వైశ్యులకు వీరతాంబూలంబు లిప్పించెను. ఆనాఁటి సమావేశమునకు 714 గోత్రములవారు వచ్చిరి. కాని యందు వీరతాంబూలములను గైకొనినవారు 102 గోత్రములవారు మాత్రమే. మిగిలిన 612 గోత్ర ములవారును అగ్నికాహుతులగుటకు సాహసింపలేక పారిపోయిరి.

మఱునాఁడగ్నికుండములు 108 సిద్ధముచేయబడినవి. వాసవీకన్య తలిదండ్రులకు ధైర్యముచెప్పి తనతోఁగూడ నగ్నింబడుటకు సిద్ధులైన 102 గోత్రములవారివంశీయులును నైశ్వర్యముతోఁదులదూఁగుచు కీర్తికాములై యిహపరసౌఖ్యముల నందుచుండునట్లును వారు తమగురువైన భాస్కరాచార్యుని యందును వారివంశీయులయందును భక్తికలిగి పూజించుచు వారి యాశీర్వాదములను బొందుచుండునట్లును మిగిలిన 612 గోత్రములవారును వర్ణభ్రష్టులై చెడిపోవుదురనియును శాసించి, తన్నభిలషించిన విష్ణువర్ధనుఁడు తానగ్నిహోత్రమునం బడినవార్తను వినినయాక్షణముననే శిరసు బ్రద్దలయి మరణించునని శాపమొసంగి పార్వతీ పరమేశ్వరుల మనంబునందిడి యగ్నికుండమునంబడి ప్రాణంబులంబాసెను. ఆమెతోఁగూడ నూటరెండుగోత్రములవారు నగ్నికాహుతులైరఁట. ఈవార్త రాజమహేంద్రవరమునందున్న విష్ణువర్ధనునకుఁ దెలిసిన క్షణముననే యాతని తల వ్రక్కలై మరణించెనఁట.

ఈకథ వైశ్యపురాణమున తుది నాల్గాశ్వాసములలోను వర్ణితమైనది. ఈవైశ్యపురాణము ద్విపదకావ్యమొకటి కలదు. దానిప్రాంత ప్రతియొకటి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారముననున్నది, (R. No. 1011) పద్యకావ్యము ముద్రితమైనది. ద్విపద కావ్యము ముద్రితమైనట్లు కన్పట్టదు. ద్విపదకావ్యమునుగూడ నీభాస్కరాచార్య విరచితమే యైనట్లీక్రింది ద్విపదలవలనఁ దెలియుచున్నది.

అనుచు ధీనిధి భాస్కరాచార్యగురుఁడ
వినుత నానాశాస్త్ర వేదపాలితుఁడ
గురువైన గౌతమగోత్ర పవిత్ర
చరితుండ భారతీ జీవితేశ్వరుని
కులసంభవుఁడ నీతిగుణ విశారదుఁడఁ
గవిత శబ్దార్థ సంగతుల తోఁడుతను
వలనొప్ప మించు గీర్వాణపురాణ
మలవడ రచియించి తంధ్రభాషణను

రసిక డింభకనగరావళిపేర.
నసమానసీతి విఖ్యాతులపేర.

ఈవైశ్యపురాణమందలి వాసవీకన్యకథ కేవలపురాణగాథగనే భావింపవలయునా? చారిత్రాత్మకముగా నెంచి సత్యాన్వేషణకు గడంగ వచ్చునా? అని యోచింపవలసియున్నది. చరిత్రాత్మకమనుచో నీసంఘటన మేకాలమున జరిగినది? ఈవిష్ణువర్ధనుండెవ్వరు? భాస్కరాచార్యులెవ్వరు? వాసవీకన్య దేహత్యాగముచేసినది పశ్చిమగోదావరి మండలమందలి పెనుగొండయా? అనంతపురమండలమందలి పెనుగొండయా? ఇత్యాది విషయములనుగూర్చి యోచింపవలసియున్నది. చారిత్రక చతురానన బిరుదాంచితులగు (శ్రీ) చిలుకూరి వీరభద్రరావు పంతులు గారు ఆంధ్రుల చరిత్రములో నీకథ కల్పితమనియు నీసంఘటనము జరుగనేలేదనియు నభిప్రాయమిచ్చియున్నారు.

వాసవీకన్య యగ్నిగుండమునం బడినప్పుడు డచ్చటనున్న భాస్కరాచార్యులును నీగ్రంథకర్త భాస్కరాచార్యులును నొక్కరుకారు. పూర్వమెప్పుడో జరిగినకథను తెనుంగునం బ్రబంధముగా జేయుమని పెనుగొండయందలి వైశ్యయోషకు లర్థింప నీభాస్కరాచార్యుండీ గ్రంథమును రచియించిన ట్లీక్రిందిపద్యమువలనం దెలియుచున్నది.

క. మునుమాపెద్దల చరితము
మునిసాలంకాయనుండు ముదమునం జెప్పెన్.
ఘనమునం దత్కృతి పొందుగ
నను గుణముగం జేసి చెప్పుం డాంధ్రోక్తిందగన్.

వాసవీకన్యయును వైశ్యులును నగ్నిగుండంబులం బడునప్పుడు వైశ్యులు భాస్కరాచార్యులకొక తామ్రశాసనమును వ్రాయించియిచ్చి తామరవాడ యను గ్రామము నగ్రహారముగ నిచ్చిరట! ఆశాసనము నీగ్రంథకర్త యీవైశ్యపురాణమున నుదాహరించెను. అందవసరమైన భాగము నిట వ్రాయుదును.

"భాస్కరాచార్యులకు జాహ్నవీతీరంబునఁ దామరవాడయను గ్రామంబగ్రహారంబుగా నిడుండని చెప్పి పెనుగొండలో నర్థాంశంబు తత్పుర దేవతా మహోత్సవంబున కొసంగి మిగిలినయర్థంబు కలగురువులైన పండితవర్గంబులకిమ్మని పురమధ్యంబున శాసనస్తంభంబు నిలిపి భాస్కరాచార్యులకుఁ దామ్రశాసనపత్రిక లిఖియింపం జేసిరి. తత్క్రమం బెట్టిదనిన :

శ్లో॥ స్వస్తి శ్రీనగరేశ కోనకమలా శ్రీవింధ్యవాసీ జయా-
౧. శ్రీవత్సాంక జనార్దనశ్చ సువిశో విఘ్నేశ్వరః శ్రీనిధిః
సూర్యేంద్వారబుధేజ్యశుక్రరవిజస్వర్భానవః కేతవః
సాన్నిధ్యం పెనుగొండపట్టనవరే కుర్వంతు దీర్ఘాయుషః॥

శ్లో॥ కల్యాద్యబ్దగణేఽష్టనేత్రరసదృక్సంఖ్యాగతేవత్సరే
౨. ప్రాప్తేబ్దే ప్రభవే తపస్యసి సితే పక్షే ద్వితీయా గురౌ
ఆర్యా భాస్కరపండితాదిధరణీబృందారకేభ్య స్సదా
ప్రీత్యాష్టాదశపట్టనాధిపతిభిః దత్తం శుభం శాసనమ్.

శ్లో॥ గృహే గృహే విశాం వర్షే వర్షే ద్వాదశగోత్రిణామ్
3. వివాహేచ వివాహేచ శ్రీమత్సీమంతకర్మణి
పుత్రే పుత్రే సముత్పన్నే కన్యాయా జన్మజన్మని
గద్యాణికం తదర్థంచ గద్యపద్యాదిసత్క్రియా
శాంతికే పౌష్టికే చైవ పైతృకే వృద్ధకర్మణి.

పెనుగొండకునాతిదూరమున తామరాడయున్నది. భాస్కరాచార్యవంశీయు లగుదురో కారో చెప్పఁజాలముకాని, ఆగ్రామ మిప్పుడును బ్రాహ్మణుల కగ్రహారముగా జరుగుచున్నది

ఈశాసనమునం దుదాహృతమైనకాలము కల్యాదినుండి 2628 అగు ప్రభవసంవత్సర మాఘశుద్ధవిదియా గురువారము. వర్తమానకలియుగాబ్దములు 5053. అనఁగా నిప్పటికి 2425 సంవత్సరములక్రితమీ శాసనము పుట్టినదన్నమాట! ఆప్రాంతముననో, ఆనాడో వాసవీకన్య

యగ్నికహుతియయ్యెనని దీనినిబట్టి తెలియుచున్నది. ఆమెను గామించినవాఁడు రాజమహేంద్రపురమును బరిపాలించుచున్న చాళుక్యవంశజుఁడగువిష్ణువర్ధనమహారాజని వైశ్యపురాణమునం దీక్రిందిపద్యములలోఁ జెప్పఁబడినది.

క. శ్రీమార్కండేయముని
స్వామికి నిలయం బనంగ జగతీదివిష
దామము రాజమహేంద్రిని
నామంబున నొప్పుఁ బురము రమ్యస్ఫూర్తిన్.

సీ. శ్రీగౌతమీదివ్యసింధుపావనతోయ
కణవిమర్దితపౌరకల్మషంబు
ప్రకటమార్కండేయ పరమేశకారుణ్య —
సంభూతశాశ్వతైశ్వర్యయుతము
దానధారాసారదంతావళోదార
ఘీంకారవైఘరీసంకులంబు
జనవిక్రమక్రియాజనితపౌరుషఘన
ఘనతురంగమవీరకలకలంబు
రత్నధనధాన్యవస్త్రహిరణ్యరజిత
సారఘనసార మృగనాభిచందనాది
రమ్యతరపణ్యవీథికారాజితంబు
సాంద్రవిభవంబు రాజమహేంద్రపురము.

వ. ఆపట్టణంబున కధీశ్వరుండు.

ఉ. ధూర్జటిపాదభక్తుఁ డరిదుర్గవిభేదనశౌర్యశాలి న్యా
యార్జితవైభవుండు విబుధావనకల్పకుఁ డార్యసమ్మతుం
డర్జునవంశవర్ధనుఁ డహర్పతితేజుఁడు విష్ణువర్ధనుం
డూర్జితసర్వసంపదల నొప్పును రాజమహేంద్రనాథుఁడై.

క. రాజకళాధరభక్తుఁడు
రాజకులోత్తంసుఁ డన్యరాజయశస్తే

జోజయశాలిగఁబరగును
రాజితచాళుక్యవంశరక్షకుఁ డెలమిన్.

రాజమహేంద్రవరమును చాళుక్యరాజులు పరిపాలించినమాట సత్యమే. ఆచాళుక్యులలో విష్ణువర్ధననామధారులు పెక్కురున్నారు. మొదటి విష్ణువర్ధనునికాలము క్రీ శ. 500 ప్రాంతము. అంతకుఁ బూర్వము చాళుక్యరాజులతో నాంధ్రదేశమునకు సంబంధము లేదు. క్రీస్తుశకము కలియుగము 3100 సంవత్సరములు గతించినపిమ్మటఁ బ్రారంభమైనది. అనఁగాఁ గలియుగమున 3600 సంవత్సరములు గడచిన పిమ్మటఁ గాని చాళుక్యసంబంధ మీప్రాంతమునకు లేదు. పైనిర్వాసిన రెండవశ్లోకములోనికాలమునకును దీనికిని దాదాపుగా వేయిసంవత్సరములు భేదమున్నది. కావున వైశ్యపురాణమందలి శాసనకాలము సరియైనదని చారిత్రాత్మకదృష్టితో భావింపఁజాలము.

చాళుక్యరాజులలో రాజమహేంద్రవరమును రాజధానిగా నేర్పఱచుకొని వేగిదేశమును పరిపాలనము చేసినవాఁడు అమ్మరాజవిష్ణువర్ధనుఁడు. ఇతఁడు విష్ణువర్ధననామధారులలో నాఱవవాఁడగుటచే నీతని నాఱవవిష్ణువర్ధనుఁ డందురు. ఇతనికి రాజమహేంద్రుఁ డనుబిరుదము కలదు. వేగిదేశమునకు రాజమహేంద్రవరమును రాజధానినిగాఁ జేసి పరిపాలించినవారిలో మొదటివాఁడగుటచే నీతనికాబిరుదము వచ్చెనని యందురు. ఇతనిరాజ్యకాలము క్రీ.శ. 818–825. (ఏడుసంవత్సరములు) వైశ్యపురాణమునుండి పైనినుదాహరించిన పద్యములలోని రాజమహేంద్ర, విష్ణువర్ధన నామములనుబట్టి యీతనికాలముననే యీకథ జరిగినదనియు పై రెండవశ్లోకములోనిచ్చిన కాలమును త్యజింపవలసియుండుననియుఁ గొందఱనవచ్చును. కాని యది సత్యమని నిర్ణయించుటకుఁ దగిన యాధారములు నాకింకను లభింపలేదు. ఈకాలమునకుఁ దరువాత రాజమహేంద్రవరము రాజధానిగాఁ బరిపాలించిన విష్ణువర్ధనులొకరిద్దరున్నారు.

ఈకవిచారిత్రమున శ్రీవీరేశలింగము పంతులుగారు "రాజరాజనరేంద్రుని తండ్రియైన విష్ణువర్ధనమహారాజు గోదావరి మండలములోని

పెనుగొండలోనుండిన కుసుమసెట్టి యనుకోమటియొక్క కొమార్తెను కామించి యామెను తనకిమ్మని యడుగఁగా తండ్రి యియ్యనన్నట్టును అందుమీఁద విష్ణువర్ధనుఁడాకన్యను బలాత్కారముచేత గ్రహించుటకుఁ బ్రయత్నింపఁగా కుసుమసెట్టియును కూఁతురును నూటరెండు గోత్రముల యితర వైశ్యులును నగ్నిహోత్రములోఁబడి మృతులైనట్టును...కన్యకాశాపముచేత విష్ణువర్ధనుఁడు శిరస్సు వ్రక్కలయిచావఁగా నాతని పుత్త్రుఁడయిన రాజనరేంద్రుఁడు వైశ్యులను శాంతపఱచి కుసుమశెట్టి కొడుకయిన విరూపాక్షుని పదునెనిమిది పట్టణముల కధికారిని జేసి మిగిలిన కోమట్లను పెనుగొండలో నుండునట్లు చేసినట్టును ఇందుఁ జెప్పబడినది. ఇప్పటికిని పెనుగొండ కోమట్లకు ముఖ్యస్థలము. అక్కడ కన్యకాపరమేశ్వరిపేర దేవాలయము కట్టఁబడి వైశ్యులచే మిక్కిలి గౌరవముతో చూడఁబడుచున్నది.

గ్రంథకర్తయైన భాస్కరపంతులను బ్రాహ్మణుఁడు పెనుగొండ కొండవీడు రాజమహేంద్రవరము మొదలయిన ప్రదేశములయందుండిన కోమట్లకు గురువయియుండి కన్యకాపురాణమును రచించి, వైశ్యుల విషయమయి కొన్ని కట్టుబాట్లను జేసినూటరెండుగోత్రములవారి నాకట్టుబాట్లకు లోఁబఱచి, తన కట్టుబాటులను మీఱినవారిని వర్ణభ్రష్టులనుగా బహిష్కరించి, తనకు వశ్యులయిన వారికిఁ దానాచార్యుఁడును బురోహితుఁడునయ్యెను. గ్రంథసామగ్రి తక్కువగుటచేత నీతనికాలమిది యని నాకిపుడు నిశ్చయముగాఁ దెలియకపోయినను, ఇతఁడు పదునాఱవ శతాబ్దమునకుఁ బూర్వుఁడని తెలియవచ్చుచున్నది." అని వ్రాసియున్నారు.

వైశ్యులగ్నికాహుతియైనప్పుడున్న భాస్కరాచార్యులును గ్రంథకర్తయైన భాస్కరపంతులును భిన్నులగుదురా? కారా? యనువిషయమును శ్రీపంతులుగారు స్పష్టముగాఁ జెప్పకపోయినను గ్రంథకర్తను పదునాఱవ శతాబ్దమునకుఁ బూర్వుఁడని చెప్పుటచే వారిరువురును భిన్నులనియే శ్రీపంతులుగారు తలంచిరనుట స్పష్టము. రాజరాజు తండ్రికాలము షది

ళుప శతాబ్ది. ఆకాలమున నాంధ్రమునం గావ్యరచనము లేదు. గ్రంథ కర్తయైన భాస్కరపంతులు వైశ్యులకు గురువై పురోహితుండై కార్యోప దేష్టయైవారిని ఋజుమార్గమునం బూర్వాచార సమ్మతముగ నడిపించి యుండవచ్చును.

రాజరాజనరేందుృని తండ్రి విమలాదిత్యుండుగాని విష్ణువర్ధనుండు కాండు. రాజరాజనరేంద్రుని విష్ణువర్ధనుండని భారతకృత్యాదియందు నన్నయభట్టీకిందిపద్యములో వాడియున్నాండు.

ఆ. జారుతర మహాగ్రహారంబు లిచ్చుచు
దేవభోగముల మహావిభూతిం
దనరం జేయు నిట్లు మనుమార్గుండగు విష్ణు
వర్ధనుండు వంశవర్ధనుండు.

కాని, విమలాదిత్యునకు విష్ణువర్ధనుండను నామాంతరమున్నట్లు కన్పట్టదు.

ఇప్పటికి లభించిన యాధారములనుబట్టి వైశ్యపురాణమునందలి కథను జారిత్రకాంశములతో సమన్వయము చేయుటకు సాధ్యముకా లేదు. ఈవిషయమున నింకను బరిశోధనము చేయవలసియున్నది. శ్రీపంతులుగారే ప్రతిచూచి పైవాక్యములు వ్రాసిరోకాని రాజరాజు నామముగాని యాతండు తండ్రియనంతరమున వైశ్యులను శాంతపరచె ననుటకాని, ముదిృతపృతియందు నేంజూచినంతవఱకుం గానరాలేదు.

కర్నూలు మండలమునందలి దిగువతిరుపతిలో అహోబలేశ్వరుని యాలయపు గోడపైనున్న యొకశాసనము (A.R. 67 of 1915) లో వాసవీ కన్యకనుగూర్చియు, భాస్కరాచార్యుని గూర్చియుం గొన్ని వివరములు లిఖింపంబడియున్నవంట! ఆశాసనము క్రీ. శ. 1609 వ సంవత్సరము జూను నెల 16వ తేదీనాంటిది. పాలకొల్లునందు విష్ణువర్ధన మహారాజు శాసనమొండు కలదు. అది శా. శ. 1518 దుర్ముఖ సంవత్సరమునాంటిది. (A. R. 526-1893.) విష్ణువర్ధన మహారాజు నామముదాహృతములైన శాసనములు పెక్కులున్నవి. వాసవీకన్యను

మోహించినవాఁడీతఁడని నిర్ణయించుటకుఁ దగిన యాధారములు లభింపలేదు. భావిపరిశోధనమువలన నేమేని విశేషాంశములు బయలు పడునేమో చూడవలసియున్నది.

భాస్కరాచార్యుని కవిత్వము సరసమై మనోహరముగానున్నది. వైశ్యులగ్నిగుండములలోఁబడిన కథపట్టున వ్రాసినపద్యములు వీరభయానక రసములను జూపుచున్నవి. శైలిచూపుటకై కొన్ని మచ్చుపద్యముల నీక్రిందనిచ్చెదను.

చ. పరహితధర్మవర్తులు పండితభాస్కరవర్గ రక్షకుల్
గురునయ నీతికోవిదులు గుంభితవాక్యనిరంతరోన్నత
స్థిరతర కౌతుకాగ్ర గుణశీలురు శీలవతీ సతీమనో
హరులు పురారిపాద జలజాగ్రమధాళులు వైశ్యులిమ్మహిన్.

ఉ. శ్రావ్యముగా వినుండు నృపరాజ శిఖామణి యైనయట్టి కౌ
రవ్యుఁడు విష్ణువర్ధనుఁడు రాజకళాధరు భక్తుఁడట్ల శ్రో
తవ్యుఁడు నయ్యె నచ్చటఁ జిదంబర పూర్వరహస్య మెల్ల సూ
రవ్యవరేణ్యులార! రిపురాజవిఘాలు బలంబు లన్నియున్.

ఉ. రాజకులైక భూషణుఁడు రమ్యచరిత్రుఁడు విష్ణువర్ధనుం
డీజగమెల్ల గెల్చి ధరణీపతులిచ్చిన రాజకన్యలం
దేజముతోడఁ గైకొనుట ధీరగుణంబటుగాకయున్న దు
ర్వ్యాజము వైశ్యకన్యక వివాహమనర్హము శాస్త్రవేదికిన్.

ఉ. ఎప్పుడు కన్యయున్నతులు స్త్రీవణిగన్వయ సత్యసంధులున్
విప్పగు నగ్నిజాలముఁ బ్రవేశము సేయుట విన్నమాత్రనే
తప్పక రాజమస్తకము ధాత్రితలంబునఁ బెక్కువ్రయ్యలై
చెప్పవిచిత్రమై పడుట సిద్ధమటంచు శపించె నుగ్రతన్.

చ. స్ఫుటకఠినోగ్రవార్త చెవిసోకిన యంతన ఘోరభంగిగాఁ
బటపటఁ బాసి మస్తకము భంజితమై కడుఁబెక్కువ్రయ్యలై
పటుగతి నుగ్గులై పడఁగఁ బల్మఱుఁ గన్యకశాపఘాతిచేఁ
గుటిలుఁడు విష్ణువర్ధనుఁడు కూలె ధరిత్రి విచిత్రరూపతన్.

# 176 పద్మకవి

ఆంధ్రసాహిత్య పరిషత్తునందున్న యుదాహరణ గ్రంథములో పద్మకవి జినేంద్రపురాణములోనిదని యీక్రిందిపద్య మొక్కటియు నుదాహృతమైయున్నది. ఈపద్మకవినిగూర్చి యేమియుఁ దెలియరాలేదు. ఈజినేంద్రపురాణమున జైనులకథలు చెప్పబడియున్నవనుకొందును. ఈగ్రంథమిప్పుడెచ్చటను లభించుటలేదు.

సీ. హరినిలయంబును హరినిలయంబును
విషధరాఢ్యంబును విషధరాఢ్య,
మప్సరోమయమును నప్సరోమయమును
వనవిలాసమును బావనవిలాస
మున్నత కరిశృంగ మున్నతకరిశృంగ
మిందుకాంతస్రవ మిందుకాంత
మురుకలనకులంబు మరుకలనకులంబు
నంశుకాంతద్యోతితాంశుకాంత

గీ. మొనర నవశతసాహస్రయోజనోన్న
తమును బదివేలు యోజనాల మరువలము
గలిగి కనకాద్రికిన్నాటఁగలిగి తనరి
ప్రథితమై యొప్పు మందరపర్వతంబు.

ఈకవి క్రీ. శ. 1560 కంటెఁ బూర్వుఁడు. ఇంకనేమియు నీతనినిగూర్చి తెలియదు.



## 177 మొల్ల

ఈ కవయిత్రి రామాయణము నాఱుకాండములను బద్యకావ్యముగా రచియించి, శ్రీరామచంద్రున కంకితము చేసినది. యుద్ధకాండమును మూఁడుభాగములుగాఁ జేసి వానికాశ్వాసములని పేరుపెట్టినది. ఈరామాయణము నీమెపేరుతోఁగూడఁ జేర్చి "మొల్లరామాయణము" అని వాడుచున్నారు. ఈమె యేకులమునకుఁ జెందినదియు గ్రంథమువలనఁ దెలియదు. కాని చిరకాలమునుండి యీామె కుమ్మరకులజురాలని ప్రతీతియున్నది. అందుచే ఈమెను కుమ్మరమొల్లయని యనుచుందురు. ఈమెభర్తపేరెవ్వరో భర్తయింటిపేరేదియో గ్రంథమునఁ జెప్పలేదు. ఈదేశమునందు స్త్రీలు వివాహము చేసికొనకుండ కన్యకగానుండు నాచారములేదు. కావున నీమె కన్యకాదనియుఁ జిన్నతనముననే భర్తపోవుటచే మరల బరిణయమాడక భగవద్భక్తియందుఁ గాలమును వినియోగించుచుఁ బాండిత్యమును సంపాదించి గ్రంథరచనముచేసెననియుఁ దలంపవలసియున్నది. ఈమె కులటయై వ్యభిచారవృత్తిచేఁ గాలముగడపెనని కొందఱనుచున్నారు. శ్రీకృష్ణదేవరాయని యంతఃపురముననే యీాతని యుంపుడుకత్తెగా నుండెనని కూడ వదంతికలదు. కాని యవియన్నియుఁ గల్పనలు. గ్రంథమున కచకుచాద్యవయవవర్ణన ముండుటయు నీమెకు మొల్లయని సామాన్యముగాఁ గులటలకుండు నామముండుటయు నీమెను గులటయని తలంచుటకుఁ గారణములని యనెదరు. కాని యవి ప్రత్యుత్తరమీాయఁదగినంత యవసరమున్ననిమిత్తములుకావు. కావున నావిషయమునింతతో వదలిపెట్టితిని.

ఈకవయిత్రి నామము మల్లి కాని మొల్లకాదనియు, ఈమె నివాసగ్రామమందలి యీశ్వరుఁడు మల్లేశ్వరుఁ డనియు, నాదేవునిపేర మల్లమ్మయని తలిదండ్రులీమెకు నామకరణము చేసియుందురనియు, నుత్తరహిందూస్థానమున నీమెకు మల్లియను పేరే వాడుకలోనున్నదనియు కనుపర్తి వరలక్ష్మమ్మగారు భారతిపత్రికలో వ్రాసియున్నారు. అది

సత్యమే కావచ్చును. కాని తాళపత్రప్రతులలోను ముద్రిత గ్రంథముల లోను నీమెపేరు మొల్లయనియే కన్పట్టుచున్నది. చిరకాలానుగతమైన నామమగుటచే నీచరిత్రమున నేనును మొల్లయనియే వ్రాసియుంటిని.

ఈమె నివాసము పడుగుపాడనియు, నీమెయుఁ దిక్కనసోమ యాజి భారతమును తెలిగించినప్పుడు లేఖకుఁడుగా నుండిన కుమ్మర గురునాథుఁడును సోమయాజుల తండ్రియైన కొమ్మనకు రంగప్పయను కుంభకారుని పుత్రికవలన జన్మించిరనియు కొందఱు వ్రాసిరి. కాని తిక్కన సోమయాజికిఁ తరువాత నూఱు సంవత్సరములలోనున్న శ్రీనాథుని, బూర్వకవులలోఁజేర్చి మొల్ల తన రామాయణమున స్తుతించియుండుటచే నావ్రాఁత నిరాధారమైనదని శ్రీవీరేశలింగము పంతులు గారాంధ్రకవుల చరిత్రములో వ్రాసియుండిరి. కవులవిషయమునఁ బండితులపట్ల, రాజులనుగూర్చి యిట్టి యద్భుతకథలు పుట్టుచుండుట క్రొత్తకాదు.

ఈమె తనతండ్రి శైవాచార సంపన్నుఁడును గురులింగ జంగమా ర్చనపరుఁడునైన యాతుకూరి కేసనశెట్టియని యీక్రింది గద్యపద్యము లలోఁ జెప్పినది.

క. గురులింగ జంగమార్చన
పరుఁడును శివభక్తిరతుఁడు బాంధవహితుఁడున్
ధర నాతుకూరి కేసయ
వరపుత్రిని మొల్లనాఁగ వర్ధిలుదానన్.

గద్య: ఇది శ్రీమద్గౌరీశ్వర వరప్రసాద కవిత్వచమత్కార నారీ గుణోత్తమ విచక్షణ నిత్యశైవాచార సంపన్న గురులింగ జంగమార్చన వినోద సూరిజన వినుతాతుకూరి కేసనశెట్టి తనయ మొల్లవిరచితంబైన రామాయణకావ్యంబు."

ఈమెకవిత నల్లుటలోఁ దనకు నైపుణ్యము మిక్కిలి లేదనియు, భగవదనుగ్రహముచే నీగ్రంథమును రచించితిననియు, దప్పులెన్న వలద నియుఁ నీక్రింది పద్యములలోఁ బండితులను బ్రార్థించినది.

సీ. దేశీయపదములు దెనుఁగులు సాంస్కృతుల్
సంధులు ప్రాఙ్ఞులశబ్దవితతి
శయ్యలు రీతులుఁ జాటుప్రబంధంబు
లాయాసమాసంబు లర్థములును
భావార్థములుఁ గావ్యపరిపాకములు రస
భావచమత్కృతుల్ పలుకుసరణి
బహువర్ణములును విభక్తులు ధాతుల
లంకృతిచ్ఛందో విలక్షణములుఁ

తే. గావ్యసంపద క్రియలు నిఘంటువులును
గ్రమము లేవియు నెఱుఁగ విఖ్యాతగోప
వరపు శ్రీకంఠ మల్లేసు వరముచేత
నెఱిఁ గవిత్వంబుఁ జెప్పఁగా నేర్చికొంటి.

క. చెప్పుమని రామచంద్రుఁడు
సెప్పించిన పలుకు మీఁదఁ జెప్పెద నేనె
ల్లప్పుడు నిహపరసాధన
మిప్పుణ్యచరిత్ర తప్పులెంచకుఁడు కవుల్.

ఆంధ్రదేశమున గోపవరములు చాలగలవు. ఈమెనివాసము నెల్లూరి మండలములోని గోపవరమని కవి చరిత్రకారులు వ్రాసి యున్నారు.

ఈకవయిత్రి యాంధ్ర కవిత్వమెట్లుండవలయునో యీక్రింది మూఁడు పద్యములలోఁ జెప్పి యందుకనుగుణముగఁ దనగ్రంథమును రచియించినది.

క. మునుసంస్కృతంబు తేటగఁ
దెనిఁగించెడిచోట నేమి తెలియకయుండన్
దనవిద్య మెఱయఁ గ్రమ్మఱ
ఘనమగు సంస్కృతముఁ జెప్పఁగా రుచియగునే.

ఆ. తేనె సొక నోరు తియ్యనయగురీతిఁ
దోసి యర్థమెల్లఁ దోఁపకున్న
గూఢశబ్దవితతి కొట్లాట పనియెల్ల
మూఁగ చెవుడు నాడు ముచ్చటగును.

క. కందువమాటలు సామెత
లందముగాఁ గూర్చి చెప్ప నది తెనుఁగునకున్
బొందె రుచియై వీనుల
విందై మఱి కానిపించు విబుధులకెల్లన్.

రామాయణము ననేకులు రచియించియుండగాఁ దాను మరల రచించు టేల యని యెవ్వరైన నందు రేమోయని శంకించుకొని యాప్రశ్నకీ క్రిందిపద్యములలో నీమె బ్రత్యుత్తర మొసంగినది.

ఉ. రాజితకీర్తి మున్నె రఘురాము చరిత్రము సత్కవీశ్వరుల్
తేజమెలర్పఁ జెప్పుటది తెల్సియుఁ గ్రమ్మఱఁ జెప్పనేలనన్
భూజనకల్పకంబనుచు భుక్తికి ముక్తికి మూలమంచు నా
రాజును నెవ్వరైన రఘురాము నుతించినఁ దప్పుగల్గునే ?

క. నేరిచి పొగడినవారిని
నేరక కొనియాడువారి నిజకృప మనుపన్
గారణమగుటకు భక్తియె
కారణమగుఁగాక చదువుకారణ మగునే.

తన గ్రంథమును నరకృతిసేయక శ్రీరామునకర్పించుటకుఁ గల కారణము నీక్రింది పద్యములో సూచించినది.

ఉ. సల్లలిత ప్రతాపగుణ సాగరుఁడై విలసిల్లి ధాత్రిపై
బల్లిదుఁడైన రామనరపాలకు సన్నుతిసేయు జిహ్వకున్
జిల్లర రాజలోకములఁ జేకొని యాడఁగ నిచ్చవుట్టునే
యల్లము బెల్లముందినుచు నప్పటి కప్పటి కానసేతురే ? ...

ఈకవయిత్రి కావ్యరచనాకాలమును గ్రంథమునఁ జెప్పలేదు. సంస్కృతాంధ్ర కవులను నుతించు నీక్రింది పద్యములో శ్రీనాథునిఁ బేర్కొనినది.

సీ. సురసన్నుతజ్ఞాను సువివేకి వాల్మీకి
నఖిల వేదాగమాభ్యాసు వ్యాసు
ఘోరాంధకార ప్రభారవి భారవి
సత్కాంతి హిమకరశ్లాఘు మాఘు
వివిధకళాన్విత విఖ్యాతి భవభూతిఁ
బ్రకట కార్యధురీణు భట్టబాణు
మానినీ లోకసమ్మదముద్ర శివభద్రుఁ
గవితారసోల్లాసుఁ గాళిదాసు

తే. స్తుతగుణోద్దాము నాచనసోము భీము
నవ్యమంజుల వాగ్ధుర్యు నన్నపార్యు
రసికుఁడైనట్టి శ్రీనాథు రంగనాథుఁ
దిక్కకవిరాజును నుతించి ధీనిమించి.

పదునైదవ శతాబ్దినున్న శ్రీనాథును బూర్వకవిగా నుతించుట చేతను, పదునాఱవ శతాబ్దియందున్న కవుల నెవ్వరిఁ బేరుపెట్టి దలపెట్టక

క. తొల్లిఁటి యిప్పటి సత్కవి
వల్లభులను రసికవినుత వాగ్విభవకళా
మల్లులఁ గవితారచనల
బల్లిదులైనట్టి ఘనుల భక్తితోఁ దలతున్.

అనిచెప్పియుండుటచేతను నీమె పదునాఱవ శతాబ్దియందుఁ బూర్వార్థమున నున్నట్లూహింపవచ్చును పోతన ననుకరించి "చెప్పు మని రామచంద్రుఁడు" అను పద్యమును జెప్పియుండుటచే నీమె పోతన కంటె నర్వాచీనురాలు.

అక్కడక్కడఁ గొన్ని వ్యాకరణదోషములున్నను మొత్తము మీఁద నీమె కవిత్వము మిక్కిలి మృదువయి మధురమయి రసవంత

ముగా నున్నదనియు, నిది పురుషులు చెప్పిన గ్రంథములలో ననేకములు కంటె మనోజ్ఞమై ప్రౌఢమై యున్నదనియు కవుల చరిత్రకారులు వ్రాసియున్నారు. విశ్వవిద్యాలయ పరీక్షకేగు విద్యార్థుల కీపాత్రమును గొన్నిమాఱులు పాఠ్యగ్రంథముగా నిర్ణయించియున్నారు.

ఈమె కవిత్వశైలి తెలియుటకై కొన్నిపద్యముల నిట నుదాహరించుచుయున్నాఁడను.

ఉ. రాజులు కాంతియందు రతిరాజులు రూపమునందు వాహినీ
రాజులు దానమందు మృగరాజులు విక్రమకేళియందు గో
రాజులు భోగమందు దినరాజులు సంతతతేజమందు రా
రాజులు మానమందు నగరమ్మున రాజకుమారులందరున్. బా. కా.

ఉ. నారదులైరి సన్మునులు నాకమహీజములయ్యె భూజముల్
శారదలైరి భామినులు శంకరశైలములయ్యె గోత్రముల్
పారదమయ్యె నీరధులు పన్నగనాయకులయ్యె నాగముల్
వారిదవర్గమెల్ల సితవర్ణములయ్యెను బండువెన్నెలన్. అ. కా.

చ. సుడిగొని రాముపాదములు సోకినధూళి వహించి ఱాయి యే
ర్పడ నొక కాంతయయ్యెనఁట పన్నుగ నీతని పాదరేణు వి
య్యెడవడి నోడ సోఁక నిది యేమగునో యని సంశయాత్ముఁడై
కడిగె గుహుండు రాముపదకంజయుగంబు భయమ్ము పెంపునన్.

మ. వినుమో రాఘవ! పంక్తికంధరుఁడు దోర్వీర్యంబు సంధిల్లఁగా
జనకక్ష్మాపతినందనన్ గొనుచు స్వేచ్ఛావృత్తితో నేఁగుచో
వనితారత్నము దీనయై పలుకు తద్వాక్యంబు లేర్పాటుగా [ఆ. కా.
విని పోరాడఁగఁ బ్రాప్తమయ్యె మఱి యీవేషంబు భూమీశ్వరా.

ఉ. కూరలు నోటికిన్ రుచులు గూడుట దప్పెను దుంపతూఁడులుం
గారము తోఁచె జిహ్వకును గమ్మని తేనెలు చేఁదులయ్యెఁ గం
గారయ్యెఁ జిత్తమంతయును గంటికి నిద్ర వహింపదయ్యె శృం
గార మెలర్ప సీతఁ బొడగానమి రామనృపాల మౌళికిన్. కి. కా.

ఉ. ఎవ్వఁడవో రి నీకుఁ బ్రభుఁడెవ్వఁడు చెప్పుము నీవిటొంటిమై
నివ్వనరాశి దాఁటి యిఁట కేగతి వచ్చితి నామమేమి నీ
వెవ్వని పాప్రపునం బెటికి తీవన మంతయు శంక లేక యిం
కెవ్వని ప్రాపునం దునిమి తీసుర వైరుల నెల్ల నుగ్రతన్. సుం. కా.

మ. పరుషోద్యత్కులిశాకృతిన్ బొమలు చూపట్టంగ శోణప్రభో
త్కరరేఖ ల్గనుఁగొల్కుల న్నిగుడఁ గోదండంబు చేఁదాల్చి భూ
వర వంశాగ్రణి రాముఁడద్భుతముగా వారాశిమీఁదన్ వడిన్
శరజాలంబులు పేర్చి వేయుటయు నిచ్చన్ బ్రాణభీతిన్ వడిన్.

చ. నరవర! నాదుచిత్తము మనంబున నీవె యెఱింగియుండియున్
బరుషములాడ నేమిటికిఁ బాపము నాయెడ లేదు కాదు పో
సురలు నుతింప మేటిసాదఁ జొచ్చెద మెచ్చుఁ డటన్న రామభూ
వరుని మనం బొడంబడిన వారిజలోచన సీత యాతటిన్. యు. కా.

## 178 రాపరది దేచిరాజు

ఈకవి నామముమాత్రమే తెలిసినది. కాని యాతఁడు రచించిన గ్రంథముపేరైనను దెలియలేదు. ఆంధ్రసాహిత్యపరిషత్తునందున్న యుదాహరణ గ్రంథసంధాత గ్రంథముపేరు చెప్పకుండ నీతనిదొక్క పద్యముదాహరించినాఁడు. ఈపద్యమునుబట్టి గ్రంథనామమూహింపనను వైనది కాదు. ఆపద్యము నీక్రింద వ్రాయుచున్నాఁడను.

మ. ఘనవప్రో పరిచాగ కేతుకషణన్ గంజారి బింబంబు కం
దినదంచున్ బురిముగ్ధ భామినులు ప్రీతిన్ గందువోఁ దోమఁ జం
దన మర్ధింగొని లీల నీలరుచిమత్కాంతోరు హార్మ్యంబు లె
క్కిన నంభోదతటిల్ల తావితతిమాడ్కిం బొల్తు రుద్యద్గతిన్.

ఈకవి క్రీ. శ. 1560 కంటెఁ బూర్వుఁడు. ఇతనినిగూర్చి యింక నేమియుఁ దెలియదు.

# 179 పో శెట్టి లింగకవి



నవచోళ చరిత్రము, మలహణ చరిత్రము, శంకరదాసమయ్య చరిత్రము, వీరసంగయ్యదేవచరితము, శిష్యప్రబోధము అను ద్విపద కావ్యము లీతనిరచనములు. నవచోళచరిత్రము శ్రీపంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిల వారిపీఠికతో ముద్రితమయినది. తక్కిన గ్రంథములు గన్పట్టుటలేదు.

నవచోళ చరిత్రమునఁ గవితననుగూర్చి యిట్లుచెప్పుకొనినాఁడు.

విమలశివాచార విభవసంప్రీతి
విమలమా నవచోడ విభవంబులెల్ల
నిర్ణయంబుగఁజేసి నిపుణత మెఱసి
వర్ణించునట్టి నావంశమెట్లనిన,
క్షితిని "మాతా—హిమగిరిసుతా" యనఁగ
నతిశయరీతి "పితా—రుద్ర" యనఁగ
బాంధవుల్ శైవులు భక్తులౌననఁగ
శంకరదాసయ్య — శరణవంశజుఁడ
శంకరదాసయ్య — శరణగోత్రజుఁడ
మూలమా శ్రీగురు పూజించుశ్రీల
లీలఘను పోశెట్టి లింగమునాఁగఁ
బరఁగినవాఁడ సద్భక్తుల కరుణ
స్థిరభక్తి మహిమలఁ జెలగినవాఁడ.

వీరశైవులు తమకులగోత్రములఁ జెప్పుకొనరు. ఈకవియు నట్లే శంకరదాసయ్య వంశమనియు, నదియే గోత్రమనియుఁ జెప్పి యూరకుండెను. శంకరదాసయ్య గొప్పశివభక్తుఁడు. అందుచే నతనిగోత్రజుఁడననియు, నతనివంశజుఁడ ననియుఁ జెప్పుకొనినాఁడు. ఆదాసయ యీకవికి దీక్షాగురువేమో !

ఈక్రింది ద్విపదలవలన నీతఁడు రచించిన గ్రంథనామములును

చకిలాల లింగప్ప యనునతఁడీనవచోళ చరిత్రమును రచియింపుమని కవిని బ్రోత్సహించినట్లును దెలియవచ్చుచున్నది.

భక్తులసద్గోష్ఠిఁ బాయనివాఁడు
భక్తి మనస్సున ఫలియించువాఁడు
ధర్మార్థపరుఁడు నిద్దంబగుభక్తి
నిర్మలచిత్తుండు నీతివర్తనుఁడు
పరమాత్ముఁ డుద్దామబగిరాముపల్లి
గురుపదధ్యానుండు గురుపూజితుండు
సంగీత భక్తిభావజ్ఞుఁడు చకిలాల
లింగప్ప సద్భావలీలల నొప్ప
నన్ను రావించి మన్నన గారవించి
మున్నుఁగా భూతితాంబూలంబు లొసఁగి
వెరవొప్ప నీవుల వేడ్కతో నొసఁగి
హర్షంబు తోడుత నప్పుడిట్లనియె.
"ఇరవొంద మునుముక్తి నీశు రామేశు
వరలాభమున భక్తవరులగుననఁగ
కరమర్థి వెలయు శంకరదాసమయ్య
చరితంబు నవ్వీరసంగయ్యదేవు
చరితంబు మల్హణచరితంబు మఱియు
హర్షంబుఁ దనర శిష్యప్రబోధనము
నచలితరీతిఁ బరమాను రాగమున
రచియించితివి భక్తిరచన నింపొందఁ
గావున నట్టిసంస్కారివి గాన
భావజ్ఞు లగు భక్తిపరులు గారణులు
రసికులు నవచోడరాజులు మున్ను
నసలారఁ బూజించి యాధ్యత మించి
వలనొప్ప మోక్షంబు వడసిన మహిమ

నలగన్నడముఁ జేసి రాద్యులు మున్ను
వెలయఁగా నీవును విజ్ఞానమునను
దెలుఁగున నద్దాని ద్విపదఁ గావించి
స్థిరగురుమూర్తి దేశికచక్రవర్తిఁ
బరమాత్మ శ్రీరాముపల్లి నివాసి
దృఢయశస్కుఁడు మృత్యుంజయేశ్వరుఁడు
నవిరళభక్తి సామ్రాజ్య పూజ్యుండు
సద్గుణగణనిధి సత్యసంధుండు
మద్గురునాథుండు మన్మనోహరుఁడు
అనురక్తి నట్టిమహాత్మునిపేరఁ
దనరారఁగా నంకితము సేయవలయుఁ"

కవి యీగ్రంథమును బగిరాము పల్లెయందలి మృత్యుంజయేశ్వర స్వామికిఁ గృతియిచ్చెనని శ్రీ ఆదినారాయణశాస్త్రులవారు పీఠికలో వ్రాసియున్నారు. పైని వ్రాసిన ద్విపదలనుబట్టి కృతిపతి దేవుఁడు కాఁడనియు, బగిరాముపల్లె నివాసియగు మృత్యుంజయ నామముగల మానవుఁడనియు కృతిప్రేరకుఁడైన చకిలాల లింగప్పకును మరికొందఱు శివభక్తులకును గురువనియు నేనూహించుచున్నాఁడను. ఈబగిరాము పల్లెను శ్రీరాముపల్లెయనియు రామపల్లె యనియు నీగ్రంథముననే కవి వాడియున్నాఁడు. ఈగ్రామమెచ్చటనున్నదో తెలియులేదు. బళ్లారి మండలముననో, మైసూరు రాష్ట్రముననో ఉండియుండును. నవచోళ చరిత్రము మొదటఁ గన్నడభాషలో నుండెనఁట! దాని నీతఁడాంధ్రీకరించెనఁట! కవి రెండుభాషలయందును బండితుఁడై యుండవలయును. గ్రంథమునందలి మఱికొన్ని ద్విపదలను జదివినను మృత్యుంజయుఁడు మానవుఁడే కాని దేవుఁడు కాఁడని తోఁచినది. ఆశ్వాసాద్యంతముల యందుఁ జకిలాల లింగప్పయే సంబోధింపఁబడియెను.

గార్లపాటి లక్ష్మణుఁడు పోశెట్టి లింగకవికి గురువనియు, నాతఁడు వీరభద్రేశ్వర విజయమును రచియించెననియు నీకవి నవచోళ

చరిత్ర కృత్యాది ద్విపదలలోఁ జెప్పియున్నాఁడు. వాని సాలఙ్కృతకవి చారిత్రమునం దుదాహరించెదను.

శ్రీఆదినారాయణశాస్త్రిలవారు పీఠికలో నీక్రిందివాక్యములను వ్రాసి యీకవి కుమ్మర కులజుఁడని నిర్ణయించినారు.

"సాధారణముగా తక్కిన కవులందఱును పేర్కొన్నట్టుగా గాక ప్రతిచోటునను శరణవంశజుఁడ శరణగోత్రజుఁడ అని యిట్లు ప్రపత్తి సూచకముగా ప్రయోగించిన పదములు ఈయనయొక్క వీరశైవోత్తమత్వమును వెల్లడిసేయుచున్నవి. లింగకవి, కులగోత్రముల కతీతమగు వీరశైవ కుటుంబమువాఁడైనను ఇంటిపేరగు పోశెట్టి యనుపదము 'ఇతఁడు ఆంధ్రదేశమునందలి కుమ్మరుల వంశమునకు జెందినవాఁడని' సూచించుచున్నది. శెట్టిపదమిప్పటికిని కుమ్మరులలో అనూచానముగ వాడబడుచు వచ్చుచున్నది. పైగా పోశెట్టివారు కుమ్మరులలో తప్ప మాయెఱిఁగినంతదనుక నితరవర్ణములలో లేరు. ఇందుకు ఈయన గ్రంథమునందే మఱియొక్క చిన్నయాధారమును గలదు. గ్రంథారంభమున భక్తగణస్తుతిని జేయుచు పురాతనులును ఆదియుగములకు జెందినవారు నగు నందీశ్వరుని భృంగీశ్వరుని పేర్కొన్నతరువాత — వీరశైవులలో మిక్కిలి ప్రసిద్ధిని గడించినవారు — అన్నివిధముల రెండవ ఈశ్వరమూర్తులని పేర్కొనదగినవారు — అగు బసవేశ్వరుఁడు, పండితారాధ్యుఁడు మున్నగువార లెందఱోయున్నను తొలుదొల్త భక్తగణస్తుతిని కుమ్మర గుండయ్యతో ఆరంభించుచున్నాఁడు చూడుఁడు.

శ్రీనందినాథుని శ్రీభృంగినాథు
మానకంజారు కుమ్మరగుండవిభుని
శంకరదాసయ్య శమనారిమరుళు — ఇత్యాది.

ఎంతవారికిని స్వకులప్రశంస అవశ్యకార్యముకదా! కాగా పైనివివరించినదానివలన లింగకవి కుమ్మరకులమునందు జనించినవాఁడనియును శంకరదాసుని వంశమునందు జన్మించినవాడనియును తేలుచున్నయది.

"ఈవాక్యమునుబట్టి కృతికర్తయగులింగకవియును కృతిప్రేరకుడగులింగప్పయును ఇర్వురునుగూడ కుమ్మరకులమువారేయని దృఢమగుచున్నది."

ఈవిషయమున శ్రీశాస్త్రిలుగారియూహ సత్యమేకావచ్చును.

ఈకవికాలమును నిర్ణయించుట కెట్టియాధారములును గ్రంథమున లేవు. శ్రీశాస్త్రిలవారు పీఠికలో "ఈగ్రంథమును రచించిన పోశెట్టి లింగకవి పదునైదవశతాబ్ది చివరవాఁడు" అని వ్రాసియున్నారు. కాని యందుల కాధారములనీయలేదు. ఇతరాధారములేవియైన లభించువఱకది యే యనుసరణీయము.

ఈగ్రంథమునఁ గరికాలచోళుఁడు, విక్రమచోళుఁడు, ఉత్తుంగచోళుఁడు, అహివరచోళుఁడు, వరధర్మచోళుఁడు, సత్యేంద్రచోళుఁడు, మనుజేంద్రచోళుఁడు, ఉత్తమచోళుఁడు, వీరచోళుఁడు అను తొమ్మండ్రుచోళుల చారిత్రమును చెప్పఁబడినవి. ఈకథలు పండితారాధ్యులవారు భైరవరాజునకు చెప్పినట్లిందుఁ జెప్పఁబడినది. ఈభైరవరాజు పశ్చిమ సముద్రతీరమందున్న సాసలాపురమున కధిపతియఁట. ఈసాసలాపుర మెచ్చటిదో భైరవరాజెవ్వరో తెలియలేదు. పండితారాధ్యచరిత్రమునం దీభైరవరాజు వృత్తాంత మేమియు నుదాహృతము కాలేదు.

ఈచోళులు తొమ్మండ్రును గొప్ప శివభక్తులు. ఈశ్వరానుగ్రహమువలన మానవాతీతములగు నద్భుతకార్యములనొనర్చి తుదకు కైలాసమున కేఁగిన వృత్తాంతములే యిందువర్ణితములైనవి. కరికాలచోళుఁడు దక్క తక్కిన చోళులు చారిత్రక పురుషులవలెఁ గన్పట్టరు. భైరవరాజును జారిత్రక పురుషుఁడుకాఁడు. ఇదిచారిత్రముకదాయని చారిత్రక దృష్టితోఁ జూచినవారి కిందుఁ జారిత్రకాంశములు లభింపవు. పండితారాధ్యులు కవి పండితుఁడు. నిరుపమాన శివభక్తుఁడు. ఈతని చారిత్రమును ఆంధ్రకవితరంగిణియందు ( 2 వ సం. పుట 26 ) వ్రాసియున్నాఁడను. బసవనారాధ్యుఁ డీతనినిగూర్చి యొకపెద్ద ద్విపదకావ్యమును, శ్రీనాథుఁడు పద్యకావ్యమును వ్రాసియుండిరి.

ఈగ్రంథమునఁ బ్రథమాశ్వాసమంతయుఁ గరికాల చోళుని కథయే. ఇతనిని తిక్కనసోమయాజి తన నిర్వచనోత్తర రామాయణమున :

శా. చేసేతన్ బృథివీశు లందుకొనఁగా గాశీసింధు తోయంబులన్
జేసె న్మజ్జన ముంగుటంబున హరించె న్బల్లవోర్వీను ను
ల్లాసంబొందఁగ ఫాలలోచనము లీలంగట్టెఁ గావేరిహే
లాసాధ్యాఖలదిఙ్ముఖుండు కరికాలక్ష్మావిభుం డల్పుఁడే ?

అని కీర్తించియున్నాఁడు. ఈతఁడొనర్చిన ఘనకార్యములలోఁ గావేరినదికిఁ గట్టకట్టించుటమాత్రమే. నవచోళ చారిత్రమునవర్ణితమైనది. ఈకవి ప్రసక్తానుప్రసక్తముగ నీనవచోళులకథలలో భాస్కరచోళుఁడు, ముక్కంటిచోళుఁడు, పిట్టవ్వ, చెన్నయ్య, నయనారు, మితవచనుఁడు గణపాలుఁడు మొదలగు శివభక్తుల కథఁ నుగ్గడించినాఁడు. ఐదవ యాశ్వాసమంతయు, భైరవరాజుతో సంబంధించిన కథలను వర్ణించెను. మఱియు, నీశ్వరపూజాద్రవ్య మహిమము, ఆరాధనవిధి, నైవేద్య విధానము మొదలగు శైవాచారములను, వేదాంత విషయములను జెప్పియున్నాఁడు.

ఇతని కవిత్వము సరసమై మనోహరముగా నున్నది. మచ్చునకుఁ గొన్ని ద్విపదలనిట వ్రాసెదను.

జననుతంబుగఁ బూర్వజన్మంబునందు
మనుజుండనై బహుమన్ననల్ బడసి
వెలయ నువ్వుల ననుభవించుటఁజేసి
బలువేగ వానింటఁ బసువురూపమున
జనియించి యష్టకష్టంబులఁ బడుచు
పనిచేసిపెట్టితి బహుమార్గములను
అట్టిచందంబున నాఋణశేష
మెట్టునుఁదీఱక యీాగతినేను
యీాచేనికావలి నిట్లున్నదాన

ఈచందమెఱుఁగక యీతిలలునీవు
అపహరించియు నేమియార్జింపఁగలవు
ఉపమెఱుంగవు నీవు ఊరకపోవు
చెనసి నువ్వులఋణము చెడ్డదియనుచు
వినియు నెఱుంగవు వేదుఱుగావు
చనుమన్న నువ్వులు జల్లునవిడిచి
చనియె నచ్చటనుండి సారమార్గమున

## 180 గార్లపాటి లక్ష్మణకవి

ఈకవినిగూర్చిన విశేషములేవియుఁ దెలియదు. పోశెట్టి లింగన కవి రచించిన నవచోళ చరిత్రమను ద్విపదకావ్యములో నీలక్ష్మణకవి వీరభద్ర చరిత్రమును రచియించిన ట్లీక్రింది ద్విపదలలోఁ జెప్పి యున్నాఁడు.

వీరభద్రేశ్వరు విజయ సాహసము
వీరరసమున విరచించితానె
దాతయై కవులకు ధాత్రిలో నుతవి
ధాతయై మఱి నెఱదాతయైమిగులఁ
బాటల సద్భక్తిపరులు నుతసేయఁ
బాటికెక్కిన గార్లపాటి లక్ష్మణుని
వెలయఁగా వినుతించి విజ్ఞానమునను

తెనాలి రామకృష్ణకవికి, తెనాలివారను యింటిపేరు రాకపూర్వము గార్లపాటివారను గృహనామమును గలిగియుండెడివారని విన వచ్చుచున్నది. ఇతని కాలమును దెలియదు. పదునాఱవ శతాబ్ధి వాఁడని యనుకొందము. తెనాలి రామకృష్ణుని తండ్రియైన గార్లపాటి రామమంత్రి కీతఁడు సోదరుఁడేమోయని యొకయూహ కలుగు చున్నది.

వీరభద్ర చారిత్ర మిప్పుడెచ్చటను గన్పట్టుటలేదు. అది ద్విపద కావ్యమో పద్యకావ్యమో తెలియలేదు.

—౦—

## 181 తాళ్ళపాక తిరువెంగళనాథుఁడు

ఇతఁడు నందవరీక బ్రాహ్మణుఁడు; ఋక్శాఖీయుఁడు; ఆశ్వలాయన సూత్రుఁడు; భారద్వాజ గోత్రుఁడు; తాళ్లపాక యన్నయాచార్యునకుఁ బ్రపౌత్రుఁడు; పెదతిరుమలాచార్యునకుఁ బౌత్రుఁడు; చిన్నన్నకుఁ దమ్ముని కుమారుఁడు. ఈముువ్వురును గవులు. వీరిచారిత్రములు నీయాంధ్రకవితరంగిణి (6;8సం.) యందు వ్రాసియున్నాఁడను.

ఈతిరువెంగళనాథుని తండ్రి వేంకటేశదీక్షితుఁడు. ఈకవి నివాసము తిరుపతి.

ఇతఁడు అమరుకకవి చే సంస్కృతమునరచితమైన యమరుకమను శృంగారశతకము నాంధ్రీకరించి శ్రీవేంకటేశ్వరున కంకితము చేసెను. ఈగ్రంథము ముద్రితము కాలేదు. ప్రతిపద్యమునకును ముందాపద్యము నందలి భావమును వచనములోఁ దెలిపియున్నాఁడు. శ్రీవెంకటేశ్వరుని నుతించుచు వ్రాసిన మొదటిపద్యమిది:—

ఉ. "శ్రీరుచిరాంగ నాశ్రిమ విచిత్రవిభూషణ స్నానచందనో
దారవిలాసదీపితమునై యసితోత్పలకాంతి మించి శృం
గారరసంబు దోఁచెననఁ గన్నులపండువునైన మేనియొ
య్యారముఁ జూపు వేంకటనగాధిపుఁ డీవుత మాకుఁ గోరికల్."

మొదటి పద్యమునకు ముందు వ్రాసినవచనము:—

వ. "శృంగార రసప్రధాన మమరుక కావ్యము శృంగారము—సంభోగము, విప్రలంభము నని రెండు విధములు. అందులో సంభోగ శృంగారము మొదలుగా నుద్యోగించి శృంగార రసానకు ఆలంబన విభావమైన నాయికాస్వరూపమునే దేవతగా భావించి తృతీయపురుషార్థమునుగూర్చి ఆశీర్వచిస్తున్నాఁడు.

చ. చెదరిచలించు ముంగురులు, స్వేదకణంబుల నింతజారు బొ
ట్టొదవు రతాంతకాంతిమెయి నొయ్యనసోలెడుకన్నుఁదామరల్
కదలెడు కుండలంబులును గల్గిన పౌరుషభాసమానయై
ముదితముఖారవింద మతిమోదము మీకు నొసంగుగావుతన్.

దీనికి సంస్కృతశ్లోకమిది:—

శ్లో. ఆలోలామలకావళిం విలులితాం బిభ్రచ్చలత్కుండలం
కించిన్మృష్ట విశేషకం తనుతరై స్స్వేదాంభసాం జాలకైః
తన్వ్యా యత్సురతాంతతాంతనయనం వక్త్రం రతివ్యత్యయే
తత్త్వాం పాతుచిరాయ కిం హరిహర బ్రహ్మాదిభి ర్దేవతైః.

తుదిపద్యమునకు ముందున్న వచనము:—

వ. "నాయికా పాదతాడితుఁడైన నాయకుఁడు మదనదేవునకుఁ బ్రియుఁడని కావ్యాంతమందుఁ గవీశ్వరుఁడు మంగళాచరణమును జేస్తున్నాఁడు.

ఉ. యావరసార్ద్రమున్ గిసలయారుణకోమలమున్ విమాత్నర
త్నావళి నూపురంబును మదాలసభావము నౌపదంబు చే
నేవరపూరుషుండు ప్రణయేర్ష్యఁ బరాంగనచేతఁ దాఁకితుం
డై విలసిల్లువాఁడు కుసుమాయుధ దేవునకుం బ్రియుండగున్.

ఈపద్యమున కమరుకుని శ్లోకమిది:—

శ్లో. సాలక్తకేన నవపల్లవ కోమలేన
పాదేననూపురవతా మదలాలసేన
యస్తాడ్యతే దయితయా ప్రణయాపరాధా
దంగీకృతో భగవతా మకరధ్వజేన.

గ్రంథాంతమునఁ గృతికర్త తననుగూర్చి యీ రెండు పద్యములను జెప్పుకొని యున్నాఁడు.

క. ఇలఁ దాళ్లపాక సత్కుల
తిలక శ్రీవేంకటేశ దీక్షితసుతుఁడు

చ. చెదరిచలించు ముంగురులు, స్వేదకణంబుల నింతజారు బొ
ట్టొదవు రతాంతకాంతిమెయి నొయ్యనకోలెడుకన్నుఁదామరల్
కదలెడు కుండలంబులును గల్గిన పౌరుషభాసమానయై
ముదితముఖారవింద మతిమోదము మీకు నొసంగుగావుతన్.

దీనికి సంస్కృతశ్లోకమిది:—

శ్లో. ఆలోలామలకావళిం విలులితాం బిభ్రచ్చలత్కుండలం
కించిన్మృష్ట విశేషకం తనుతరై స్స్వేదాంభసాం జాలకైః
తన్వ్యా యత్సురతాంతతాంతనయనం వక్త్రం రతివ్యత్యయే
తత్త్వాం పాతుచిరాయ కిం హరిహర బ్రహ్మాదిభి ర్దేవతైః.

తుదిపద్యమునకు ముందున్న వచనము:—

వ. "నాయికా పాదతాడితుఁడైన నాయకుఁడు మదనదేవునకుఁ బ్రియుఁడని కావ్యాంతమందుఁ గవీశ్వరుఁడు మంగళాచరణమును జేస్తున్నాఁడు.

ఉ. యావరసార్ద్రమున్ గిసలయారుణకోమలమున్ విమాత్నర
త్నావళి నూపురంబును మదాలసభావము నౌపదంబు చే
నేవరపూరుషుండు ప్రణయేర్ష్యఁ బరాంగనచేతఁ దాఁకితుం
డై విలసిల్లువాఁడు కుసుమాయుధ దేవునకుం బ్రియుండగున్.

ఈపద్యమున కమరుకుని శ్లోకమిది:—

శ్లో. సాలక్తకేన నవపల్లవ కోమలేన
పాదేననూపురవతా మదలాలసేన
యస్తాడ్యతే దయితయా ప్రణయాపరాధా
దంగీకృతో భగవతా మకరధ్వజేన.

గ్రంథాంతమునఁ గృతికర్త తననుగూర్చి యీరెండు పద్యములను జెప్పుకొని యున్నాఁడు.

క. ఇలఁ దాళ్లపాక సత్కుల
తిలక (శ్రీ)వేంకటేశ దీక్షితసుతుఁ డు

రుని బేర్కొనుటచే నెల్లూరు మండలమందలి యుదయగిరియో, తత్ప్రాంతమో యాతని నివాసమనియుఁ దెలియుచున్నది. ఈతని భార్య పేరు సావిత్రి. ఈతని గోత్రసూత్రములు తెలియలేదు.

ఈకవి యతులేఁబది విధములని యాక్రిందిపద్యమునఁ జెప్పి వాని పేరుల నుదాహరించి, లక్షణములను వ్రాసియున్నాఁడు.

క. కొండఱు యతులై దందురు
కొండఱు పదియందు రవియుఁ గొనకొనక మదిం
బొందుగఁ బంచాశద్వళు
లందముగ ఘటింతు సుకవులౌనని పొగడన్.

ప్రాసము లిరువదియారు విధములని నుడివి వారిపేరులను లక్షణములను వివరించియున్నాఁడు.

ఆంధ్రభాషామర్మములు, వర్ణఫలములు, సంధివిశేషములు, గణలక్షణములు, గణఫలములు, గణకూటములు, తత్ఫలములు మొదలగు ననేకవిషయములిందుఁ గలవు.

ఇతఁడు లక్ష్యములను దానే రచించెను. కాని యితరకవుల గ్రంథములనుండి గైకొనలేదు.

సీ. గీ. దీనమందార! కపిలాన దీవిహార!
ఘనదయాకాంత! గరళ పట్టణనిశాంత.

ఈకవికాలమును దెలిసికొనుటకుఁ దగినయాధారము లెవ్వియును గ్రంథమునలేవు. కృతిపతి గరళపురీశ్వరుఁడు. పూర్వకవిస్తుతి లేదు. ఇతరకవుల గ్రంథములనుండి లక్ష్యములను గైకొనలేదు. వంశవర్ణనము లేదు. ఇఁకఁ గాలనిర్ణయమెట్లు సాధ్యము?

కవితాశైలి తెలియుటకై యీతని లక్ష్యములనుండి మూఁడు పద్యముల నుదాహరించెను.

భిన్నవర్గయతి:—

మ. కనఁగా లక్ష్యములయ్యె సజ్జనమనః కంజార్క! భాలేందుమం
డన! సారంగకరాబ్జ! సద్గుణనితాంత శ్రీశ! సంజాలఖం

దన! గౌరీహృదయేశ! శంకర! కృతాంతస్ఫార దోర్గర్వలుం
ఠన! శ్రీపట్టణనివాస! రక్షితసుధాంధస్సంఘరాజా! యనన్.

తద్భవములు:—

ఉ. జక్కవ లంచలున్ జముఁడు జన్నము సత్రియు బత్తిలచ్చియున్
రక్కసి పన్నిసింగమును రచ్చ మొగంబును గాము నిద్దమున్
చక్కెర రిక్కలచ్చనము జవ్వనమున్ బయనంబు పక్కియున్
లక్కయుఁ గక్కసంబనఁగ లక్ష్యములయ్యె మహేశ! శంకరా!

చ. సరససభాంతరంబులను సత్కవితల్ రచియింపుఁడీ యనన్
గురుతుగ మాతృకార్చనము గూడదు గావున శారదావధూ
చరణసరోజ యుగ్మమును సన్నుతిఁజేసి కవిత్వమున్ ఘనం
బరయ ఘటింపవచ్చునని రాదికవీంద్రులు సానురాగతన్.

ఈలక్షణమంజరి ముద్రితము కాలేదు. ఆంధ్రసాహిత్య పరిష త్కార్యాలయమునందొక వ్రాతప్రతియున్నది.

"గరళపురి, కపిలానదు లెచ్చటనున్నవో అవిగూపయో తెలియ రాలేదు."

—***—

## 183 కాపూరి యెల్లయకవి

ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; శ్రీవత్సగోత్రుఁడు; వెంకనా మాత్యపుత్రుఁడు.

ఈకవి మిత్రవిందా పరిణయమను ప్రబంధమును, బ్రహ్మాండ పురాణమను నాలాశ్వాసముల పద్యకావ్యమును రచియించెను. మిత్ర విందాపరిణయ మిపుడెచ్చటను గానవచ్చుటలేదు. అందుఁ దనవంశ మునుగూర్చి విస్తారముగాఁ జెప్పియుండుటచే బ్రహ్మాండ పురాణమున మఱలఁ జెప్పలేదని యాక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

క. కరమొప్ప మిత్రవిందా
పరిణయమున నస్మదీయ పావనవంశం
బు రచించితిఁ గావున వి
స్తరముగఁ జెప్పఁబడదయ్యెఁ దత్క్రమమిందున్.

క. శ్రీవత్స గోత్రతిలకుం
డై వెలసిన సుకృతి వేంకనార్యసుతుండన్
కావ్యూరి యెల్లనాఖ్యుఁడ
శ్రీవల్లభ పాదపద్మ సేవారతుఁడన్.

బ్రహ్మాండపురాణము శ్రీరామచంద్రున కంకితమీయఁబడినది. ఇందు అర్థపంచక వివరణ ఖండము మాత్రమే చెప్పఁబడినదని యీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది. ఆపురాణము నంతయు నాంధ్రీకరింప లేదు.

గీ. అర్థపంచక విజ్ఞాన మమలహృదయ!
నీకు నెఱుఁగంగఁ జెప్పితి నెమ్మితోడ
దీని నెఱిఁగినవారు విజ్ఞానఘనులు
వారె శ్రీవిష్ణుపదమునఁ జేరువారు.

తిరుమల తిరువెంగలాచార్యుఁ డీతనిగురువని యీక్రిందిపద్యములోఁ గీర్తించియున్నాఁడు,

క. హరిపాదకమలసేవా
నిరతు విశుద్ధాంతరంగు నిర్మలచరితున్
తిరుమల తిరువేంగళ స
ద్గురు నాశ్రితముక్తిదాయకుని స్మరియింతున్.

బమ్మెర కేసకవి మల్లకవుల గురువుకూడ తిరుమలతిరువేంగళాచార్యుఁడే కావున వీరిరువురు నొకేవ్యక్తియని యెంచుటకుఁ దగిన యాధారములు లేవు. వీరిరువురు నొకరేయైనయెడల, నీయెల్లయ కవి కేసకవి మల్లకవుల సమకాలికుఁడై క్రీ. శ. 1600 సంవత్సరప్రాంతమున నుండియుండును.

ఎఱ్ఱనకవికృతనృసింహపురాణము కృతినందిన కుంటముక్కల మల్లన మంత్రికిఁగూడఁ దిరుమల తిరువెంగళాచార్యుఁడే గురువు. (ఎఱ్ఱనకవి చరిత్రమును జూడుఁడు. ఆ. క. త. 8 సం. 201 పుట) ఆతఁడును నీయెల్లయకవి గురువును నొకరే యని తోఁచుచున్నది. మల్లమంత్రి క్రీ. శ. 1500 ప్రాంతమువాఁడు. కావున నీకవియు నాకాలమునందుండి యుండునని నిశ్చయింపఁదగియున్నది.

ఇతఁడు సంస్కృతాంధ్రకవుల నీక్రింది పద్యములో నుతించి యున్నాఁడు.

సీ. కాళిదాసాది సత్కవులఁ బ్రార్థన చేసి
యాంధ్రకవీంద్రుల కాదియైన
శబ్దానుశాసను చరణముల్ సేవించి
హరిహరనాథ పదాబ్జభృంగుఁ
బ్రేమతోఁ దిక్కనసోమయాజి నుతించి
శ్రీభాగవత సుధా సేవనాభి
రతుని బమ్మెరపోతరాజు సన్నుతిసేసి
రామకథాసుధారసికులైన
భాస్కరుని రంగనాథునిఁ బ్రస్తుతించి
మఱియు ధారుణిఁ బరగు సమస్తసుకవి
వరుల సంప్రీతిఁ దలఁచి విద్వజ్జనముల
పాదపంకేరుహంబుల భక్తిఁగొలిచి.

ఇతఁడు బమ్మెరపోతనను నుతించియుండుటచే 1500 సంవత్సరమునకుఁ పూర్వుఁడు కాఁడు. పదునాఱవశతాబ్దివాఁడని నిశ్చయింప వచ్చును.

కావూరు అను గ్రామము గుంటూరు మండలమునందున్నది. దానినిబట్టి యీతని గృహనామ మేర్పడియుండును. ఈతఁడా గ్రామ నివాసుఁడేమో!

ఈకవి కవిత్వము లలితమై మనోజ్ఞముగానున్నది. శైలికై కొన్ని పద్యముల నిచ్చుచున్నాఁడను.

**బ్రహ్మాండ పురాణమువందలి పద్యములు :**

ఉ. ఇన్నియుఁ జెప్పనేటికి బుధేశ్వర! నిశ్చయమేన నీవు వి
ద్వన్నుత! నీదుసూత్రమున ధారుణిపైననుఁ బూజసేయు వి
ప్రన్నులు నస్మదంశజులు భక్తులు మచ్చరణాగతుల్మరి
న్నన్నె తలంతు రందుకతనన్ సులభంబుగ మోక్షమిచ్చెదన్. ఆ.౧

మ. అకటా! యీమనుజాధముం డిపుడు మోహాంధుఁడై యిట్టిపా
తకముల్ జేయుని దీని కేదిగతియో దారాత్మజార్థంబుగా
సకలాఘంబులు జేసినందుది వివస్వత్సూతి దండింపుచో
నొకరుండేకద వీఁడురారు తనయుల్ యోషిజ్జనుల్ బాంధవుల్.

చ. అనవుఁడు విష్ణుదత్తుఁడు మురాంతకు దూతలఁజూచి యిట్లనున్
ఘనభుజులార! యేజడుఁడ; కర్మవిహీనుఁడ; మూఢచిత్తుఁడన్
వనరుహనాభు కెన్నడును వందనమైన నొసంగనేర నే
దినమునఁ జేసినాఁడఁ బరదేవతకుం బరిచర్య సెప్పరే! ఆ 3

ఉ. వేదవిగర్హితంబు లగువృత్తము లెల్లను వరనీయముల్
వేదములం బురాణముల విశ్రుతమైన రమాధినాథు బ్ర
హ్మాదులు మానసాబ్జములయందు భజింపుచునుందు రట్టిదా
మోదరుఁ డాద్యునెట్లు భవదుక్తుల మానుదునయ్య ధీనిధీ. ఆ ౪

చ. వెలవెలఁబాఱె మేఘములు విశ్రుత మయ్యెనభంబు పంకముల్
దులదులవాఱె ధాత శశితోయజమిత్రులు కాంతి సంపదన్
వెలసిరి పద్మషండములు వేడ్క మరందము గ్రోలెఁ దుమ్మెదల్
కలకలు దేరె వారి శుభగస్థితినొప్పె సమస్త జంతువుల్. ఆ ౫

చ. మఱియును రామకృష్ణులు గ్రిమంబున గోపరిపాలనాథ్యులై
కరమనురక్తి పల్లవనికాయములం దమయీడువారి నా
దరమునఁగూడి యాడుచు ముదంబున వేణురవంబు సేయుచున్
సరసగతి న్వినోదములు సల్పుచు గోవుల మేపుచుండఁగాన్. ఆ ౬

ఈగ్రంథమున పరశురామ, బలరామ, కృష్ణావతారముల చరిత్రములు వర్ణితములైనవి.

—()—

## 184 అంగద బసవయ్య

ఇతఁడు ఇందుమతీ కళ్యాణమను ప్రబంధమును రచియించినట్లు రామాపెగ్గడ జగ్గన్నకవి ప్రబంధరత్నాకరమున నుదాహృతములైన యందలి పద్యములనుబట్టి తెలియుచున్నది. ఇంతకంటె నీకవి చారిత్రమేదియుఁ దెలియరాలేదు. ఈతని యింటిపేరు అంగదయా? అంగరయా? యని సంశయము కలుగుచున్నది. జగ్గనకవి కాలము క్రీ. శ. 1560 యగుటచే నీతఁడంతకుఁ బూర్వుఁడగుట నిశ్చయము. ఎంత పూర్వుఁడో తెలియదు. ఈతని యిందుమతీకల్యాణ మిప్పుడెచ్చటను గన్పట్టుటలేదు. ఉదాహృత పద్యములనుబట్టి యీతని కవిత్వము రసవంతమై మనోహరమైనది యని తోఁచుచున్నది.

మ. ఉదయ స్తంభములోపలన్ వెడలి తానుద్యత్తమో దైత్యునిం
గుదియంబట్టి గభ స్తిమన్నృహరి సక్రోధంబునన్ వాసి దు
ర్మదగాత్రంబు కరంబులం దునుమ ధారాళాస్రపూరంబు కా
విదివిం బర్వినక్రైవడిన్ గలయఁ బర్వెన్ సాంధ్యరాగచ్ఛవుల్.

ఉ. బీదళచీవిభుండు దితిబిడ్డలవార్యులు వారుపల్మఱున్
బాధలఁ బెట్టఁగాఁ జెఱలు వట్టఁగ నుండుట భారమంచు రం
భాది మరున్నివాస లస్రదప్సరసల్ చనుదెంచి వచ్చిరో
నా దరఫుల్లపద్మవదనల్ విహరించుదు రప్పురంబునన్.

సీ. హేమసింహాసనం బెక్క నుద్యోగించు
మణికల్పితాస్థాన మంటపమున,
విసరించుకొనఁ జూచు వింజామరంబున
వైరి వీరవిలాస వతులచేత

నాటింపఁదలఁచు నానాద్వీపసంధుల
గెలుపు గంబంబులు వలసినన్ని
దుష్టరాక్షసకోటిఁ దునుమ విచారించు
మఘవన్ముఖాఖిలామరులు వొగడ
గీ. సంతసము జహ్నుకన్యాతటాంతరముల
సద్వరంబులు గావింప నలవరించు
నెలఁత నిచ్చలు నిజగర్భ నివసదర్భ
కప్రభావ పరిప్రాప్తి గౌరవమున.
సీ. శశిమండలముమీఁద సాంద్రచంద్రికవోలె
నును మొగంబునఁ దెల్లఁదనము నిల్చెఁ
బసిఁడి కుండలమీఁద బలభిన్మణులు వోలె
వలిచన్ను ముక్కుల నలుపులొదవె
నిరుపేదమీఁది నిర్ణిద్ర సంపదవోలె
మధ్యభాగంబున మహిమఁ దాల్చెఁ
గదలిన లతమీఁది కమ్మపూవులువోలె
నలవని మేనసొమ్ములు దొలంగెఁ
గీ. దరుణిగమనంబు మిగుల మాంద్యము వహించె
వనజపత్రాక్షి కోర్కులు కొనలు సాఁగె
వనిత నేత్రాంతములు వసివాళ్లువాడె
వనిత తనువల్లి శయ్యల శయ్యల వ్రాలఁగడఁగె.
సీ. లాజవిమోక్ష వేళాసముద్గత హోమ
ధూమవాసన మేనఁ దొంగలింప
మృగనాభిమకరికా రేఖలై మృదుగండ
మండలిహోమధూమములు నిలువ
హోమధూమశిఖాముఖోష్ణంబు చోఁకి పూ
ర్ణేందుబింబాననం బెఱ్ఱవాఱ
మాటికి హోమధూమంబుచే వెడలెడు
కన్నీటఁ గాటుక కరఁగిపాఱ

గీ. గురుజనోక్తపథానానుకూలచాల (?)
నిజవివాహ విలాసంబు నిర్వహించి
భోజుఁడప్పుడు వేడుక బుధకవివి (?)
తానములతోడ నార్ద్రాక్షతములు సల్లె.

—) (—

## 185 కోడూరి వల్లభసూరి

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; రాఘవపండితుని పుత్త్రుఁడు; ఎఱ్ఱయామాత్య పౌత్త్రుఁడు; హారితసగోత్రుఁడు; కవి దేవేంద్ర బిరుదాంకితుఁడు; ప్రబోధానందస్వామి శిష్యుఁడు.

ఈకవి భాస్కరాచార్య విరచితమైన లీలావతినుండి పాటిగణితమును బొమ్మలాట కాళయ ప్రేరణముచే రచియించెను. ఈగ్రంథము ముద్రితముకాలేదు. అసమగ్రమై జీర్ణదశలోనున్న యొకప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నున్నది. ఈక్రింది గద్య పద్యములవలనఁ గవివృత్తాంతము కొంతవఱకుఁ దెలియఁగలదు.

గీ. ..................తుఁడ
సుజనహితుఁడ నాపస్తంబసూత్రకలిత
హారిత గోత్రపయోధి నీహారకరుఁడ
నలఘు చరితుఁడ వల్లభాహ్వయుఁడ నేను.

గద్య:– ఇది శ్రీపరమహంస పరివ్రాజకాచార్య ప్రబోధానంద శ్రీచరణ సద్గురుచ్ఛాత్ర హారితగోత్ర కోడూరు యెఱ్ఱయామాత్య పౌత్ర రాఘవసూరిపుత్ర కవి దేవేంద్ర పరనామధేయ సుజనవిధేయ సహజ ధైర్యవల్లభార్య విరచితంబైన లీలావతియనుపాటి గణితంబు.

కృతిప్రేరకుఁడైన బొమ్మలాటకాళయ; కర్ణాట సింహాసనాధీశ్వరులైన కృష్ణదేవరాయని, యచ్యుతదేవరాయనిఁగొలిచి వారిమన్నన లందినట్లును, కుమారతాతాచార్యుని శిష్యుఁడైనట్లును, ఈక్రింది పద్యములవలనఁ దెలియుచున్నది.

ఉ. శ్రీనరసింహనందను నరిందమ విక్రముఁ గృష్ణరాయ భూ
జానిని వెండియుం దదనుజన్ముని నచ్యుత దేవరాయనిన్
దానధికాప్తుఁడై కొలిచి తద్దయుమన్ననఁగాంచి మించు
ద్యానిధి బొమ్మలాట విరుపాధిపు కాళని ప్రార్థనంబునన్.

క. అనిపొగడ గణకు తానో
నన సంస్కృతభాష భాస్కరాచార్యులు చె
ప్పిన పాటిగ లీలావతి
నోనర్తుఁ దెనుఁగున......

సీ. నరస నరేంద్ర నందనుఁడైన యచ్యుత
దేవరాయల కృపాదృష్టిఁ జేసి
ఆందోళికారూఢుఁ డగుచును..... బొమ్మ
లాటకాళఁడు వేడ్క నర్థరాశి
లో నాత్మగురునాథుఁడైన కుమార తా
తాచార్య వర్యున కర్థమిచ్చి
ద్విజులకు శేషతృతీయముల్ రెండిడి
శేషపాదము కవి శ్రేణికొసఁగె

గీ. స్నేహమునఁ దన చెలులకు శేషనవమ
భాగపంచక మంతయుఁ బంచిపెట్టెఁ
గవి మహేంద్రున కర్పించె మిగిలినట్టి
వేయుమాటపదా అంతవి త్తరాశి.

గృహనామమునుబట్టి యీకాళఁడు తోలుబొమ్మల నాడించు వాఁడేమోయని స్ఫురింపుచున్నది. కాని యీసీసపద్యమునందు ఆందోళికారూఢుఁడనియు విద్యానిధి యనియు నుండుటచే నీతఁడేదియో యున్నతోద్యోగమునందుండినవాఁ డని స్పష్టమగుచున్నది. బొమ్మలాట సాంబయ్య (శ్రీంబరధరుఁడు) కిరాతార్జునీయమను యక్షగానమ్మును రచియించి యున్నాఁడు. ఆతఁడీవంశమువాఁడే యైయుండును.

ఈకవి నివాసము విజయనగర ప్రాంతమైయుండును. అచ్యుత దేవరాయల కాలమునం దీగ్రంథము రచియింపఁబడినట్లు పై పద్యము వలన స్పష్టమగుచున్నది. కావున క్రీ శ. 1585 ప్రాంతమున నీగ్రంథమును గవి రచియించెనని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. కృతి ప్రేరకుఁడైన కాళయ్య వేయి నూటపదాఱు రూపాయలను గవికొసంగినట్లు పై పద్యమువలనఁ దెలియుచున్నది.

స్కాందపురాణమందలి శంకరసంహితను రచించిన కోడూరి వెంకటాచల కవికిని యీవల్లభసూరికిని సంబంధము లేదు. ఇతఁడు హారితసగోత్రుఁడు. వేంకటాచలకవి కాశ్యపగోత్రుఁడు.

'కోడూరు' అను గ్రామములు పెక్కులుండుటచేఁ గవి గృహనామము గ్రామమునుబట్టి వచ్చియుండునని నిశ్చయించినను, ఆకోడూరేదియో నిర్ణయింపఁజాలము. అనంతపురము మండలములో హిందూపురము తాలూకాలో నొకటియుఁ గడపమండలములో జమ్ములమడుగు, రాజంపేట, చిద్వేల తాలూకాలలోఁ దలయొకటియుఁ గోడూరులున్నవి. ఇంకను నితర మండలములలోఁగూడ నున్నవి.

కడపమండలమందలి కమలాపురము తాలూకా, చిడిపిరాల గ్రామమును చంద్రమయ్య యనునతఁడును (ఇతనిని బొమ్మలాటరయితు అని యందురు.) బొమ్మలాట యమృతకవి యనునతఁడును తెరనాట కములాడుటకై పెదచిట్టయ్య యనునతనికిచ్చినట్లొక శాసనమున్నది (1). బొమ్మలాటవారిలో సాంబయ్య కవియై యక్షగానమును రచియించినవాఁడగుటను అమృతకవి తెరనాటకమాడుటకై గ్రామము నిచ్చియుండుటవలనను కాళయ్య విద్యానిధియై గణితగ్రంథ రచనమునకుఁ బ్రేరకుఁడగుటమూలమునను వీరిదాంధ్రభాషాభిమానమ్ముఁగల కుటుంబమనియు విశేషించి బొమ్మలాటయందెక్కువ యభిరుచి కలవారై యాకళను బ్రోత్సహించుచుండుటచే అదివఱకు వారి గృహనామ మేదియైనను

(1) A. R. 316 of 1928.)

బొమ్మలాటవారని మారిపోయినదనియు నిశ్చయింపవచ్చును. తెర నాటకమనఁగా తెరపై బొమ్మలనెక్కించి యాడించు నాటకమని యర్థము చెప్పవచ్చును.

చిడిపిరాల గ్రామమును దానమొసంగుటచే నాకాలమున నీబొమ్మలాటవారున్నత పదవులయందుండి రాజసన్మానముల నందుచున్నారని యూహింపఁ దగియున్నది. కృతికర్తకృతిభర్తలనివాసము కడప మండలమని యూహింపవచ్చును. బొమ్మలాటవారి కులమేదియో తెలియదు.

---

## 186 మద్దికాయల మల్లయ

ఈకవి రేవతీ పరిణయమును రచియించినట్లు రామాప్రెగ్గడ జగ్గకవి, ప్రబంధరత్నాకరములో నుదాహరించిన పద్యములవలనఁ దెలియుచున్నది. ఇంతకంటె నీకవినిగూర్చి యేమియుఁ దెలియదు, బలరామునకును రేవతికిని జరిగిన పరిణయమిందు వర్ణింపఁబడియుండెనేమో! ఈరేవతీ పరిణయమిప్పుడెచ్చటను గన్పడుటలేదు. జగ్గనకవి సేకరించిన పద్యములను బ్రబంధరత్నావళినుండి గైకొని యిటవ్రాయుచున్నాఁడను.

సీ. అమృతాంశుబింబంబు నవఘళింపఁగఁజాలు
తీయని పెదపెన తేనెపెరలు,
కలశాంబునిధి తరఁగలవిల్లనఁజాలు
సాంధ్రదీర్ఘవళక్షచామరములు,
తారకంబుల యొప్పిదములు గాదనఁజాలు
వైణవమౌక్తిక వ్రాతములును,
పండువెన్నెలగుంజుఁ బరిహసింపఁగఁజాలు
పరిపరిగతుల యబ్బురపుజున్ను,
గీ. నాదియగు దివ్యవస్తు సంహతులు దెచ్చి
యవనమండలపతి కుపాయనములిచ్చి

విన్నపము చేసె నిట్లని వేడ్కఁదనదు
డెందమున గందళింపఁ బుళిందవిభుఁడు.

మ. కటకండూయన మింతి నంతఁ జలుపంగాఁ దామ్రపర్ణీ మదో
త్కటదానంబులు నిండి చెందుకొన కస్తగ్రావ కూటోద్వహ
త్తటముల్నట్టఁగఁ జిర్కఁబాఱె నవినీతింబుల్ వడింబాఱె నా
బుటకన్యాప్తుఁడు గ్రుంకెఁ బశ్చిమమహాంభోరాశి పూరంబునన్.

చ. నిలయతమః ప్రతానము గణింప మరుంగులు సొచ్చినట్టుగా
నలరుపిఱింది నీడలు రతాంతదుకూల పరిగ్రహాత్వరా
కలితవిలాసినీనివహ కౌతుక హేతువులై చెలంగ ను
జ్జ్వలరుచి మించె గేహముల సంపెఁగ మొగ్గలవంటి దీపముల్.

ఈకవి పదునాఱవ శతాబ్ది పూర్వార్ధమువాఁడని తోఁచు చున్నది.

---

## 187 నామయోగి

ఇతఁడు బ్రాహ్మణుఁడు. తిరుపతి వేంకటేశ్వరస్వామిపై "వేంకటేశ్వరా" యను మకుటముతో 40 పంచచామరములను రచియించెను. ఈక్రిందిపద్యములోఁ గవితననామము నుదాహరించుకొనియున్నాఁడు.

"పామరుండనై మదించి బ్రహ్మజాతకుండనై
కాముకుండనైతి నిన్నుఁ గాననైతి నయ్యయో
తామసంబు మాన్చి నన్ను ధన్యుసేయుమీ భువిన్
నామయోగి హృన్నివాస నాథ వేంకటేశ్వరా!

ఈగ్రంథముయొక్క తాళపత్రప్రతి తంజావూరు పుస్తకభాండాగారమునందున్నది. కవి వివరము లేమియుఁ దెలియవు. పదునాఱవ శతాబ్దివాఁడని యూహింపనగును. ఈతని కవిత్వము ప్రౌఢమయినది కాదు. శైలి కొకపద్యము నిచ్చుచున్నాఁడను.

శ్రీరమాధిపా కృపాధురీణ సుప్రవీణ సం
సారదూర వాసరేంద్ర చంద్రకోటి భాసురా

నీరజాసనాది వంద్య నిర్గుణస్వరూప ఓం
కార నిర్వికార చిత్ప్రకాశ వేంకటేశ్వరా!

## 188 గౌ ర య క వి

ఇతఁడు స్వరమంజరి యను తత్త్వసార బోధకమగు నొక కావ్యమును రచియించిన ట్లీతని పౌత్రుఁడైన కొండయకవి తన పల్నాటివీర చరిత్ర కృత్యాదియం దీక్రింది ద్విపదలలోఁ జెప్పియుండుటచే నీకవి నామము మన మెఱుంగఁగల్గితిమి. ఈతనిగ్రంథము నాకు లభింపలేదు.

"పరమేష్ఠి సంతతిఁ బరగెడువాఁడ
వంశపారంపరి వర్ణింతుఁ గోరి
తత్త్వసారంబెల్లఁ దలపోసి కూర్చి
తేటతెల్లముగాను దెలుఁగువారలకు
స్వరమంజరి యనంగ జగములో వెలయఁ
జేసినపుణ్యుండు శివపదార్చకుఁడు
కౌండిన్యగోత్రుఁ డాగౌరయామాత్యు
డభిమాని యతనికి ననుఁగు నందనుఁడు

ఈకవినిగూర్చి యింక నేమియుఁ దెలియదు. కొండయకవి చారిత్రమునందుఁ గొన్ని విషయములఁ జూడనగును. ఈకవి గుంటూరు మండలమువాఁడని యూహింపవచ్చును. నియోగి బ్రాహ్మణుఁడు. ఇతనికాలమును దెలియదు.

## 189 వి శ్వే శ్వ ర క వి

ఇతఁడెవ్వరో ఎచ్చటివాఁడో ఎప్పటివాఁడో యేమియుఁ దెలియదు. ఇతఁడొక ఛందశ్శాస్త్రమును రచించినట్లు కస్తూరి రంగకవి తనయానందరంగరాట్ఛందమునఁ గొన్ని పద్యముల నుదాహరించి యుండుటచే నీకవినామ మెఱుంగనయ్యెను. ఈవి శ్వేశ్వరఛందము

నాకు లభింపలేదు. రంగకవి యుదాహరించిన పద్యముల నీక్రింద వ్రాయుచున్నాఁడను

గీ. దిక్ప్రసిద్ధంబుగా మును దీర్ఘమయ్యు
నవఘుతం సంయుతాక్షరమగుటఁ జేసి
ధరను శ్రీకార మతిశుభదాయి యగుచుఁ
గాంచె నాద్యుక్త లిఖిత విఖ్యాతిరామ.

గీ. మీను తూని కోల మిథునంబుఁ దేలును
ఎద్దు విల్లు మొసలి పెద్దమేకము
కుండ యెండ్రకాయ గొఱ్ఱెయు మగువతోఁ
గూడెనేని మిగులఁ గూడదండ్రు.

గీ. శశిగురు దినోదయంబుల సత్త్వమొదవుఁ
గుజకవి దినోదయంబుల రజము పరగుఁ
దరణి బుధశనిదినములఁ దమము వెలయు
నాల్గుగడియలు దనరు లగ్నంబు శనికి.

సీ. అశ్విని శతతారలవి రెండు నశ్వముల్
స్వాతిహస్తంబు లచ్చపుటెనుములు
తనరు పూర్వాభాద్రయును ధనిష్ఠయు హరుల్
భరణి రేవతు లవి భద్రకరులు
అభిజిత్తు మఱియుత్తరాషాఢ ముంగులు
రోహిణి మృగశిరల్ రూఢిఫణులు
గజ్యేష్ఠా శ్లేష పునర్వసు ల్పిల్లులు
మఖపుబ్బలవి రెండు మఱియెలుకలు
వినుత పూర్వాషాఢ విష్ణునామము కపుల్
పుష్యకృత్తికలవి భువి నజములు
బడి నుత్తరోత్తరా భాద్రలు గోవులు
వైశాఖచిత్తలు వఱలుపులులు

మూలయు నార్ద్రయు మేలైన శునకముల్
జ్యేష్ఠానురాధలు చెలగు లేళ్లు
మున్ను జెప్పిన వెల్ల నెన్నఁగాఁ బోతుల
పిదపఁజెప్పినవెల్లఁ బెట్టు దలఁప
పోతుఁ బోతు నైనఁ బోరంగఁ జొచ్చును
నాతి నాతియైనఁ బ్రీతిసేయుఁ

తే. బోతునాతికైన నాతిపోతునకైనఁ
గలహ మగుచునుండుఁ గాన నెఱిఁగి
స్వామిభృత్య పురుషసతులకు నాదిగా
నెంచి యోనిపొత్తు లెఱుఁగవలయు.

గీ. హరియుఁ గరియును బులిధేను వహియు ముంగి
సారమేయంబు మృగము నశ్వంబు మహిష
మరయఁ బిల్లియు నెలుక వానరము నజముఁ
జెలిమి యొండొంటి కెనయక పొలిసిపోవు.

సంస్కృతభాషలో రావు సర్వజ్ఞసింగమ భూపాలునిపేరఁ గృతి యిచ్చుచు చమత్కార చంద్రికయను నలంకార శాస్త్రమును రచించిన విశ్వేశ్వరకవిచంద్రుఁ డొకఁడున్నాఁడు. అతఁడితఁడగునా యని సంశయము కలుగుచున్నది. ఈయనుమానము వాస్తవమయ్యెనేని, యతఁడు బమ్మెర పోతనతో సమకాలికుఁడు కావున పదునైదవ శతాబ్దివాఁడని చెప్పవచ్చును. ఇతఁడు గాక

శివతత్త్వరసాయనమును రచియించిన విశ్వేశ్వర శివదేశికులును శైవధర్మముల నాంధ్రీకరించిన వెణుతురుబల్లి విశ్వనాథకవియు విశ్వేశ్వర నామధారు లిరువురు గన్పట్టుచున్నారు. వీరిరువురును లక్షణగ్రంథములను రచించినట్లెవ్వరును జెప్పలేదు. వినలేదు. ఇఁక వాఙ్మయ ప్రపంచమున విశ్వేశ్వరులు గన్పట్టుటలేదు.

అప్పకవీయమున నీవిశ్వేశ్వర ఛందస్సుదాహృతము కాలేదు. విశ్వేశ్వరపండితుఁడు చమత్కార చంద్రికయందు కేవలాలంకార

విషయమే కాకుండ విన్నకోట పెద్దన్న కావ్యాలంకార చూడామణి యందువలెనే ఛందోవిషయమునుకూడ వ్రాసియున్నట్లు కన్పట్టుచున్నది. ఆతఁడే యాంధ్రమున వేఱుగ నొక ఛందోగ్రంథమును వ్రాసెనేమో! ఇదమిత్థమని నిర్ణయింపజాలము.

విన్నకోట పెద్దన్నయే, కావ్యాలంకారచూడామణి కృతిపతి యగు విశ్వేశ్వరమహారాజు పేరుతో నీవిశ్వేశ్వరఛందస్సును రచియించెనేమో! అని మామిత్రులొకరు సూచించిరి కాని, కావ్యాలంకార చూడామణి యందష్టమోల్లాసమున ఛందోవిషయములు చెప్పియుండగా మరల నీఛందోగ్రంథము నేలవ్రాయునని సంశయము కల్గుచున్నది.



## 190. ఎడవల్లి పర్వతన్న

అప్పకవి, యీక్రింది పద్యములను, ఎడవల్లి పర్వతన్నవని చెప్పుచు నప్పకవీయమున లక్ష్యములుగా నుదాహరించియున్నాఁడు.

క. అంగజ సంహారుఁడగు
సంగరభీముండు ప్రళయ సమయోగ్రుండై
యింగల్లపుఁగంటఁ జూచిన
బంగరు కామయ్య మేను భస్మంబయ్యెన్.

మ. రణరంగంబున నీశితాసి, యురినోరం బూరిఁగ్రక్కొన్నఁదా
నణుమాత్రంబున్ వానిపైని దెగదాహచ్ఛిత్తి మూహింపఁగాఁ
దృణమే కావలె ద్వారకట్టు మొనకట్టిదాఢ్యణీ మండలిన్
బ్రణుత పాభవకందనోలిపుర గోపాల క్షమావల్లభా!

ఈపద్యమునుబట్టి, కర్నూలు పరిపాలకుఁడైన గోపాలప్రభుని కాలములో నీకవి యున్నట్లు తెలియుచున్నది. ఈగోపాలప్రభువు, అళియరామరాజునకుఁ దమ్ముఁడైన వెంకటాద్రికిఁ బౌత్రుఁడై యు

న్నాఁడు. వెంకటాద్రియు నీతఁడునుగూడఁ గర్నూలు పరిపాలకులే. కావున నీకవి క్రీ. శ. 1600 ప్రాంతమువాఁడై యుండుననియుఁ గర్నూలుప్రాంత నివాసికావచ్చుననియు నిశ్చయింపవచ్చును. ఈతఁడు రచించిన గ్రంథముల నామములైనను దెలియలేదు. ఏపయో గ్రంథములను రచించియుండిననేతప్ప యాతని పద్యముల నప్పకవి లక్ష్యముగాఁ దీసికొని యుండఁడు.

ఇంతకంటె నీతనిఁగూర్చి యేమియుఁ దెలియదు.



## -: మా ప్రచురణలు :-

దుర్గేశనందిని నవల

నవాబు నందిని ,,

విశ్వప్రయత్నము ,,

శ్రీ ,,

రాధారాణి ,,

చంద్రసేనుడు ,,

హిందూలా (సమిష్టికుటుంబము)

మదరాసు లోకలుబోర్డుఆక్టు రెండుసంపుటములు

మదరాసు సహకార సంఘముల ఆక్టు

**ఆంధ్రకవితరంగిణి సంపుటములు 1-14**

**హిందూ ధర్మశాస్త్ర గ్రంథనిలయము,**

కపిలేశ్వరపురం (తూ॥గో॥జిల్లా)